# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఏప్రిల్ 1966



సంపుటము 43 : : సంచిక 4 :

విడిపత్రిక వెల ఒక రూపాయి





శ్రీదేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు 28—వ పుణ్యవర్ధంతి
చైత్ర శుద్ధ ద్వాదశి శనివారం 2—4—66 న జరిగినది.

అరిది నివృత్తి మార్గములయందునగాని విముక్తి లేదునా
పరగిన వేళలో, విభవవార్ధులు త్రచ్చి, ప్రవృత్తి సారణుల్
వరలి, నివృత్తి సస్యములు పండినయట్లు, ప్రవృత్తి లోపలన్
కరము నివృత్తి తేజములు క్రమ్మ మహాత్మకుడై వెలింగెడున్.

# 'శిఖరారోహణ'

## 'బాలగంగాధర తిలక్'

లైట్లు వెలిగిన స్టేషన్‌లోకి రైలు వచ్చినట్టుగా
కొత్త సంవత్సరం కొత్తగా హుషారుగా రావాలి మనమధ్యకి.
కాని యీసారి ప్లాట్‌ఫారమంతా చీకటిగావుంది
పాత మాటల మూటలతో కవులూ
వట్టి మాటల సంచులలో రాజకీయవేత్తలూ
మొహమాటం లేకండా ముందెక్కి కూర్చున్నారు
రెయిలింగ్ అవతల టికెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నుంచున్నారు
రేపటి ఉదయానికి వేసిన పట్టాలు ఎవరో తొలగించివేశారు.

**2**

ఇక్షు కోదండ జ్యావల్లి నాస్ఫాలించబోయి
చటుక్కున ఎందుకో మన్మథుడు వెనక్కి అడుగువేశాడు.
ఆమ్ర శాఖాగ్ర పుంస్కోకిల సమ్మె ప్రకటించింది
పల్లవం ముట్టదు గొంతుక విప్పదు
అన్యోన్యానురక్తులైన యువతీ యువకు లొక్కసారిగా
హూలాహూప్ ట్విస్టు లాపేసి అసమ్మతి తెలియచేశారు
వాసంత సమీరం వస్తూ వస్తూ
ఊరిశివారున తుమ్మతోపులో స్తంభించిపోయింది
మాధవదేవునికి మర్యాద లెవరు చేస్తారు
సాహస చందనం ఎవరు పూస్తారు
సౌందర్య నేపథ్య మెవరు రచిస్తారు
జీవనవనంలో నవనవం సురభిళరమ్యం యౌవనకుసుమం
ఎవరు పూయిస్తారు.

**3**

గుమ్మం తగిలి తలమీద గొప్పికట్టినా గొవ్వకి నవ్విన
కొత్త కోడలులా వచ్చి నిలుచుంది కొత్త సంవత్సరం
బెదరుగా దిగులుగా ఎబ్బెట్టుగా నిలుచుంది కొత్తసంవత్సరం
జడుసుకున్న పిరికివాడు మగడు

జాలిలేని గయ్యాళి అత్తగారు
తన పూర్వపు హోదాని నెమరేస్తూ బతికే మామగారు
ఇంటిచూరు పట్టుకు వేలాడే ప్రేతాత్మలు గబ్బిలాలు
ఇంటివెనుక పాడుబావిలో మొలిచిన పిచ్చిమొక్కలు
ఇదే సమయం అని వీధిలో నిలిచి కన్నుగీటే మొనగాళ్లు
ఇదీ కథ—ఎలా రక్తికట్టిస్తావు, రసంపుట్టిస్తావు
ఈ వడగాలిలో హోరులో ఏ రాగం వినిపిస్తావు?

4

మనస్సెపుడో మొద్దుబారి మనుగడ పడికట్లు మరమేకుల్లో దిగబడి
మూల్గి మూల్గి మూలుగునే సంగీతమని మురిసిపోతోంది
ఎవరూ చూడడంలేదు
క్షితిజరేఖ వెనుక నిలిచి పిలిచే రత్నకంకణ హస్తాన్ని
ఎవరూ వినడంలేదు
నిద్రకీ మెలకువకీమధ్య ఒక్కక్షణం మ్రోగిన జంత్ర సంగీతాన్ని
అపుడు నేను కాలతీరాన ఒక్కణ్ణే నడుస్తున్నాను
చరిత్ర విచిత్ర సముద్రా లవలోకిస్తూ
అవి విసిరిన తుంపరలలో తడుస్తూ

అపుడు నామీదకి భవిష్యద్గగనం వంగి, నా
చెవిలో చెప్పిన రహస్యం విన్నాను
చేతిలో రాలిన తారల్ని పరీక్షించాను
అపుడు యీజిప్టు పిరమిడ్లమధ్య బాబిలోనియా స్తూపాలమధ్య
మొహంజెదారో శిధిలాలమధ్య నిలిచి కలలు కంటున్నాను
అలా అలా అనాది అనాది అంధకార భయంకరాటవుల మధ్య
సృష్టి సింహం చేసిన ప్రథమ గర్జ విన్నాను.
పెనుతుపానులో సముద్రాల ఉప్పెనలో
ఊగిఊగి లుంగలు చుట్టుకుపోతూన్న భూమి పేగుల్ని చూశాను
ఎగుడు దిగుళ్లదారిలో ఎదురైన సుద్దకొండలూ
అగ్నిపర్వతాలూ ఎడారుల చుట్టూ
గిజగిజలాడుతూ పెనగుతూన్న ప్రాణహరితాన్ని చూశాను

పచ్చబడిన భూమిమీద ఫక్కున నవ్విన సూర్యుడి సంతోషపు వెలుతురు
విచ్చిన ప్రాణంచుట్టూ ఉబికిన వెచ్చని ఎర్రని నెత్తురు
నిలదొక్కుకున్న ఆదిమానవుడు నిలిచి పూరించిన శంఖం

## 'శిఖరారోహణ'

ఇది సంగ్రామానికి సూచన
ఇది ప్రస్తానోపక్రమణిక
సీజర్ కౌక్షేయ ధార మెరసింది
అలెగ్జాండర్ అశ్వరింఖాఘట్టన మొరసింది
రాజ్యం రమణినీ మించిన రమ్య భావన విరిసింది
షేక్స్పియర్ డాంటే కాళిదాసూ శంకరుడూ
మార్క్సు మహాత్ముడూ పికాసో సార్త్రే
ఎవరైనా ఇది నిరంతర నూతన పరిశోధన
సత్య సౌందర్యాన్వేషణ ఒక శిఖరారోహణ.

## 5

కాలానికి ఒక రూపంలేదు దానికి పాపంలేదు
కాలం అద్దంలాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం

కాలం ఒక వలయం దానికి కేంద్రంలేదు.
ఎవడికివాడే యిచ్ఛాక్రియా బలంతో
వర్ణోజ్వల వలయాలను సృష్టించగలుగుతాడు.

కాలం జాలం లాంటిది
కళ్లు మూసుకుని నడిస్తే ఉచ్చులో పడతాడు
శక్తిపరుడు యుక్తిపరుడు దాన్ని ఛేదిస్తాడు

కాలం సవాల్ వంటిది
సాహసవంతుడందుకుని ముందుకు సాగిపోతాడు
చప్పబడిన పెద్దన్నయ్య చతికిలబడిపోతాడు
ఆహార సమస్య అయినా అణ్వాస్త్ర విపత్తయినా
ఆకలీ రోగం రణం వ్రణం ఏదయినా
ఈ ధాత్రీ వదనాన్ని వికృతంచేసే ఈ మనుగడని భారంచేసే
దుస్సహ పరిస్థితి అనారోగ్య మనస్థితి అసంతృప్తి అవాప్తి
అవివేకులూ స్వార్థపరులూ కలిగించిన దుష్ఫలితం
తమని తాము బంధించుకొన్న సూత్రాలలోంచి నమ్మకాలలోంచి
తప్పించుకోలేని మనుష్యుల నిస్సహాయ జనితం

కొత్తదారి తొక్కలేని కొత్త మలుపు తిరగలేని
కుంటీ_గుడ్డి వాళ్ల ప్రయాణ కోలాహలం
మురికికాల్వమీద ముసలితనంమీద మృషాజగతిమీద
మహోదయం వికసించదు వసంతం హసించదు
గదిలో కూర్చుని వసంతం వసంతం అని తన
మదిలో మలిన శృంగారతృప్తి పడేవాడు వికారుడు శకారుడు
సంప్రదాయభీరువుకీ అస్వతంత్రవితంతువుకీ వసంతంలేదు
సాహసికానివాడు జీవనసమరానికీ స్వర్గానికీ పనికిరాడు
హిమసుందర శృంగమైన ఎవరెస్టుని ఒక టెన్సింగే ఎక్కగలడు
సుమసుందర వసంతగీతంతో ఉగాది నాహ్వానించగలడు.

---



# పండితారాధ్య చరిత్ర

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఇప్పటికి ఇరువై యేడేండ్ల క్రిందట అనగా క్రీ. శ. 1939 లో పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రను ఆంధ్ర గ్రంథమాలాధిపతులు ప్రకటించి, ఆంధ్ర విద్వల్లోకానికి అందజేశారు. ఆ ప్రచురణ మూలంగానే ఆ గ్రంథ విశిష్టత, పాల్కురికి ప్రతిభా విశేషములు సాహిత్య ప్రపంచములో వెల్లడి య్యైనవని చెప్పుటకు సందేహములేదు. ఈనాడు సారస్వత విమర్శలలో వాఙ్మయ చర్చలలో, పండితారాధ్య చరిత్ర ప్రసక్తి లేని సందర్భమే యుండదనుటలో అతిశయోక్తి లేదు. అట్టి ఈ గ్రంథానికి పరిష్కర్తలు కీర్తిశేషులు కళాప్రపూర్ణులు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు.

పరిష్కర్తలీ మహాగ్రంథాన్ని బహుపరిశ్రమచేసి దిద్ది తీర్చడమేకాక, 348 పుటల ఉపోద్ఘాతముతో అలంకరించారు. పండితారాధ్య చరిత్ర అంటే పన్నెండవ శతాబ్దిలో తెలుగుదేశంలో వీరమాహేశ్వరాచారమనే సవైదిక వీర శైవమత సంప్రదాయాన్ని ప్రవర్తిల్లజేసిన మల్లికార్జున పండితారాధ్యుల చరిత్ర కాబట్టి, ఈ గ్రంథముయొక్క ఉపోద్ఘాతములో పండితునిగూర్చి, అతని రచనలను గూర్చి, అతడు ప్రపంచించిన ఆరాధ్య మత తత్త్వమునుగూర్చి విపులముగా ఉండవలెను. అయితే ఈ ఉపోద్ఘాతంలో పండితునిగూర్చి 72 నుండి 79 వఱకు 8 పుటలు మాత్రమే ఉన్నది. తక్కిన 300 పుటలలో కృతికర్తయైన పాల్కురికి సోమనాథుని గూర్చినవే 268 పుటలున్నవి. మిగిలిన 40 పుటలలో శైవ సంప్రదాయము, అణువత్తుమూవురు, వీరశైవ సిద్ధాంతము— అనే విషయాలున్నవి.

దీనినిబట్టి ఉపోద్ఘాతమంతా పాల్కురికి సోమనాథునికి సంబంధించినదిగాని పండితారాధ్యునకు సంబంధించినదికాదని స్పష్టమగుచున్నది. ఇంతకన్న విచిత్రమైన విషయ మింకొకటి— పరిష్కర్తలు పండితారాధ్య చరిత్ర ఉపోద్ఘాతము వ్రాయునాటికి 17 సంవత్సరముల పూర్వమే—పండితారాధ్యుని శివతత్త్వసారము, ముద్రితమైనది.[1] ఆ గ్రంథమునకు పరిష్కర్తలు సుగృహీతనాములు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు. వారు 8 పేజీల పీఠిక-40 పేజీల ఉపోద్ఘాతము వ్రాశారు. పండితుని జీవిత చరిత్ర—సప్రమాణంగా నిరూపించారు. పండితుని రచనలనుగూర్చి-మత సంప్రదాయాలనుగూర్చి తెలియజేశారు. అడుగడుగునకు పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రను ఉదాహరించారు. పండితుడు నివసించిన స్థలాల నిర్దేశం చేశారు. శివతత్త్వసారాన్ని పండితారాధ్య చరిత్రతో సంప్రతించి, శివతత్త్వసారంలో కంద పద్యాలే, పండితారాధ్య చరిత్రలో ద్విపదలుగా పొందుపడినవని మొదట చూపించారు. పండితారాధ్య చరిత్ర పరిష్కరణానికి, శివతత్త్వసార మొకవిధముగా ప్రాతిపదిక—అని ధ్వనింపజేశారు.

ప్రస్తుత గ్రంథము యొక్క ఉపోద్ఘాతంలో ముంత ముఖ్యమైన శివతత్త్వసారాన్నిగూర్చి ఈ క్రింది వాక్యాలున్నవి. "వీటిలో శివతత్త్వసారమొక్కటిమాత్రమే బయలుపడినది. తక్కినవన్నీ యేమైనవో తెలియదు. సోమనాథుడు శివతత్త్వ సారమును పండితారాధ్య కృతిగా చెప్పడమే కాకుండా దానిలోని చాలా భాగము ఉన్నదున్నట్లు ద్విపదలో ముపిడ్చి పండితారాధ్య చరిత్రలో చేర్చివేసుకొన్నాడు."

ఈ వాక్యాలనిబట్టి పరిష్కర్తలు—శివతత్త్వసారమును చూచియు దానిని ప్రామాణికముగా గ్రహింపలేదని, దానిని విస్మరించారని తెలియగలదు. దీనివలన ఈ గ్రంథం పరిష్కరణ కెట్టిలోపము గలిగినదో ఒక్కపట్టు చూపుచున్నాను.

పండితారాధ్యుడు బసవని చూచుటకు కల్యాణపురమునకు బయలుదేరి—త్రోవలో సారంగేశ్వరుడు దేవుడుగాగల నిడుగుడుములనుచోట వీర చాకి రాజయ్య ప్రణిపత్తికి నిలిచెను.

> "ఊరూర సద్భక్తులొగి నెదుర్కొనగ
> ముదమున నిరుగుడుములకు నేతెంచి
> సదమలాత్ముడు వీర చాకి రాజయ్య
> ప్రవ్యక్త భక్తి సారంగేశునంద."
>
> మహిమ. 178 పుట.

ఇచట 'నిరుగుడుములకు' అను పాఠము సరికాదు. పూర్వముద్రణములలో "నిడుగుడుములు" అను పాఠమున్నది. పరిష్కర్తలీ పాఠము చూడకుండుటచేత "నిడుగుడుములు"

1. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారిచే 13 వ గ్రంథముగా క్రీ. శ. 1922 లో ప్రకటితమైనది. ఈ గ్రంథము ఇప్పు డలభ్యము.

ఒక స్థలమని, ఊరిపేరని తెలియలేదు. శివతత్త్వసారపీఠికలో —24 పుటలో, నిడుగుడుములను గూర్చి యిట్లున్నది.

"నిడుగుడుములు అనునది కృష్ణాజిల్లా నందిగామతాలూకా మునగాల జమీందారీలో ముఖ్య గ్రామమగు "నడిగూడెము". పూర్వపు లెక్కలలో "నిడుగుడుములు" అనియే వాడుక. ఇక్కడ దేవుడు సారంగేశ్వరుడు."

ఇందుచేతనే సంజ్ఞావాచకపదపట్టికలో 'నిడుగుడుములు' లేదు.

శివతత్త్వసార పీఠికయేగాక, పండితారాధ్య చరిత్ర పరిష్కరణమునకు ఆధారములైన—ప్రతుల నన్నింటినికూడా పరిష్కర్తలు పరిశీలించినట్లులేదు. పీఠిక మొదటిలో తాము సంప్రతించిన ప్రతులనుగూర్చి పరిష్కర్త లిట్లువ్రాశారు.

"పండితారాధ్య చరిత్రము—అచ్చుపడినగుజిలీ ప్రతినిన్నీ, కొన్ని తాటాకుల ప్రతులనున్ను ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని బ్రౌనుదొర కొన్ని ప్రతుల పాఠములను గుర్తించి ఉంచిన రెండు కాగితపు సంపుటముల నున్ను దగ్గిర పెట్టుకొని గుర్తిస్తూ ఉండిరి."

కాని పండితారాధ్య చరిత్ర ప్రతులనుగూర్చి యిట్లు వ్రాయుట సమంజసముకాదు.—వ్రాత, ముద్రిత ప్రతుల వివరణలుండాలి.

## వ్రా త ప్ర తు లు

పండితారాధ్య చరిత్రకు వ్రాతప్రతులు తక్కువగానే యున్నవి. భాషోద్ధారకులైన బ్రౌనుదొరగారు— తెలుగు దేశములో కృష్ణాజిల్లా రాయలసీమనుండి ప్రతులు తెప్పించి— ద్విపదలను రెండేసి పాదాలుగా వ్రాయించి, పాఠభేదములతో పరిష్కరించారు. అవి 1086, 87, 88 సంఖ్యలలో నేటికీ మదరాసు ప్రాచ్య లిఖిత భాండాగారములో ఉన్నవి.

## ము ద్రి త ప్ర తు లు

పండితారాధ్య చరిత్రలో మహిమ ప్రకరణములో సహస్ర గణమాలికఉన్న భాగము—ఇప్పటికి 72 ఏండ్లక్రిందటనే ముద్రితమైనది. ఇప్పటి ముద్రిత ప్రతిలో పుట 59.ఎ "గురు మల్లికార్జునుడంత......అరిగె శీఘ్రము యమరారామున నకు" అను ద్విపద మొదలు 110 వ పుట "ఏటుంగంగవలయు" అనునంత వఱకు గల భాగము—సోమనాథస్తవము—కోటప్ప రగడ—(వారె కోటయరచితము) అను స్తుతులు గలిగిన ఒక సంకలన గ్రంథమున ముద్రితమైనది.2

## వరంగలు ముద్రణము

ఇది వరంగలులోని శైవ ధర్మ ప్రచారిణీ వారిది. వరంగలులో శివధర్మవర్ధని రామలింగేశ్వర ముద్రాక్షరశాలలో క్రీ. శ. 1909 లో ముద్రితమైనది. ఇదియే ప్రస్తుత పరిష్కర్తలుపయోగించినది. అయితే వారు భావించినట్లుగా ఇది గుజిలీప్రతి కాదు. విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రులవారు పరిష్కరించినది. దీనికి పీఠికాదులులేవు. గ్రంథము పూర్తిగ ముద్రితమైనది.3

## విశాఖపట్టణ ముద్రణము

ఇది క్రీ. శ. 1914 లో ముద్రితము. ఈ ప్రతి వివరము లిపలకు ప్రకటితము కాలేదు. కాబట్టి ముఖపత్రము నుదాహరించుచున్నాను.

శ్రీమాన్ జగద్గురు మల్లికార్జున

శ్రీ పండితారాధ్య చరిత్ర

శ్రీ మదష్ట భాషాసుకవిత్వ రచనా బిరుదాంకితులు

పాల్కురికి సోమనారాధ్యకవిచే రచింపబడినది

ఇ ది

మ॥రా॥ నిడుదవోలు సుందరపంతులవారిచేతను

శ్రీగుం॥శ్రీగిరి దిగంబర మల్లికార్జునస్వాములవారి సేవకుడగు

చింతకుంట పసుపుల వాగయ్యగారిచేతను,

మూడు ప్రతులనుచూచి సవరింపబడి

చింతకుంట పసుపుల వాగయ్యగారిచే

శ్రీ విజయరామచంద్ర ముద్రాక్షరశాలయందుముద్రింపించి

ప్రకటింపబడియె.

వి శా ఖ ప ట్ట ణ ము

1914. ఆనంద సం॥ ర. ఆషాడ బ ౧౩ సోమవారము.

ముఖపత్రముననున్న మూడు ప్రతులలో ఒకటి శ్రీశైల ప్రాంతముది; ఒకటి—ఏలూరునుండితెచ్చినది; వేఱొకటి విజయ నగరములో బిక్కవలిస్వామి గారిది. ఇవి నేడు లభ్యములుకావు. ఈమూడు ప్రతులతో సరిచూచిన యీ ప్రతిలో విశేషములు గలవు. ఇది తాళపత్ర ప్రతులతో తూ. చా. తప్పక ముద్రిత మైనది. కొన్నిచోట్ల లేఖక ప్రమాదాదులు సవరింపబడలేదు. అయిన పాఠనిర్ణయానికిది చాలా ప్రామాణికమైనది. అంతే కాదు. ఇందులో ద్విపద సంఖ్యానమున్నది.

## పండితారాధ్య చరిత్ర—ద్విపదలు

ప్రస్తుత ముద్రణమున—ద్విపదలకు సంఖ్యలులేవు. విశాఖ ముద్రణమున-గ్రంథప్రారంభమునకుముందు-10పుటల పీఠిక గలదు. పీఠిక అనగా, నేటి పీఠికకాదు. పండితారాధ్య చరిత్ర విషయానుక్రమణిక—ద్విపద సంఖ్యలు తెలిపేది. దానినిబట్టి వివరణము నిచ్చుచున్నాను.

---

2. క్రీ. శ. 1894 లో, ఏలూరిలో బాలాత్రిపురసుందరీ ముద్రాక్షరశాలలో మామిలా కందుకూరి భూషణరావు గారిచే ముద్రితమైనది.

3. కొమర్రాజు లక్ష్మణరావుగారు శివతత్త్వసార పరిష్కరణమున నుపయోగించిన ప్రతి ఇదియే.

పండితారాధ్య చరిత్రలో అయిదు ప్రకరణములున్నవి.

| | | | |
|---|---|---|---|
| ప్రథమప్రకరణము | | దీక్షా ప్రకరణము | 2000 ద్విపదలు |
| ద్వితీయ | ,, | పురాతన ప్రకరణము | 2720 ,, |
| తృతీయ | ,, | వాద ప్రకరణము | 2021 ,, |
| చతుర్థ | ,, | మహిమ ప్రకరణము | 2020 ,, |
| పంచమ | ,, | పర్వత ప్రకరణము | 3050 ,, |
| | | | 11811 |

ద్విపద గ్రంథ పరిష్కరణమునకు ముఖ్యాతిముఖ్యమైన ఈ సంఖ్యా విషయాన్ని పరిష్కర్తలు పూర్తిగా విస్మరించడము చేత గ్రంథముద్రణ ప్రామాణికతకు లోపము కల్గినది. నేటి ముద్రణమున సంఖ్యలువేసి చూచిన 11640 ద్విపదలు వచ్చుచున్నవి. మత గ్రంథమైన ఆరాధ్య చరిత్రలో, పంక్తులు లోపించుటకు అవకాశమేలేదు. ప్రస్తుత పరిష్కర్తలు—గ్రంథమునగల ద్విపద పంక్తుల నిర్ణయమునకు పాఠభేదములకు—సంస్కృత పండితారాధ్య చరిత్రమునే— ఆధారముగా గ్రహించిరి. విశాఖ ముద్రణమును చూడకపోవుటచేతను, సంఖ్యలీయకపోవుట చేతను—పరిష్కరణమున చాలాచోట్ల ''ఈ పాదములుసంస్కృతానువాదమునలేవు—పూర్వముద్రణమునలేవు'' అని వ్రాయవలసి వచ్చినది. దీనితో పాఠములలో కూడ—భేదములు కన్పట్టుచున్నవి. ఆ పాఠములన్నింటిని ఎత్తిచూపుట కవకాశములేదు.4 కొన్నింటినిమాత్రమే, ప్రకరణంవారీగా—చూపుతున్నాను. విశాఖ ముద్రణ ప్రతిని—వి. ము. అని పేర్కొన్నాను.

## దీక్షా ప్రకరణము

పుట 48. ''ద్వి. . . . . . . . . . . .త
గిరి సూతకే ప్రేతకే తథాయన, వ
సుధ 'గృహేయస్మిన్ ప్రసూతా' యనంగఁ
బదరుచు నంద 'సంభాగా త్తే'నఁగఁ (బ''

పై రెండు పంక్తులను ఉపోద్ఘాతము 175 పుటలో ''కొన్ని విశేష ప్రాసములు'' అను శీర్షికక్రింద వ్రాయబడి యున్నవి.

(3) దథప్రాసము
వ, సుధ 'గృహేయస్మిన్ ప్రసూతా' యనంగ
వదరుచు

పై రెండు చోట్లనిచ్చినది యొకదానికొకటి విరుద్ధము. మొదటిపాఠము—అనంగఁ బదరుచు—అని యున్నది. రెండవ పాఠము—అనంగ వదరుచు.....రెండింటియందు 'పదరుచు' అనునది క్రియ. ఈ రెండును నెంతమాత్రము సరికావు.

'పదరు' అను క్రియకు త్వరపడు, కోపించు, చలించు ఆక్షేపించు అని అర్థములు. ఈ యర్థము లొక్కటియు నిక్కడ పట్టవు—సరికదా విపరీతార్థము నిచ్చును.

విశాఖముద్రణ పాఠము (వి. ము.)

''ద్వి. . . . . . . ద
గిరి సూతకే ప్రేతకే తథా యనఁగ
సుద 'గృహేయస్మిన్ ప్రసూతా'యనంగఁ
బొదలుచు నంద సంభోగాత్తనఁగఁ''

ఇచ్చట పదరుచు—అను పాఠమే లేదు—'సంభాగాత్' అనుపాఠములేదు—పొదలుచు—సంభోగాత్తను—అను పాఠము లున్నవి. ఇవి సరియైనవి. ఇందుదాహరింపబడినవి—పాదోదక మాహాత్మ్యమునుండి గ్రహింపబడినవి. మూలమున అనగా సోమనాథ భాష్యములో పై సందర్భమున నిట్లున్నది

''ఆశౌచం నైవ విద్యేత సూతకే ప్రేతకే తథా
గృహేయస్మిన్ప్రసూతాస్త్రీ సంభోగాస్ప్ర శ్యఏవచ''

దీనినిబట్టి పాఠము 'సంభాగాత్' కాదనుటస్పష్టము. సంభోగాత్ సరియైనది.

పై పాఠములో 'రెండుచోట్ల సుద—పొదలుచు అని యుండుటచేత—ద, ధ ప్రాసమేలేదు—సుద—అనగా చివర. సోమనాథుఁడీ వేదవాక్యములు చొప్పించుటకు వాడిన—సంధి పదములలో నిది యొకటి. ఈ ముద్రణమున గల'దధ' ప్రాసమున ననుసరించి, సోమనాథుడు దధప్రాసము వాడెనని యొకచో వ్రాయబడియున్నది.6 కాని—పై పూర్వ ముద్రిత పాఠము ననుసరించి సోమనాథుడు దధప్రాసవాడలేదని చెప్పవచ్చును.

పుట 56. [నిర్వృతియు ధరియించి నిష్మభజించి
నిర్వృతి పదముఁదన నెలవుగా బడసె.]

పుట యడుగున—''ఈ పాదములకు సంస్కృతానువాదములేదు. వీటిని తరువాత నెవరో చేర్చి ఉంటారు'' అని కలదు. కాని అవి చేర్చినవికావు. గ్రంథములోనివే. వి. ము. లో.

నిరుతియు ధరియించి నిష్మభజించి
నిరుతిపదము దన నెలవుగా బడసె—అని య్రా

రెండును 28 పుటలో గలవు. ఇదియే—

'నిరురుతి ధరియించి నిష్మ భజించి' అని మఱియొక ముద్రణమున గలదు. ఇది సరియైన పాఠము. నన్నెచోడకవి కుమార సంభవమున—

---

4. ఈ కారణంచేతనే, సంఖ్యా వివరణ చర్చకూడా విడిచి పెడుతున్నాను.

5. దీనికే వీర మాహేశ్వరాచార సారోద్ధారమని పేరు. ''ఇది శ్రీ వీర మాహేశ్వరాచారసారోద్ధారే సోమనాథ భాష్యే పాదోదక మాహాత్మ్యం నామ సప్తమ ప్రకరణమ్—అని ప్రకరణాంతమున నున్నది. దీనికి మనోహరీయమను తెలుగు టీక గలదు. టీక అముద్రితము. భాష్యమునకు సంస్కృత ముద్రణములేదు.

6. పాల్కురికి ప్రావళ్ళు—పాల్కురికి సోమనాథ సంచిక—పరిశోధన—9. 10. 1955.

"నిరురుతి వారివారాయల కనిం బ్రతిమాయ లొనర్చి"
అని ప్రయోగించియున్నాడు. సంస్కృతమున 'నైఋతి' పదమునకు నిరురుతి - నిరుతి - తద్భవములుగా గ్రహింపనగును.[7]

పుట. 93. దక్షప్రాసము—

రూఢి 'సర్వం నమో రుద్రాయ' యనఁగఁ
గూడంగ 'సత్యేన కుర్యాత్త'నంగ

ఇట్టివే— మఱి రెండింటి నిచ్చియున్నారు.

"వేడుక నా యజుర్వేద సూత్రోక్తి
రూఢివై" పుట 46.
రూఢినసంఖ్యాతరుద్రుల బంట
పొడానఁ బాడిన ప్రమథులబంట. పుట 138.

వీని నన్నింటియందు—'రూడి' యనియే కలదు. సోమనాథుడు, దక్షప్రాస నుపయోగింపలేదు. గణపవరపువేంకటకవి రూఢి శబ్దమునకు—'రూడి' తద్భవమని చెప్పియున్నాడు.[8] నన్నయయు—"ఏడక్షోహిణులన్న పాండవ బలం బేకాదశాక్షోహి ణుల్ రూడిం గౌరవ సైన్య" మనుచో—రూడి—నే ప్రయోగించి యున్నాడు—(ఆది—1—69.)

పుట 205, 206 "పనిసేయ నిలుపుట్టు బానిస నయ్యు
పనివడు నెద్దుగా భవనంబు గావ
శునకముగానైన శూలి నీ భక్త
ఘన గృహంబులఁ బుట్టఁగాఁ గృపసేయు"

వి. ము. లో పనిసేయ నిలుపుట్టు బానిస నయ్యు
దునిపెట్టు నెద్దునయ్యును, నిలుగావ
శునకంబునయ్యును నసయంబు భక్త
ఘనగృహంబులఁ బుట్టఁగాఁగృపసేయు - అనికలదు.

ఇచట "దునిపెట్టు నెద్దునయ్యును" అనునది సరియైన పాఠము. దుని పెట్టు—అనగా 'దున్ని పెట్టు'.

ఎద్దు దున్ని మొదవై పాలిచ్చింది—అని సామెత. దున్ను అన్న క్రియకు—దును—అను రూపమున్నది.

క. దునకయు వెదపెట్టకయున్
దనరె నఖిల సస్యములును ధారణి—హరి.పూ.౧

పుట 236. "పఱతెంచి యా చెన్న బసవన్న మ్రొక్కి
అవసరవేళ లింగానందములర
శివయోగ నిద్రవోఁ జిక్కి మద్గురుడు"

వి. ము లో పఱతెంచి యా చెన్నబసవన్న మ్రొక్కి
అవధరింపుండు లింగానందములర.

అని పాఠము గలదు. ఇచట భక్తులకు చెన్నబసవన్న విన్నపము చేయుచున్నట్లు కొన్ని పంక్తులక్రిందనున్నది.

"మానుగా భాషయు, మహిమయు నెఱుఁగ
నా నేర్చు భంగి విన్నపము చేసెదను"

కాబట్టి "అవధరింపుఁడు" అనునది సరియైన పాఠము.

పుట 247, 248. [పొడవులు సెడి పాఱ పొందుల బూర
కడుసంభ్రమంబున గణములు గదలి.]

పుట యడుగున—"ఈ కుండలీకరణము చేసిన పంక్తులు వ్రాతప్రతులలోలేవు—అచ్చు ప్రతిలో నున్నవి" అని వ్రాయబడి యున్నది. కాని యీ పంక్తులు విశాఖముద్రణ. వి. ము. లో లేవు. ఉండవలసిన అగత్యములేదు. పై పాదములన్నింటియందు పాదాంత, పాద మధ్యమున నను ప్రాసలున్నవి. కడుసంభ్రమంబున గుణములు గదల—అనునది ఆ నియమమునకు తప్పినది.

## పురాతన ప్రకరణము

పుట 302, 303 "అనసూ పాడిచిన నయ్యె నీ కనక
నిరపరాధుల గొట్టనీతియే యనక
శరణులు విన్నను సైతురే యనక—
కదలక మెదలక గ్రక్కు మిక్కనక
నదరక బెదరక యక్కటా యనక."

వి. ము లో ఆనసూపాడిచిన యయ్యె నీ కనక
నినుఁజూచి నేనేల నిలిచితి ననక
వెనుదీక పరవక విసువక నాత్మ
నిరపరాధుల బరప నిహతియే యనక
శరణులు విన్నను సైతురే యనక
శిరముపై నడువంగ శివ శివా యనక
కరము శీతని కెంత కాఠిన్య మనక
కదలక మెదలక గ్రక్కు మిక్కనక

అనునధిక పంక్తులున్నవి. వీనిలో

"నిను జూచి నేనేల నిలిచితిననక
వెనుదీక పఱవక విసువక నాత్మ"

అను రెండును పుట యడుగున చూపబడి—అవి వ్రాత ప్రతులలో గ్రంథములో కానరావని వ్రాయబడియున్నది. కాని వి. ము లో నున్నవి. ఆపైని—

'శిరముపై నడువంగ శివశివా యనక
కరము శీతని కెంత కాఠిన్య మనక'

అను రెండును వీ ముద్రణమున లేవు.

పుట 331. ౧ భవు తెర్కుదురె భవపాశవిముక్త
గురుచరణాంభోజసరళసద్భక్త
గురుదయామృత రస శరధి నిషిక్త
గురుగుణప్రకరసంస్మరణానురక్త
గురు పరతంత్ర నిర్భర గుణోద్యుక్త
గురుకార్యచిరధురంధరకళాయుక్త
గురు మనోజ్ఞాంచిత చరిత ప్రసక్త
గురువర మహిమానుగుణ గురు భక్త ౮

---

7. శబ్దరత్నాకరానుబంధము—పుట—52.
8. ఆంధ్ర కౌముది. "రూఢి రూడియగు చంద్రుండు—చందు" పుట 2. సంజ్ఞాప్రకరణము.

. . . . . . . . . . .
యంచు భక్తానీక మచ్చెరువంది.

పుట యడుగున ౧. "పరు లెఱుంగుదురె యీ భవపాశముక్తి" ౨. ఈ పాదముతరువాత ఒకపాద మన్నిప్రతుల లోను లోపించినది,—అని కలదు.

కాని యిది సరికాదు. వి. ము. లో ఆపాద ముండుటయే గాక అంత్యానుప్రాస కూడ సరిగా నున్నది. పై పంక్తులలో విముక్త—ఇత్యాదిగా అకారాంతముగా నున్నది. కాని వి. ము. లో నిట్లున్నది.

"పరులెర్గుదురె భవపాశ విముక్తి
గురు చరణాంభోజ సరళ సద్భక్తి
గురుదయావృత రస శరధి నిషక్తి
గురుగుణప్రకర సంస్మరణానురక్తి
గురు నిరంతర పరిచరణానురక్తి
గురు విముఖ పదార్థ విరస విరక్తి
గురు పరతంత్ర నిర్భర గుణోద్యుక్తి
గురుకార్య చిర ధురంధర కళాయుక్తి
గురు మనోజ్ఞాంచిత చరిత ప్రసక్తి
గురువర మహిమానుగుణ గురుభక్తి"

లోపించిన పాదము 'గురు విముఖ పదార్థ విరస విరక్తి' అనునది యిందున్నది.

౩
పుట. 472. [పొరిఁబొరి నేడ్పసంబులును దదీయ
గురుని యాజ్ఞావన శిరమునఁ దాల్చి
మరలి యా భక్తుని మందిరంబునకు
నరుగుదే దొల్లింటి యట్ల భక్తుండు
మ్రొక్కి తత్కాల సముచిత సత్క్రియలు
నెక్కొల్పి లింగావసరము జెల్లించి.]

పుట యడుగున ౩ 'కుండలీకరణము చేసిన పంక్తులు పూర్వ ముద్రణములోలేవు' అని కలదు. కాని వి. ము లో పై పంక్తులన్నియు గలవు. పై ముద్రణలో "నెక్కొల్పి లింగావసరము జెల్లించి" అనుచోట యతి తప్పినది. ఇచట ప్రాస యతిలేదు. వి. ము. లో

"జక్కొల్పి లింగావసరము జెల్లించి" అని సరియగు పాఠమున్నది. (పుట 167.)

పుట 486. "ఆ మిండనికిఁ జెవి యాకీక యున్న
భామ శిక్షించిన బసవన్న వచ్చె"

ఇవి వ్రాత ప్రతులలో లేవని పుట యడుగున గలదు. కాని వి. ము. లో నున్నవి. పుట. 172.

## వాదప్రకరణము

పుట 520 +(పరవాది తస్కర బహుళ శూలంబుఁ
బరవాది వనలతా ప్రథిత దాత్రంబుఁ
బరవాది సారస వర నిశాకరునిఁ
బరవాది వార్ధి శుంభత్కుంభజన్ము.)

"+కుండలీ కరణము చేయఁబడిన పంక్తులకు సంస్కృతానువాదములేదు. అవి ప్రక్షిప్తములేమో" అని పుట యడుగున గలదు. కాని యివి పూర్వ ముద్రణములో వి. ము. లో నున్నవి. (పుట 182). సోమనాథుడిచ్చట తాను మున్ను రచించిన చతుర్వేద సారమునుండి స్వసంవాదము గావించుకొన్నాడు.

సీ. [9]పరవాది మదగజ ప్రబల పంచాస్యంబు
పరవాది భూధర స్ఫార యశని
పరవాది మేఘ నిర్భర పవమానంబు
పరవాది భూరుహ ప్రథిత పరశు
పరవాది తస్కర పటుతర శూలంబు
పరవాది జలనిధి బాడబాగ్ని
పరవాది భేకి భీకర ముఖాహి

గీ. దండన యరక బసవడు

కాబట్టి పై పాదములు ప్రక్షిప్తములు గావు.

పుట 538. కర్తయు జడుడు తత్కర్మ వశుండు
[1]గర్తయు దానెట్లు గర్మంబుఁ జేయు

'గర్తింప' అని పాఠము పుట యడుగున గలదు. ఇదియే సరియగునది. 'కర్తించు' అను క్రియ నిఘంటువుల కెక్కలేదు.

పండితారాధ్యుని శివతత్త్వ సారములో నిది కలదు.

క. కర్తయుని నిన్ను నెఱిఁగిన
కర్తింపఁగలేడు తన్ను కార్యాకార్యా
వర్తనలఁ గర్తనని
కర్త ప్రధానుండు గాన ఘన భక్తుఁడజా 148 ప.

కీర్తింపఁడు వెండిదన్నుఁ గార్యకార్యావర్తనల—అని ముద్రితము. ఇచట యతి తప్పినది. వ్రాతప్రతిలో 'కర్తింప' అని కలదు.

పుట 590. బౌద్ధంబు 'సిఱుతల' బంటియులేదు.
సిద్ధంబుగా శైవ సిద్ధుల కనిన—

'సిఱుతల' అనుదానికి 'గిరుతల' పాఠాంతర మీయబడినది. వి. ము. లో తిరుతల—అని కలదు. తిర్రుతల అనగా గొఱిగిన తల 'బోడితల' అను నర్థము చేయవచ్చును. ఇది 'తిఱుతల' యని శకటరేఫతో నుండవలెను—కన్నడమున కిఱు—తిఱు—రూపాంతరము లున్నవి.

పుట 610. శ్రీకంఠు జడలపై శీతాంశుడున్న
నాకసంబునయందు లేకుండ వలదె.

పుట యడుగున "ఆకసంబున యబ్జారియున్నెని శ్రీకంఠు జడలపై లేకుండ వలదె— ఈ పాఠము కవ్యభిప్రేతము గాదు" అని కలదు. వి. ము. లో పై పంక్తుల వెనుక "ఆకసంబునన యబ్జారియున్నెని" అన్న పంక్తులున్నవి.

---

9. శ్రీనాథుడీ పరవాది ద్విపద పాదములను శివరాత్రి మాహాత్మ్యమునందనుకరించియున్నాడు (1—36.)

ప్రకరణమునుబట్టి యీ రెండు పాదములు మూలములో నుండవలెను.

పుట 633. '[సురల ప్రార్థనఁ జేసి జూటంబు గంగ
ధరణికి బిందు మాత్రమునను హేమ
నగముపై బడి యది నాల్గుదిక్కులను
డిగి వేఱు వేఱ పుటిల్ల నామముల
నాల్గు దిక్కులు పుణ్యనదులుగా నొప్పి
నాల్గు వారిధులకు నడచిన విధము
బోవుచు నా గంగ భువిని మర్త్యులకు
బావనంబుగఁ జేయఁ బాల్పడ్డ విధము
దేవు డానతి యిచ్చె దేవికి నిట్లు.]

'కుండలీకరణము చేయుబడిన పంక్తులు పూర్వ ముద్రణమున లేవు—చి. నా.

కాని పై తొమ్మిది పంక్తులు తూ. చా. తప్పకుండ వి. ము. 221 పుటలో గలవు.

## మ హి మ ప్ర క ర ణ ము

ఈ ప్రకరణమున పాఠ భేదములు హెచ్చుగా నున్నట్లు ముద్రిత గ్రంథమువలననే తెలియవచ్చును. కొన్ని మాత్రమే చూపుదును.

2 వ భాగము పుట19 1[శివు మహాత్త్వముఁ గాదఁ జెప్పనేమిటికి
శివు ధిక్కరించిన శివు గురుద్రోహి
బౌద్ధుండు నోరను బాపంబు ద్రుచ్చి
యద్దర విలి విలి యని దొర్లుచున్న
బ్రూవుల పోక యిభ్భువి సాక్షి యతని
చావుమున్ సాక్షి దూషకుడు నౌటకును]

1. "కుండలీకరణము చేయబడిన పంక్తులు పూర్వ ముద్రణమున లేవు." కాని యివి వి. ము. లో నున్నవి. చతుర్థ ప్రకరణము—పుట 5, 6.

పుట 39. '[అదిగాక శివనాగమయ్య కక్షములు
మొదల నిచ్చిన స్వామి ముదిసెనే నేడు?
కన్నప్పగారికి కన్నుల క్షణమ
మున్నిచ్చిన శివుండు ముడిగెనే నేఁడు
కాళిదాసికిఁ దొల్లి కన్నుల రాశి
లీల నిచ్చిన శూలి లేఁడె యీ నేఁడు.]

1. పూర్వ ముద్రణలో లేవు. వి. ము. 11 వ పుటలో నున్నవి.

పుట 43. [వలికినట్టుల జగత్ప్రత్యయ దృష్ట
ఫలసిద్ధిఁ బొందించు భక్తిగావునను
బుచ్చిన నేత్రంబు పుచ్చు నేత్రంబు
బుచ్చునంతటను తా వచ్చు నేత్రంబు
వచ్చులోనన మఱిపుచ్చిన కన్ను
పుచ్చు నా కన్నులు వచ్చుట గాక.]

పూర్వ ముద్రణలోలేవు. వి. ము. 12 వ పుటలోనున్నవి.

పుట 63. "జైన బౌద్ధ మహేంద్రజాల3 విద్యా వి
తానంబులనుఁ బోదు దథ్య మీ ద్రవణము—

3. దివ్యాది—ఇచట సంస్కృతానువాదమున రాజ బాంధవు లీ మాట యన్నట్లున్నదని మూలమునిచ్చి 64 పుటలో పెద్ద చర్చ గావించిన వైనమున్నది. కాని యీ చర్చయంతయు ననావశ్యకము. వీనికి ముందుగా "శమింపకున్నను—జన నియోగంబు" అని రాజోద్యోగులు పేర్కొనబడినారు—వారు "తవిలి సజ్జన విరోధంబు మేలనుట— మేలనగా "ధరణీశ్వరు నకు—హర మహత్త్వము దెల్లమై కానబడుడు" అని అన్వయము.

పుట 143. "తిరునాళ్ల జూతునన్ భరమున నుండి"
ఈ పాఠమున వాడుకలో నున్న పదము లోపించినది.
"తిరునాళ్ల జూచు సంబరమున నుండి" అని వి. ము.

పుట 154. "హరుఁడు నిరాకారుఁడయ్యు (సూరాంబ
వర మనో భక్తి) భావనఁ గానఁ బడియె"

పుట యడుగున—నిట్లున్నది.

"సద్భక్త; కరమనోగ్రహణతఁ గానంగఁ బడియె" అని వ్రాత ప్రతి పాఠము. సంస్కృత గ్రంథములో 'నిరాకారోపి సర్వేశ స్సూరాంబా భావనస్తథా ప్రత్యక్షం దదృశే సర్వై ర్జనైరతను వైభవః' అని ఉన్నది. దీని కనుగుణముగా కుండలీ కరణము చేసిన మాటలను నేను చేర్చినాను. చి. నా." కాని ఇదియంతయు ననవసరము.

"హరుఁడు నిరాకారుఁడయ్యు సద్భక్త
కరమనోగ్రహణంబుగానంగఁ బడియె"

అని వి. ము.

హరుడు నిరాకారుడైనప్పటికిని, భక్తకరము లనెడి మనస్సులలో కానవచ్చుచున్నాడని యర్థము. ఇంతేకాక పై పాదములలో ఏ భక్త ప్రశంసలేదు. తరువాత భక్త ప్రశంస వచ్చుచున్నది.

అంగద సూరసానమ్మగారికిని
జంగమంబు స్వయంభు లింగమై తోచె—

అని యుండుటచే పై చోట 'సూరాంబ' అను మార్పు చేయ వలసిన యగత్యము లేదు.

'కానఁబడియె' అనుటకన్న 'కానంగబడియె' అనుట ప్రాచీన పరిపాటి—నన్నయ్య ప్రభవింపంగబడిన (ఆది4—156) (అరణ్య—4—471.) వినిర్మింపంగఁబడిన—అను రీతిని వాడి యున్నాడు.

ట 184. (గణనాథునం దసంఖ్యాకులైనట్టి
గణములగాంచి నిర్గత బాహ్యుఁడగుచు
శ్రీకంఠునకును బారిషదుల కరయ
నేకాలమున వేఱు లేకుండుగాన
నాగణంబుల మాఱుగాగఁ బ్రాణేశు
నే గతియని నుతింపుంచెనో యనఁగ.)

"వీనికి సంస్కృతానువాదములేదు. బ్రౌను దొరగారు గ్రంథపాతముగా నిచ్చినారు" అని పుట యడుగున గలదు. వి. ము. లో పై పంక్తులున్నవి. చివరి పాదములో పాఠభేద మున్నది. ఈ పాఠము సరియైనది.

ఆ గణంబుల మాఱుగాఁగ బ్రాణేశు
డే గతిగా నిరూఢిని స్తుతియించె—

లింగమునం దసంఖ్యాత గణములను గాంచియు శివునకు గణములకు అభేదముగాన—ఆ గణములకుమాఱు శివుడే 10స్తుతియించెను—అని యర్థము.

పుట 186. "తన్మహిమయు వించు దానిట్లు భక్తి
చిన్మయానంద వశీకృతబుద్ధి3
స్ఫురియింపశివుఁజూచి చూచి క్రాలుచును."

పుట యడుగున 3 : ఈ పాదము తరువాత బ్రౌను ప్రతిలో

"ఆ లీల ప్రమథగణానంద వార్ధి
దేలుచు మునుఁగుచు దృఢతర భక్తి
శివునిలోఁ జిత్తంబు జేర్చి వెండియును
శివుకంటె నన్యంబుఁ దవులక యుండి"

అనే పంక్తులున్నవి. "ఇవి వ్రాతప్రతులలోగాని, ప్రాతముద్రిత ప్రతిలోగాని లేవు. వీటికి సంస్కృతానువాదములేదు." అని వ్రాయబడియున్నది.

కాని పై నాలుగు పంక్తులును—వి. ము. లో నున్నవి, పుట. 72. పై నాలుగు పంక్తులు గ్రంథ సందర్భము ననుసరించి మూలములో నుండవలెను. వీనివీడగల పంక్తులలో గణములతో శివుని నుతియించినట్లు కలదు—కాబట్టి గణానంద వార్ధిఁ దోలాడుట జరిగినది. ఇవి మూలమున చేర్చదగియున్నను ఈ ముద్రణమున చేర్పబడలేదు.

పుట 188. "పండితారాధ్యుల పంచేంద్రియములు
దండధరారి పాత్రంబులు గావె
పండితారాధ్యుల పంచేంద్రియములు
చండీశ వరదు భాజనములు గావె."

పై పంక్తుల మొదల రెండు పాదములు లోపించినవి—

పండితారాధ్యుని పంచేంద్రియములు
చండ విషాంకుని స్థానముల్ గావె
పండితారాధ్యుని పంచేంద్రియములు
దండధరారి పాత్రంబులు గావె—అని. వి. ము.

## పర్వత ప్రకరణము

పండితారాధ్య చరిత్రమున ప్రకరణములన్నింటికన్న నిది పెద్దది. ఇందును పాఠభేదములు చాల గలవు. కొన్ని మాత్రమే యుదాహరింతును.

పుట 229. 1"మాయా విముఖ వీర మాహేశ్వరాది
నాయకకోఘానర్ఘ్య నాయకమణుల

"ఈ రెండు పంక్తులున్నూ - అచ్చు పుస్తకములో లేవు." వి. ము. లో నున్నవి. పర్వత ప్రకరణము పుట 1.

పుట 253. "×ఆ శిలాదునకు దానై కీర్తిసేయఁ
గా శక్యమే నీళగళుఁ డెర్గ్గఁగాక"

× ఈ పాఠము నేను కల్పించినది. ప్రతులలో ఎక్కడా లేదు. "మహిమ నాశిలాదునకైనను కీర్తిసేయ" అనిన్ని "నాశిలామునకునైనను కీర్తిచేయ" అన్నిన్ని పాఠములున్నవి. అందులో అఖండయతి వస్తుంది. చి. నా.

"ఆశిలాదునకైన ననుఁకీర్తిసేయ" అని. వి. ము.

ముద్రణమునసున్న కల్పిత పాఠము సరికాదు. ఆపైని పంక్తులలో నిట్లున్నది.

శ్రీగిరి మహిమ దా శేషునికైన
వాగీశ్వరునకైన వాసుకికైన
చను వేదవేదాంతశాఖల కైన
సూతునకైన వ్యాసునికైన—ఇచ్చటయన్నియు

'కైన' అని యున్నవి. దీని వెనుక—

.................జిత్ప్ర
భా తనుండట్టి శ్రీ పర్వతుఁ గన్న
యా శిలాదుకైన నను కీర్తిసేయ
గా శక్యమే"

'ఆ శిలాదునకు దానై'యనగా—క్రమము తప్పినది. అను కీర్తిసేయ అనినచో క్రమము సరిపడును. అఖండ యతిరాదు.

ఆ శిలాదునకైన నను కీర్తిసేయ11 అను కీర్తిసేయ-అని పదచ్ఛేదము.

పుట 313. ×"నలసుల కలశములమరులాతములఁ
బులితోలు కంబళంబుల గద్దియలును"

ఈ పాదమునకు సరియైన పాఠము దొరకలేదు—అని కలదు.

---

10. 'స్తుతియించు'—ఇది 'నిర్జినామంబులన్ యఁగాగ మంబుగలుగదు'అను బాల వ్యాకరణ క్రియాపరిచ్ఛేద సూత్రము (65) చేత సాధ్యముకాదు—కాని యిట్టి ప్రయోగము నన్నయభారతమందిని 'హరిహర హిరణ్య గర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి' అని కావించి యున్నాడు. ఇది ప్రారంభమున రెండవ పంక్తిలో నున్నది.

11. అనుకీర్తించు—అను కీర్తిసేయు— శివకవి ప్రయోగము. మసురుద్రుడుగాని యతండనుకీర్తింపండు. శివతత్త్వసారము—174 ప.

కాని వి. ము. లో పాఠ మిట్లున్నట్లున్నది.

''ననసుల గలశములమరునాకులము
లును జవితొల్కంబళులగద్దియలును —
పుట 26.

దీనినిబట్టి ముద్రణములో నిచ్చిన రెండు పదములు సరికావు. 12ననసుల గలశములు—అనగా—కడియములుగల కలశములు—పాత్రలు. జవి తొల్కంబళ్లు—ఉన్నితోనేసినకంబళ్లు.

పై అపపాఠము ననుసరించి ''పులితోలు (కంబళము)'' ఆచ్ఛిక పదముల పట్టికలో నీయబడుట సరికాదు.

పుట—161.

పుట 320. ''పలుక వాగలు నేత పట్టెలుగూర్చి
పొలుపారు పాదరక్షల భాతిమెట్టి''
పలక నావల నేత పట్టెలు గూర్చి
పొలుపారు పాదరక్షల భాతి మెట్టి—వి. ము.

ఇచ్చట 'పలక' అనగా సన్నని రాతి పలక. దీనికి కన్నములు పొడిచి, పట్టెడతో రెండు పాయలుగా బంధించి—పాదరక్షలవలె యుపయోగించెడివారు. కాబట్టి 'పలక' అనునది సరియైన పాఠము.

పుట 321. ''పలుకలు నెరయు నేర్పడిన పదార్థ
ములు జెంచులును మొకరెల యున్న మొలలు''
ముద్రణ పాఠము

పలకల నేర నేర్పడిన పదార్థ
ముల చంచులును—మోర్లుగల యున్నమొలలు వి. ము.
ముద్రణ పాఠమున కర్థములేదు.
వి. ము. పాఠమున కర్థము.

పూర్వము వంటపదార్థములు—బియ్యము, పప్పు మొదలగునవి రాతిపలకలపై బోసి రాళ్లు మొదలైనవి లేకుండ, ముక్కు విరిగినవి కాకుండ—ఏరెడివారు.

పలకల నేరిన ప్రాసంగు ప్రాలు— అని పల్నాటి వీరచరిత్ర. ఆ ఏరిన తరువాత, వానిని సంచులలో పోసెడివారు.

పలకల......చంచులును— అన్నంతవఱకు నిది యర్థము. మోర్లుగల యున్న మొలలు—మోర్లు అనగా ముఖములుగల యునుపచీలలు అనగా మేకులు.

పుట 336. నడుమాకసంబిట్లు నాడి యుగమున
నెడపక భూతంబులేను వర్తింప...
నడుమాకసం బిట్లు నాది యుగమున
నెడపక భూతంబులేనువర్తింప

(పుట యడుగున)

ఇచట 'నాడి'కి బదులు 'నాదియుగము' అనియే యుండవలెను.

ఆదియుగమున—పూర్వమున

పుట 341. ''నెరలి పుణ్యాంగనానివహ మేతేర—''
నెరవి పుణ్యాంగనా నివహమేతేర వి. ము.

నెరవి—అనగా కూడి అని యర్థము.

పుట 346 . . . . . . వలుద

మకుటముః ల్ గోహళల్—మణి ప్రేలు జడలు
మకుటముల్ గోహళుల్ మణిప్రేలు జడలు—వి. ము.

ఇచట 'కోహళుల్' అని యుండుటయే సరి—ముద్రితపాఠము 'గాహళల్' సరికాదు.

శ్రీనాథుడు హరవిలాసమున—

మౌళింగోహళి సంఘటించిన క్రియన్—అని—కోహళి పదమువాడినాడు. ఇది తలపై ధరించు టోపీవంటిది. 'కోహళి' అను పదమునుండియే కుళ్లా—అను పద మేర్పడినది—కోహళి సంస్కృత పదము—ఏకవచనము. కోహళులు బహువచనము.

''నిరుపమకోహళీ యుగళి నించి'' అను సమాసమున నిది ప్రయుక్తము—

ఈ ప్రయోగము నారన సూరన వనమాలీవిలాసము లోనిది—

పండితారాధ్య చరిత్రలో పై కోహళి పదము మతసాంకేతికముగవాడబడినది—శివాలయములో లింగమునకు నాగాభరణ ముండును. అది లింగము చుట్టునుండి లింగముపైకి—ఐదు ముఖములతో సగము ఛత్రాకారముగనుండి లింగమునకు తగులకుండ పైభాగమున పెట్టిన మస్తకాభరణము వలె నుండును—శాసనములలో—

''భీమేశ్వరునకు బంగారాన పంచవక్త్ర కోహళి చేయించిరి—'' అని కలదు. పూర్వము రాజులు బంగారమున, నిట్టి కోహళులు చేయించెడివారు. ఇచ్చట—కోహళులే దాల్చినవారు—పిచ్చుకుంటులు—వీరు రాగితోగాని యిత్తడితోగాని చేసిన ఐదు ముఖముల నాగాభరణమును తలపై పెట్టుకొందరు—

పుట 350 '' . . . . . . . బోడ

తప్పరంబుల కమండలములు గద్దె
కంబళ్లు.''

పుట యడుగున—కమండలువులు—అనిపాఠమీయబడి యున్నది.

''తప్పరంబులు కమండలువులు గద్దె'' అని వి.ము. కాని యిచ్చట యతి తప్పినది.

''తప్పరంబులు కమండలువులు'' అని యుండదగును.

---

12. ఇందే 322 వ పుటలో ''ననసులు
వెట్టిన యలంతిలాకులము
లొనరంగఁ దాల్చి వ్రతోద్యుక్తి నడువ''
అని కలదు. లాకులము అనగా దండము.

## అరవ దేశపరుస

పుట 398. ఇందు పదహారు పంక్తులు తమిళభాషలో నున్నవి.

"అరులు గిరితి యెన్నెయవనే పిరానె
చిరిగిరి నిలయనె చివనె యాణ్డవనె
అంగమాఱుందానె యాయిందుం దవనె
మంగయుర్ పొంగనే మల్లికార్జునవె
యాయునక్కడియనే నఖిల నాయకనె
యాన విల్లాలనె యిల్ల విల్లియనె
× అఱువత్తుమూవురక్కాత్మ నాయకనె
మఱునాలు మరియాద మల్లికార్జునవె
ఆలాలగండనే యాదియుత్రవనె
చూలియే మల్లికార్జునవె యున్నవనె.
యెల్ల యిల్లాదానె యెజ ముళ్లవనె
చొల్లవల్లాదానె మల్లికార్జునవె
ఆఱుమ్మిడత్తిరు నీఱు ముళ్లవనె
యేతేఱుమీచనె యెల్లమల్లయనె
వేదియరుతు దక్కు మాదియే చివనె
చోదియే మల్లికార్జునవె యున్నవనె"

× ఈ ద్విపద ప్రతానులో లేదు—అనియున్నది. కాని యిది పూర్వముద్రణములో వి. ము లో ఉన్నది. పై పంక్తులలో కొన్ని పాఠములు సరికావు. సరియైన పాఠములు నిచ్చుచున్నాను.

"యేనవిల్లాలానె యిల్లవిల్లియనె"

ఇది "యేన విల్లాదానె యినుయ విల్లియనె'—అనియు

మఱునాలు మరియాద మల్లికార్జునవె

ఇది మఱైనాలు మఱియాద మల్లికార్జునవె—అనియు

ఆఱుమ్మి డత్తిరు నీరు ముళ్లవనె

ఇది ఆఱుమ్మిడుం తిరునీరు ముళ్లవనె—అనియు

సవరింపవలెను. ఇమయవిల్ల-అనగా మేరువు విల్లుగా గలవాడు; మఱైనాలు—అనగా నాలుగు వేదములు; ఆఱుమ్మిడుం—ఏఱును ఉంచునట్టి అని అర్థము.13

## గ్రంథాంతము

పర్వత ప్రకరణము చివర అనగా గ్రంథాంత భాగమున నున్న భాగము చాలా ముఖ్యమైనది. ఆ భాగము పాఠభేదములను చర్చింపవలసిన యావశ్యకత కలదు కావున నా భాగమంతయు నుదాహరించుచున్నాను.

"అనుచుఁ గన్నడ గౌళ నంకించు పదము
లనురాగమునఁ బాడ నభవుఁడాలించి
పండిత ధృఙ్మనఃపరిపూర్ణుఁడై య
ఖండిత పర్వతాకార లింగంబు
నిర్భరకారుణ్యనికటకటాక్ష
గర్భార్భకుని నాత్మ గర్భస్థుఁజేసి
యంతలోనన పండితారాధ్యునాత్మ
సంతతియును గులసతి సమేతముగ
లింగోదరమునందు లీనమై రట్లు
సంగతంబగు శివాజ్ఞా పత్రసరణి14

శివగణ ప్రార్థనఁ జిక్కిన సకల
భువన పావనుని యపూర్వతనూజుఁ
దరిత సంసారుఁ గేదారయ్యఁ బుణ్య
భరితు లోకారాధ్య పట్టంబుఁ గట్టి
ప్రస్తుత శంభుఁడౌ పండితారాధ్య
హస్తాగ్రజుండు దోనయ్యయు భక్త
వర్గంబుఁ గొనియాడ వసుధఁ దద్గురుఁడ
నర్గళ భక్తి రాజ్యము సేయుచుండె
నతఁ గేదారయ్య యాత్మ సంతాన
సంతతియును శైవసంతాన సంత
తియు భువనారాధ్య తేజోవిభాతిఁ
గ్రియ గొని యతుల భాగీరథీ తీర్థ
భావన లోకముల్ పరమ పావనము
గావింప—మఱియట్లు గాక

గేదార దేశికు గీత చరిత్రు
గాదిలి సుతచతుష్కముఁ జెప్పనొప్పు
మనుమ పండితుఁడు భీమనపండితయ్య
యును మహాదేవయ్యయును చెన్నవిభుఁడు
ననఁగ గురుచతుష్క మాత్మ సంతాన
తనయ పరంపరోత్తర పరంపరలఁ
బరిచిత గురు పరంపర దేజరిల్లు
ధర వృషభేంద్రుపాదచతుష్కసరణి
ధ్రువ పురుషార్థ చతుష్క విస్ఫురణ
సవిశేషభవ్యమోక్షచతుష్కహేల
వాలారు శ్రీనగద్వారచతుష్క
లీల వార్ధిచతుష్కవేలాధరిత్రి:

సముదిత మహిమఁ దచ్ఛైవ సంతాన
విమలాంబునిధిమధ్యవిభ్రమానర్ఘ్య
నాయకరత్నంబునా లోకగురు స
మాయుత ప్రీతి నొప్పారివటారి
సోమనాథయ్య విశ్రుత వీరభక్తి
భూవిహాభిరామ విస్ఫురణ వెలుంగ

13. ఈ సవరణలను నేను తమిళ విద్వాంసుల కీర్తిశేషులునగు వెంకటరాజులు రెడ్డిగారివలన గ్రహించితిని.

14. మూలమున పంక్తులు నొకదానితో నొకటి కలిపి ముద్రితములైనవి. అర్థస్ఫురణకై నేను విభాగించి వ్రాసితిని—ద్విపదలకు సంఖ్య నేను వేసితిని.

వారి పుత్రులు భక్తివర్ధన పరులు
సూరీశ్వరుండు లోకారాధ్యపద వి
హారుండు విశ్వనాథప్పయ్యగారు
కారుణ్య నిధులు సింగనమంచిగారు
ననఁగ గురుత్రితయాన్విత తనయు
తనయు పరంపరోత్తరపరంపరలు
ప్రభుతర గురు పరంపర తేజరిల్లెఁ
ద్రిభువనంబులఁ బర్వెఁ ద్రిపథగభాతి 50
వేదత్రయ విభాతి విశ్రుతాగ్ని త్ర
యోదిత కలిత మహోన్నత ఖ్యాతి
దానిట్లు కృతి సమాప్తంబయ్యెనంత
మానుగాదుది పంచమ ప్రకరణము. 54

పై భాగమునకు పూర్వముద్రణములలోను వ్రాత ప్రతులలోను నీ క్రింది పాఠములు గలవు.

| | పూ. ము. | వి. ము. | వ్రా. ప్ర. |
|---|---|---|---|
| 1.పంక్తి | అంకించుపదము | అంకించిపదము | అంకించిపదము |
| 5,6 ,, | జేసియుంతలోన | జేసినంతలోన | జేసినంతలోన |
| 9. ,, | లీనమైరట్లు | లీనమైరట్లు | లీనమైనట్లు |
| 12. ,, | అపూర్వతనూజా | తనపూర్వతనూజా | నిన్నపూర్వతనూజ |
| 31. ,, | తేజరిల్లు. | | |
| | దేజరిల్ల (పుట యడుగున.) | తేజరిల్లు | తేజరిల్ల |
| 43. ,, | వెలుంగ | వెలుంగు | వెలుంగు |
| 49. ,, | తేజరిల్లె (ల్లు, ల్లి, పుటయడుగున). | తేజరిల్లు | తేజరిల్ల |
| 53. ,, | నంత | ననగ | ననగ |

పై ద్విపద పంక్తులనుండి ఈ క్రింది విషయములు మనకు స్పష్టపడుచున్నవి.

1. పండితారాధ్యుడు లింగైక్యమైనంతనే, ఆతని శిష్యుడైన దోనయ్య పండితారాధ్యుని కొమారుడైన కేదారయ్యకు లోకారాధ్యపట్టము కట్టెను.
2. కేదారయ్య భక్తి సామ్రాజ్యమును పాలించుచుండెను.
3. కేదారయ్యకు ఆత్మ సంతానము—శైవ సంతానము గలరు.
4. ఆత్మ సంతానము 1. మనుమ పండితుడు 2. భీమన పండితయ్య. 3. మహాదేవయ్య. చెన్న విభుడు.
5. శైవ సంతానము—అనగా శిష్య సంతానము—ఇవటూరి సోమనాథయ్య సోమనాథయ్య కుమారులు 1. సూరీశ్వరుడు. 2. విశ్వనాథప్పయ్యవారు. 3. సింగనమంచి.
6. పై వారందఱు నుండగా పండితారాధ్య చరిత్ర—సమాప్తమయ్యెను.

పై విషయములనుబట్టి పండితారాధ్య చరిత్ర రచన పూర్తియగునాటికి, పండితారాధ్యుని కుమారుడు, నలుగురు మనుమలు, కుమారుని శిష్యుడు, ఆతని కొమాళ్లు ముగ్గురు—జీవించియున్నారని స్పష్టమగుచున్నది. వీరందఱునూ సమకాలీనులు.







ఈ సమకాలిక గురు పరంపరను వర్ణించిన విధము పరిశీలించి పాల్కురికి సోమనాథుడు—వీరందఱి సమకాలికుడనితెలియుచున్నది. పండితారాధ్యులు క్రీ. శ. 1170 ప్రాంతమున లింగైక్యము చెందెను కావున—పండితుని కుమారుని మనుమల కాలమున ననగా క్రీ. శ. 1200 ప్రాంతమున నున్నట్లు నిశ్చయింపవచ్చును.

పై వారిలో కేదారయ్య శిష్యుడైన ఇవటూరిసోమనాథయ్య రెండవ కుమారుడగు విశ్వనాథప్పయ్య సోమనాథుని కవితాగురువు. సోమనాథుడు తన ప్రథమ కృతియగు అనుభవసారమున తన గురువు నిట్లు నుతియించియున్నాడు.

## వి శ్వ నా థ య్య

"ఆ. వె. విమల చిత్రమూర్తి విశ్వేశు వరమూర్తి
వినయవర్తి భువన వినుతకీర్తి
విభు కరస్థలంబు విశ్వేశు కారుణ్య
జనిత వినుత కావ్యశక్తియుతుడ" 38 ప.

తరువాతి కృతియగు బసవ పురాణమున[15] నీ గురు ప్రశంస గలదు.

15. బసవపురాణము. ద్వితీయ ముద్రణము. ఆంధ్ర గ్రంథమాలా ప్రచురణము 1952.

ద్వి. సకృతాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకట వరప్రసాద కవిత్వయుతుఁడ—(1—79.)

ఇట్లవతారికయందేగాక, ప్రతి యాశ్వాసాంతమునను నిట్లు గలదు.

ద్వి. చరలింగ ఘన కరస్థలి విశ్వనాథ
వర కృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణమను కథయందు
ననుపమంబుగ.......నాశ్వాసమయ్యె

ఈ కరస్థలి విశ్వనాథ గురు ప్రశంసతోబాటు—బసవ పురాణమున—కరస్థలి సోమనాథయ్యగారి ప్రశంస గలదు.

## సో మ నా థ య్య

శ్రీశైలమంటపమునగోష్ఠిలో సోమనాథుడే సోమనాథయ్య గారి నిట్లు పేర్కొన్నాడు.

''పండితారాధ్య కృపా సముద్గతుఁడు
మండిత సద్భక్తమార్గ ప్రచారి
విలసిత పరమ సంవిత్సుఖాంభోధి
నలి గరస్థలి సోమనాథయ్యగారు (1—29.)

దీనినిబట్టి యీ సోమనాథయ్యగారును, పాల్కురికి సోమనాథుడును, సమకాలికులగుట స్పష్టము. మఱియు సోమ నాథుని కవితాగురువగు కరస్థలి విశ్వనాథయ్యగారికీ కరస్థలి సోమనాథయ్యగారు తండ్రియని మీద నే నుదాహరించిన వంశ వివరణమునుబట్టి తెలియగలదు. అయితే బసవ పురాణమున 'కరస్థలి' యని యున్నది. పండితారాధ్య చరిత్రయందు 'ఇవటూరి' అని యున్నది. దీని కెట్లు సమన్వయమని సందేహము కలుగవచ్చును. కాని యట్టి సందేహమున కెడములేదు.

ఇవటూరి వా రనునది ఇంటిపేరు. కరస్థలమనునది శైవ సంప్రదాయిక నామము. దీనినిబట్టి సమన్వయమైనది. కేదారయ్య శిష్యుడు—16'ఇవటూరి సోమనాథయ్య—కరస్థలి
సోమనాథయ్య
ఇవటూరి విశ్వనాథయ్య—
కరస్థలి విశ్వనాథయ్య.

వీ రిరువురును తండ్రి కొడుకులు—వీరిలో సోమనాథయ్యగారు ప్రసిద్ధులు.·

(పశేషం)

---

16 ఇవటూరివంశమున, తరతరములుగా గురుపదము వహించిన వారెంతోమంది విలసిల్లిరి—భక్తపరుడైనబమ్మెరపోతనకు, వేదాంతకవి వేమనకు, ఇవటూరి సోమశేఖరుడు గురువు. ఇంకను పోతన వంశీయులగు కేసన మల్లనలకు ఇవటూరి గుర్వయ గురువు. మల్లవరపు వాలేశ్వరుడు,ఆజ్జరపు పేరయలింగము మొదలగు కవుల కందరకు—ఇవటూరివారు గురువులు—ఆ యా కవుల గ్రంథావతారికలనుబట్టి, ఇవటూరివారి వంశవృక్షము నేర్పఱచి, వారిని గూర్చిన సమగ్ర చరిత్ర తెలుసుకొనవలసియున్నది.



# టి. యస్. ఎలియట్ కవితా శిల్పము

శ్రీ యస్. రాధాకృష్ణమూర్తి

విజ్ఞానరంగంలోగాని, చిత్రలేఖనంలోగాని, కవిత్వంలో గాని మరొక రంగంలోగాని ఒక విప్లవాత్మకమైన మార్పు వచ్చినపుడు మనం తికమక పడటం సహజం. ఐన్‌స్టయిన్ ప్రతిపాదించిన ఫోర్త్ డైమన్షన్ ఎలా ఉంటుందో ఊహించడం సామాన్యంకాదు. పికాసో బొమ్మలు పిచ్చిగీత లనుకోటం సహజం. ఎలియట్ వ్రాసింది కూడ కవిత్వమేనా అని మనం ఆశ్చర్యపడతాము. అయితే విజ్ఞానశాస్త్రానికి ఒక సదుపాయముంది. అందులో ఒక క్రొత్త విషయం ప్రతిపాదింపబడ్డపుడు 'మనకు అర్థంకాలేదు. ఇదేదో గొప్పసిద్ధాంతం అయ్యుండాలి' అనుకుంటాము. అంతేకాని విజ్ఞానవేత్తయొక్క మనస్థిమితాన్ని శంకించము. చిత్రలేఖనంలో కూడ యీవిధమైన ఆదరణకు ఆస్కారం ఉంది. బొమ్మ ఎంత అర్థం కాకపోతే దాని విలువ అంత ఎక్కువ. పికాసో కావాలని పిచ్చిగీతలు గీసి కొన్నాళ్లు కళావిక్రేతల కంట్లో దుమ్ముకొట్టి లోలోపల నవ్వుకున్నాడట. కాని కవిత్వంలో మాత్రం ఎందుకనో అలా జరుగదు. ఒక కవి క్రొత్త శిల్పాన్ని సృష్టిస్తే అర్థంకాక తికమకపడ్డవాళ్లు 'ఇది వట్టి చెత్త. కవిత్వంకాదు' అనేస్తారు. టి. యస్. ఎలియట్‌ను గురించి మొదట్లో చాలామంది అలానే అనుకున్నారు. అలా అనుకోడానికి కారణం అతడు కవితాశిల్పంలో ఊహించరాని విప్లవాత్మకమైన మార్పులు తేవడమే.

ఎలియట్ తన కావ్యాలంతటా ఒకే శిల్పాన్ని ప్రయోగించలేదు. ఒక శిల్పంలో పరిణతి సంపాదించిన తరువాత దాన్ని వదిలి యింకో శిల్పాన్ని చేపట్టేవాడు.

Every Phrase and every sentence is
an end and a begining,
Every Poem an epitaph.

కాని ఎలియట్ తెచ్చిన యీ మార్పులు కేవలం వైవిధ్యం కోసం, నవ్యతకోసం చేసినవికావు. అతడు చెప్పదలచుకున్న విషయానికి అనుగుణమైన శిల్పాన్ని సృష్టించటం అనివార్యమైంది. రొమాంటిక్ తత్త్వం ఎలియట్‌కు బొత్తిగా పడదు. రొమాంటిక్ కవులకు ఆత్మకంటె అభివ్యక్తీకరించదగిన వస్తువులేదు. అంతర్వాణికంటె వినదగిన దైవంలేదు. అంతర్జ్యోతికంటె అలౌకికమైన కాంతిలేదు. కవియొక్క మనోభావాల కంటె యీసృష్టిలో తెలుసుకోదగిన విషయం లేదు. ' ఈ విధమైన ఆత్మనిష్ఠమైన కవిత్వం విశృంఖల వైయక్తికతలోకి దిగజారింది. ఎలియట్ వ్యక్తికి ప్రాధాన్యం యివ్వడు. కవిత్వం ఆత్మాభివ్యక్తీకరణంకాదు. ఆత్మసంయమనము. ఆత్మసంహననము.

The Progress of an artist is a Continual self-sacrifice, a continual extinction of Personality .... .... Poetry .... is not the expression of Personality, but an escape from Personality.

రొమాంటిక్ కవులు తమ మనోభావాల్నేకాక తమ సర్వావస్థలను యథాతథంగా చెప్పారు.

My heart aches

అంటాడు కీట్సు.

We look before and after
And pine for what is not!
Our sincerest laughter

With some pain is fraught
Our sweetest songs are those that tell of saddest thought.

అంటాడు షెల్లీ. కవియొక్క వ్యక్తిగతమైన భావానికి గాని ఉద్వేగానికిగాని కావ్యంలో స్థానం లేదంటాడు ఎలియట్. ఆభావానికి ఉద్వేగానికి కావ్యరూపం యివ్వాలంటే వాటిని స్ఫురింపజేసే ఒక వస్తువునో, చేష్టనో, దృశ్యాన్నో చెప్పాలి. ఇదే నాటకీయ శిల్పం. దీన్నే ఎలియట్ objective correlative ద్వారా వ్యక్తం చెయ్యడం అన్నాడు. ఎలియట్ కవిత్వంలో కొన్ని మైలురాళ్లను తీసుకొని అతడు సృష్టించిన శిల్పాన్ని పరిశీలిద్దాము. ఎలియట్ పుస్తకరూపంలో ప్రథమంగా ప్రచురించింది 'Prufrock and other observations' (1917). ఇందులో 'The love song of Alfred prufrock' మరియు 'Portrait of a lady' అన్నవి రెండూ ముఖ్యమైన గేయాలు. ఈ రెంటిలోను నేటి స్త్రీ పురుషుల వ్యర్థ జీవితాన్ని చిత్రించాడు. ప్రూఫ్రక్ అంటాడు.

I have measured out my life with coffee spoons. ఈ ఒక్కవాక్యంలో అతని వ్యర్థ జీవితం మెఱపులా మెరుస్తుంది. ,

'Portrait of a lady' లో

She has a bowl of lilacs in her room
And twists one in her fingers while she talks.
'Ah, my friend' you do not know, you do not know,
What life is, you who hold it in your hands;'
(Slowly twisting the lilac stalks)

ఈ గేయంలోని స్త్రీలాగ జీవించిన జీవితం ఆమె చేతిలోని కలువ పుష్పాలలాగే నలిగిపోతుంది. ఇటువంటి భావమే The waste land లో కూడ కనిపిస్తుంది.

What shall we do to-morrow ?
What shall we ever do ?

అన్న వ్యర్థప్రశ్నకు నిరర్థకమైన జవాబు.

The hot water at ten
And if it rains, a closed car at four.

ఏ ఆధ్యాత్మిక ఆశయాలులేని చర్వితచర్వణమైన జీవితాలను ఎలియట్ చిత్రించాడు.

'జెరోన్షన్' ఒక వృద్ధుని స్వగతం. కాని యిందులో యితర స్వరాలు కూడ కొన్ని వినిపిస్తాయి. కేవలం తర్కంతో సర్వమూ అర్థంచేసుకునే యత్నంలో జీవితాన్ని వ్యర్థం చేసుకొని, జీవన సంధ్యలో కళ్లు కనబడక ఎవరి చేతనో చదివించుకుంటూ, తన శుష్కాత్మను సిక్తంచేసే వర్షం కోసం ఎదురుచూస్తున్న ఒక హేతువాది భక్తిశూన్యమైన జీవితం, జీవన్మరణం యిందులో వస్తువు.

I have no ghosts

అంటాడు జెరోన్షన్. ఇక్కడ దయ్యాలు ఆధిభౌతిక అస్తిత్వానికి ప్రతీక. హేతువాది తన చర్మచక్షువులతో చూచిందీ, చంచలమైన మనస్సుతో ఆలోచించిందీ తప్ప దేనినీ నమ్మడు. వేరే ఏదయినా ఉన్నదంటే నిదర్శనం కావాలంటాడు. నిదర్శనం చూపిస్తే అది మంత్రశక్తి మాత్రమే నంటాడు.

Signs are taken for wonders. We would sea a sign!

ఇక దైవచింతనాపరుల మనుకున్నవారు కూడ నిరీశ్వరులకన్న భిన్నంకాదు.

To be eaten, to be divided, to be drunk
Among whispers;

రొట్టి క్రీస్తు దేహంగాను మద్యం అతని రక్తంగాను భావించి సేవించటం క్రైస్తవ మతసంప్రదాయం. పై పాదాల్లో శ్రద్ధాశూన్యమైన కర్మానుష్ఠానం సూచితం. ఇక్కడ 'whispers' అన్న పదం గమనించదగింది. 'మెల్లిగామాటాడటం'లో దివ్యభావపూర్ణమైన ప్రశాంతతకు భంగం కలుగుతుందన్న భయం కాదు, అంతటి పవిత్ర సమయంలోనూ ఎవరూ వినరాని విషయాలేవో వారు మాటాడుకోవడం కవి సూచిస్తాడు. ఈ కావ్యంలో ఒక భావంలోనుండి యింకొక భావం రావడం అన్నది లేదు. ఒక భావానికి యింకొక భావానికి సంబంధం కనిపించదు. ఇందులో

వినిపించేది ఒక వ్యక్తి స్వరంకాదు. అనేక స్వరాలు వినిపిస్తాయి. కాని యీ పరస్పరం సంబంధంలేనట్లు కనిపించే భావాలు మొత్తంగా మన హృదయంలో ఒక ముద్ర వేస్తాయి. అదే ఆ కావ్యానికి అర్థం. ఈ విధమైన శిల్పమే 'The waste land' లో పరాకాష్ఠ నందింది. The waste land యీ శతాబ్దపు ఉత్తమోత్తమ కావ్యంగా పేరొందింది. ఐ. ఏ. రిచర్డ్స్ యీ కావ్యాన్ని 'భావాల సంగీతం'గా అభివర్ణించాడు. The waste land కవి దర్శించిన నిరీశ్వర నిర్జీవ సమాజము. ఈ కావ్యానికి మిస్. వెస్టన్ రచించిన From Ritual to Romance అన్న గ్రంథంలోని గాథలను ఆధారం చేసుకున్నాడు. ఈ గాథల్లో Waste land కు ఒక బెస్తరాజు. ఈ రాజు వికలాంగుడు, నపుంసకుడు. ఆ కారణంగా ఆ రాజ్యంలో వర్షంలేదు. గవైన్ అనేవాడు కొన్ని మాంత్రిక ఉపకరణాలచే ఆ రాజు నపుంసకత్వాన్ని, ఆరాజ్యంలో క్షామాన్ని తొలగిస్తాడు. లైంగికాశక్తత యీ నాటి ఆధికి, వర్షాభావం ఆధ్యాత్మిక క్షామానికి ప్రతీకలుగా ఎలియట్ గ్రహించాడు. వర్షం రావడానికి, బీడువారిన భూమిలో మొక్కలు మొలకెత్తడానికి మానవుడు యజ్ఞం చెయ్యాలి. 'యజ్ఞాద్భవతిపర్జన్యో' అన్న గీతావాక్యానికి ఎలియట్ కావ్యరూపంలో యిచ్చిన వ్యాఖ్యానమే The waste land అనిపిస్తుంది.

ఈ కావ్యంలో ప్రముఖమైన శిల్ప విశేషము యితర కావ్యాలలోని సమాసాలు వాక్యాలు ఉపయోగించటం. ఇందులో మొదటిభాగం చివర:

A crowd flowed over London Bridge, so many
I had not thought death had undone so many

ఈ రెండవ పాదం Dante రచించిన The Divine Comedy లోది. డాంటే తన కావ్యంలో నరకలోకానికి వెళ్లి అక్కడ ఉన్నవారిని చూసి అన్న మాటలివి. ఎలియట్ లండన్ బ్రిడ్జి మీద ప్రతిదినం నడిచే జనసందోహాన్ని చూసి యీ మాటలంటున్నాడు. జీవన్మరణాన్ని యింత కంటె తక్కువ మాటల్లో యింత చక్కగా స్ఫురింపజేయడం సాధ్యంకాదు.

ఛాసర్ నుండి వస్తున్న ఒక సంప్రదాయాన్ని The waste land మొదటి పంక్తిలోనే తలకిందులు చేశాడు ఎలియట్:

April is the cruellest month, breeding
Lilacs out of the dead land

ఇవి చదువగానే మనకు Canterbury Tales లోని మొదటి పంక్తి గుర్తు రాకమానదు.

Whan that April with his showers softe

waste land లోని ప్రజలకు జీవితంపై యిచ్ఛ తొలగింది. వారు పునరుజ్జీవనం పట్ల విముఖులు. ఇందులో మూడవభాగం యిలా మొదలవుతుంది:

The river's tent is broken: the last fingers of leaf
Clutch and sink into the wet bank. The wind
Crosses the brown land, unheard. The mymphs are departed.
Sweet Thames, run softly, till I end my song.

ఎలియట్ వర్ణనలను ఎలా కుదిస్తాడో యిందులో చూడవచ్చు. నదికి పైన డేరా లాగున్న చెట్ల చిక్కని ఆకులు రాలిపోయాయి. ఆకుల యీనెలు తడిసినా నది ఒడ్డులో, నదిలో పడిపోతున్నామన్న భయంతో ఒడ్డును పట్టుకున్న మనిషి చేతివ్రేళ్లలా కనిపిస్తున్నాయి. ఎక్కడా ఒక్క పచ్చని ఆకులేదు. గాలి వీచిన చప్పుడు వినడానికి అక్కడ ఎవ్వరూలేరు. వన దేవతలు వెళ్లిపోయారు. ఆ నదీతీరం పాడుబడ్డది. ఇందులో చివరి పాదం స్పెన్సర్ 'ప్రోథలేమియన్' లోది. ఆనాటి జానపద వాతావరణం మన కళ్లముందు మెదులుతుంది. ఇప్పటి థెమ్స్ నదికి, స్పెన్సర్ కాలంనాటి థెమ్స్ నదికి యిందులో భేదం సూచింపబడింది. 'వనదేవతల

వెళ్లిపోయారు' అన్నదానికి 'ఆ మధురశృంగారపు దినాలు గడచిపోయినవి' అన్న అర్థం స్ఫురిస్తుంది. కాని గతం యొక్క ఉదాత్తతనుకాని వర్తమానం యొక్క పతనాన్నికాని సూచించటం ఎలియట్ ఉద్దేశం కాదు. ఈనాటి నదీతీరంపైని నీరసమైన మానవ జీవితం కంటె భిన్నమైందిగా గతం ఉండ బోదని ఎలియట్ సూచిస్తాడు. ఈ విధంగా గతానికి వర్తమానానికి ఉన్న భేదాన్ని స్ఫురింపజేస్తూ ఆ భేదం లోనే సామ్యాన్ని చూడటం ఎలియట్ విశిష్టత. ఇతర కావ్యాల్లోని వాక్యాలుపయోగించటంవల్ల ఎలియట్ తక్కువ మాటల్లో ఎంతో భావాన్ని యిముడ్చగలుగు తున్నాడు. ఇన్నిరకాల అర్థాలు రావడానికి కారణం అతడు స్పష్టంగా చెప్పకపోవడమేనని అనుకోడానికి వీల్లేదు. అతని వర్ణనలు స్పష్టంగా, అసందిగ్ధంగా ఉంటాయి. ఆవర్ణనల అర్థం మాత్రం నిర్దిష్టంగా నిశ్చితంగా ఉండదు. అందులో అర్థాల పొరలుంటాయి. అయితే యీరకపు కవిత్వం యొక్క ప్రయోజనం బహుగ్రంథ పరిచయంగల పండితులకు మాత్రమే పరిమితమని జనసామాన్యానికి పనికి వచ్చేదికాదని ఒక ఆక్షేపం. ఎలియట్ ప్రజాకవిత్వం వ్రాయలేదు. పైగా ఎలియట్ ఉపయోగించిన ప్రతి ఉదాహరణ వాక్యం గుర్తించకపోయినంతమాత్రాన అతని కవిత్వం అర్థం చేసుకోలేమన్నది సరిగాదు. పద్యగతి చేతనే భావాన్ని స్ఫురింపజేస్తాడు మహాకవి. ఎలియట్ అలా చెయ్యగలడు. పాఠకుడి నుండి కొంత గ్రంథ పరిచ యాన్ని ఆశించటం నేరంకాదు కూడాను. ఎలియట్ ఉదాహరించిన ప్రతి పదము ఒక ప్రత్యేకమైన అర్థస్ఫూర్తి కొరకే. శాంతి శ్శాంతిశ్శాంతిః అన్న స్వస్తి వాచకంతో ఈ కావ్యం ముగుస్తుంది. ఇందులోనూ వ్యంగ్యముంది. waste land లో లోపించింది యీ అతీంద్రియమైన శాంతి ఒక్కటే.

రెండు ప్రపంచ యుద్ధాల సంధికాలంలోని నిరాశ, నిస్పృహ, భయం ప్రతిబింబించిన 'The Waste Land' ను యిరులను ప్రేమించే వాళ్లంతా ఆకాశాని కెత్తారు. ఎలియట్‌ను నైరాశ్యానికి తన్మూలమైన నిరీశ్వరత్వానికి ప్రవక్తగా భావించి భజించారు. నిజానికి 'The Waste Land, లో కనిపించే నిరాశా నిస్పృహలు పైకి కనిపించే లక్షణాలు మాత్రమే. అందులో అంతస్స్రోతమైన ఆధ్యాత్మిక సందేశం చాలామంది వినిపించుకోలేదు.

ఆంగ్లికన్ చర్చిని స్వీకరించిన తరువాత ఎలియట్ క్రమంగా బహుముఖమైన ఆధ్యాత్మిక భావంనుండి అంతర్ముఖమైన ఆధ్యాత్మిక భావంవైపు మొగ్గుతాడు. ఎలియట్ లేని భక్తిని నటించడు. భక్తి కలగడం సులభంగాదు. 'చెచ్చెరపుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నేమిచ్చిననైన గానలకు నేగిననైన హరి ప్రబోధముల్' అన్నాడు పోతన. ఇహలోకభోగాలపై ప్రసరించేచిత్తాన్ని ఈశ్వరా యత్తం చేసే ప్రయత్నమే యితని భక్తికవిత్వంలో కనిపిస్తుంది. ఒక వైపు మనసు ప్రపంచం వైపు లాగుతుంది. ఇంకొకవైపు ఆత్మభగవంతునివైపు లాగు తుంది. ఈ రెంటిమధ్య ఊగాడుతున్నమనస్సును పద్యగతి చేతనే స్ఫురింపజేస్తాడు. 'Ash - Wednesday' మొదట్లో:

Because I do not hope to turn again
Beacuse I do not hope
Because I do not hope to turn

'నేనాశించను' అనటంలోనే అంతర్లీనంగా ఆశ ధ్వనిస్తుంది. ఇంతవరకు తుచ్ఛమైన సుఖాలను, నీచమైన ఉద్రేకాలను మాత్రమే నిరసించిన ఎలియట్ యీ కావ్యంలో సుందర ప్రకృతి దృశ్యాలనుండి, ప్రాపంచిక రామణీయకతనుండికూడ తన మనసు మరల్చుకుంటాడు. భగవద్భావనకు అవరోధమైంది ఏదైనా పాపమే.

Four Quartets ఎలియట్ కవితా వ్యాసంగంలో క్రొత్త అధ్యాయం. ఇంతకుముందు నిరాద రించిన కొన్ని కవితా లక్షణాలు యిందులో కనిపిస్తాయి. విచారప్రధానమైన యీ కావ్యానికి

The Waste Land లోని నాటకీయశిల్పం పనికిరాదు. ఇంతకుముందు తన కవితలో భావాలమధ్య తీసివేసిన అతుకులు యిందులో ఎలియట్ ఉంచాడు. భావాన్వయం ఉన్నప్పటికి Four Quartets సులభంగా అర్థంకాదు. ఇందుకు కారణం అందులోని గహనమైన తత్త్వవిచారము. Four Quartets లో ఎలియట్ ముఖ్యంగా సాధించింది కావ్యార్హమైన శిష్టవ్యవహార శైలి:

The common word exact without Vulgarity
The formal word pre ise but not pedantic
The complete consort dancing together.

ప్రూఫ్రక్, జెరోన్షన్ లాంటి పాత్రలద్వారాకాక యిందులో ఎలియట్ ముసుగుతీసి ముఖాముఖీ మాట్లాడుతాడు. కాలాన్ని గురించిన విచారం యిందులో ఎక్కువగా కనిపిస్తుంది. కాలం మనకు ఏం చెబుతుంది? ఎలా ఉపకరిస్తుంది? భూతకాలమైన చరిత్ర నుండి మనం నేర్చుకోగల్గింది అతిస్వల్పం. భవిష్యత్తును చెప్పే జ్యోతిశ్శాస్త్రము సాముద్రికము మొదలయినవన్ని వర్తమానాన్ని మరచిపోవటానికి ఉపకరించే మత్తుమందులు. మనకు కావలసింది కాలజ్ఞానంకాదు. కాలాతీతమైన జ్ఞానం.

Time past and time future
Allow but a little consciousness.
To be conscious is not to be in time.

భగవద్గీతయొక్క ప్రభావం యీ కావ్యంలో ఎక్కువగా కనిపిస్తుంది. ప్రపంచంలో కెల్ల ఉత్తమోత్తమమైన ఆధ్యాత్మిక కావ్యాలలో 'కామెడీ' తరువాత భగవద్గీతే నంటాడు ఎలియట్.

భగవద్గీతలోని 'యం యం వాపి స్మరన్ భావం, త్యజంత్యంతే కళేబరమ్' అన్న పాదాన్ని ఉదాహరించి అనుక్షణము ఆసన్నకాలమేనని వ్యాఖ్యానించాడు.

"On whatever sphere of being
The mind of a man may be intent
At the time of death"-that is the
one action

(And the time of death is every moment)
Which shall fructify in the lives of others!

సుఖయాత్రకాదు, పురోయాత్ర చెయ్యండి అంటాడు:

Not farewell,
But fare forward, Voyagers.

The Waste Land ను అభిమానించిన చాలమంది మతాన్ని స్వీకరించి ఎలియట్ తమని మోసం చేసినట్లు భావించారు. అందులో చీకటిని మాత్రమే చూసిన కొందరు పుణ్యపురుషులు Ash-Wednesday, Four Quartets చదివి ఆనందంతో కేకలు వేశారు. అల్పాక్షరములలో అనల్పార్థాన్ని కుదించటమే ఎలియట్ లక్ష్యం. ఇందు కతడు ఎన్నో మార్గాలు అవలంబించాడు. అందులో ఉదాహరణ విధానం ఒకటి. పన్నెండు పుస్తకాలలో చెప్పదగిన విషయాన్ని 400 పంక్తుల్లో ఎలియట్ చెప్పాడన్నాడు, ఐ. ఏ. రిచర్డ్స్. ఎలియట్ ఉపయోగించుకున్న ప్రతీకలు కూడ యిందుకు దోహదం చేశాయి. ఎలియట్ కావ్యాలలో ఎక్కువగ కనిపించే ప్రతీకలు నిప్పు నీరు గులాబి. అయితే యీ ప్రతీకలకు ఒకే నిర్దిష్టమైన అర్థముండదు. సందర్భాన్నిబట్టి అర్థం కలుగుతుంది. ఒక్కొకచోట రెండు విరుద్ధార్థాలు కలగటం కూడా ఉంది. నిప్పు అన్నది ఒక సందర్భంలో మానవుణ్ణి కాల్చివేస్తున్న కామాగ్ని. ఇంకొకచోట పాపాలను క్షాళనంచేసే పరితప్తాగ్ని. మరొకచోట ఈశ్వరుని ప్రేమాగ్ని. నీరు సస్యదాత. ఇంకొకచోట పునరుజ్జీవన సంధాత. మరొకచోట మృత్యువు. గులాబి ప్రథమ ప్రణయపు మధురక్షణం. ఇంకొకచోట అది అనిర్వచనీయమైన బ్రహ్మానందానుభావం. నిప్పు ప్రతీకగా గల Four Quartets లోని ఒకభాగంలో విభిన్నములు విరుద్ధములు అయిన భావాలనుకూడ ఎలియట్ ఒకే మాటలో ఎలా స్ఫురింపజేస్తాడో చూదాం:

The dove descending breaks the air
With flame of incandescent terror
Of which the tongues declare
The one discharge from sin and error.
The only hope, or else despair
Lies in the choice of pyre or pyre—
To be redeemed from fire by fire
Who then devised the torment? Love.
Love is the unfamiliar Name
Behind the hands that wove
The intolerable shirt of flame
Which human power cannot remove.
We only live, only suspire
Consumed by either fire or fire.

ఇది యుద్ధకాలపు కవిత్వం. ఇందులోని కపోతం విమానమన్న విషయం అందరూ గుర్తిస్తారు. భయంకరమైన నిప్పులు గక్కుతూవస్తున్న యుద్ధ విమానం సర్వ పాపవిమోచనం అని యిరువైపుల వాళ్ళూ అంటున్నారు. ఇటు లండన్ నో అటు బెర్లిన్ నో యీ జ్వాలలు రూపుమాపాలి. అగ్ని తప్ప అన్యథాశరణం లేదు. మన బోధలకంతా మూలం ప్రేమ, అంటే శారీరకవాంఛ. దాన్ని తొలగించడానికి మనకు చేత కాదు. నిప్పు నుండి రక్షింపబడదలచుకుంటే నిప్పే మనకు శరణ్యం. ఈ మాటల్లో మనకు వినాశం అనివార్యమన్న భావం ఉంది. కాని యీ పద్యంలో యింకొక అర్థంకూడ స్ఫురిస్తుంది. ఇందులోని పక్షి దివ్యామృత సందేశం తెచ్చే కపోతం కావచ్చు. ఇదే సర్వపాప విమోచనం అని ప్రవక్తలు అంటున్నారు. మనలను కామాగ్నినుండి రక్షించగలిగేది ఈశ్వరుని దుర్భర ప్రేమాగ్ని. (To the redeemed from fire by fire) ప్రేమ. స్వాతంత్ర్యం కాదని, ఆత్మార్పణం అని చాలమంది గుర్తించలేదు. మానవుడు ప్రేమ నుండి పారిపోలేడు. ఈశ్వర కటాక్షమే అతణ్ణి దాని నుండి విముక్తుణ్ణి చేస్తుంది. మానవుడికొక నిర్ణయ స్వాతంత్ర్యం మాత్రముంది. కామాగ్నిలో కూలటమో ఈశ్వరప్రేమాగ్నిలో తేలటమో.

ఒకే భావాన్ని రబ్బరులా సాగదీసి పది రకాలుగ చెప్పటం కొందరి శిల్పం. పది భావాలను ఒకేపద్యంలో కుదించడం ఎలియట్ శిల్పం. అందుకే ఆయన కవిత రెండు బక్కచిక్కిన పుస్తకాలలో సర్దుకున్నది.

# భాస్కర పంచరత్నములు

కావ్యతీర్థ పురాణ వాచస్పతి
**కీ॥ శే॥ శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రి**

ఉదయమునందు నీ యెదుట నుర్విని సాగిలి మ్రొక్కరేని, య
భ్యుదయమునంది, మానవులు యోగము క్షేమము చెందుచుందు రా
పదలు తొలంగి సంపదలు భాసిలు చుందురటన్న వాక్కస
త్య దురవకల్పమె? హృదయతాపము బాపు త్రిమూర్తి భాస్కరా!

సతతము నిన్ను నమ్మి మనసా భజియించుట నీ వెఱుంగవే?
వితత దయామయా! వరద! విశ్వ చరాచర జంతు జాల హృ
స్థితుఁడవటంచు బల్కుదురు ధీనిధులందరు నీదు రశ్మి సం
తతిఁ బసరించి మా హృదయ తాపము బాపు త్రిమూర్తి భాస్కరా!

జనుల హృదబ్జసీమ గల సర్వమతుల్ప్రసరింపఁ జేతు వీ
వని శ్రుతి చెప్పు నిన్మనసునందు సదా భజయించు వారికిన్
మనుగడ భద్రమై నెగడు, మంచు దొలంగిన మాడ్కి సర్వవే
దనలు దొలంగ మా హృదయ తాపము బాపు త్రిమూర్తి భాస్కరా!

వెలుగలతేడ! నిన్ను స్థిరవృత్తిని ధ్యానము సేతుమన్నఁ జం
చలమగు మానసంబెపుడు చక్కన నిల్వదు, నిల్వకున్నచో
టను మఱి ధ్యానమెట్లు? వనటన్బెడబాపుమదిన్ తమోనిషూ
దనఘన సుప్రభా! హృదయతాపము బాపు త్రిమూర్తి భాస్కరా!

గ్రహముల మండలంబులు సరాసరి నీ మహిమన్ సకాలమం
దహరహ మావృతంబులగు, నన్నిటిమూలము నీవు గాన, దే
వ హరిహరాజులున్ నినునుపాసన జేతురు భక్తవత్సలా!
దహరనివాస మా హృదయతాపము బాపు త్రిమూర్తి! భాస్కరా!

---

## పశ్చిమ ఆఫ్రికాలో

# ఏకపక్షరాజ్యాంగ సంక్షోభం

శ్రీ డబ్ల్యు. ఆర్థర్ లూవిస్

[గతసంచిక తరువాయి]

ఏకైక రాజకీయపక్ష పద్ధతిని అనుసరించిన దేశాలు పూర్వం చాలాఉన్నాయి. అసలు యీ పద్ధతి బాధను మానవలోకం చాలా ఎక్కువగానే పడింది. అయితే ఆ అనుభవం సుఖతరమైందిగా లేదు. అందువల్ల ఇప్పుడు పశ్చిమ ఆఫ్రికాలో అంతకన్నా సుఖతరంగా ఉన్నదని అనలేము. ఈ ఏకైక రాజకీయపక్ష పద్ధతివలన ప్రాంతీయ విభేధాలను తొలగించవచ్చునని ఒక అడియాస. అందుకు ఇదే సరైన మార్గం అని ఒక పెద్దవాదం. కాని ఇది పనిచెయ్యదు. ప్రాంతీయవిభేదాలు అన్నవి అల్పంగా ఉన్నవే అనుకుందాము. అప్పుడుకూడా ఇది పనిచెయ్యదు. ఇటువంటి ప్రయత్నాలు జరిగినచోట్ల ఇది పనిచెయ్యలేదు. ఇప్పుడు ఇక్కడ యీ పశ్చిమ ఆఫ్రికాదేశాలలో పనిచేస్తుందని అనలేము.

ఏకపక్ష రాజకీయ మార్గాలలో విసంవాదం ఉండదు. అవి ఏకపక్షాలు మాత్రమే గాని, అందులో ఏకాకారత ఉండదు. తాత్వికంగా ఆలోచించి చూస్తే ఇచ్చట కనీసం రెండుతేడాలను ఎంచవలసి ఉంటుంది. ఈ తేడాలు ఎంచవలసింది నియంతృత్వ పక్షాలు, అపర్యాప్త పక్షాలు మధ్య; సిద్ధాంత సంబంధమైన పక్షాలు, దాపరికంలేని పక్షాలు మధ్య.

ఇక్కడ నియంతృత్వ పక్షములేక టోటలిటారియన్ పక్షము అంటే నా అభిప్రాయం ఇది. సమాజ నిర్మాణంలో తాను తప్ప వేరే సాధనం లేదనే పక్షం ఏది ఉన్నదో అది యీ పక్షం. ఇచ్చట యీ పక్షం కేవలస్థితిని తనయందు ఆరోపించుకుంటుంది. గినీ, మాలీ,—ఇటీవలిదాకా ఘనాలలో— తక్కిన అన్నిరకాల వ్యవస్థలకన్నా పార్టీయే అధికమైనదై పోయింది. ఈవ్యవస్థలన్నిటికీనాయకత్వం కోసం పార్టీయే దిక్కైపోయింది. దిక్కైపోతున్నది.

ఇటువంటి పక్షాల సిద్ధాంతాల వ్యవహారం ఏమిటో అట్టే చెప్పనవసరంలేదు. ఐరోపాలోని టోటలిటారియన్ పద్ధతులే ఇక్కడ పద్ధతులు. అదే సరుకు. ఇందులో ప్రజలకి అందరకు ప్రాతినిధ్యం వహిస్తూవున్న శాఖ ఒకటి. ఇది ఫాసిస్టు శాఖ; ఇంకొకటి దళితప్రజకుమాత్రమే ప్రాతినిధ్యం వహిస్తుంది. అది కమ్యూనిస్టు శాఖ. పశ్చిమ ఆఫ్రికాలో ఈ కమ్యూనిస్టులు ఉన్నారు. వీరు కమ్యూనిస్టు ఉద్యమంలో తిరుగాడినప్పుడు ఆపద్ధతులు పట్టుకున్నారు. ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. వీరు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని అంగీకరించడంలేదు. తిరస్కరిస్తున్నారు. అటువంటి సందర్భంలో ఆ కమ్యూనిస్టు పద్ధతిని ఒక్కదాన్నీ ఎందుకు వీరు వదిలిపెట్టలేదు. ఇదే ప్రశ్న.

ఇందుకు కొంతవరకు ఇట్లా చెప్పుకోవచ్చు. దురధికారపూరితులైన నాయకులు కొందరు ఉన్నారు.

వారికి ఈ పద్ధతి నచ్చింది అనవచ్చు. కాని ఇదే పూర్తి కారణంకాదు. అది ఇది.ఇదికూడా ముఖ్యమైందే. ఆఫ్రికా దేశాలలో మధ్యతరగతి జనం అంటూ ఉన్నారు. ఈ నాయకులకు ఆ మధ్యతరగతి జనం అంటే ఎంతో విరోధం. వారంటే వీరికి ఎంతమాత్రం గిట్టలేదు. అధునాతనం అని చెప్పతగిన ఏ రాజ్యమున్నా విద్యావంతులులేక నడవదు. నడపడం కష్టం. చదువులేనివాళ్లు రాజ్యాన్ని నడిపించలేరు. ఆ రాజ్యాన్ని చదువుకున్న ఉద్యోగస్తులు, రాజకీయాలలో నలిగినవాళ్లు, వివిధ వృత్తులవారు, స్వతంత్రులైన వ్యాపారస్థులు, తలపెట్టుకు బలికే తదితరులు నడపవలసిందేకాని విద్యాగంధంలేని వారికి ఇది చేతనైన పనికాదు. పార్టీకి వీరంటే గిట్టదు. మరి వారు లేక పని జరగదు. కాబట్టి వారిని వాడుకోవాలి. అటువంటివారిని పార్టీ మంత్రులుగా వేస్తుంది. ఉద్యోగస్థులుగా నియమిస్తుంది. ప్రభుత్వ వ్యాపార సంస్థలను వారిచేత నడిపిస్తుంది. అంతే. వారిని మాత్రం నమ్మదు. అందువల్ల సర్వమైన అధికారము, అదుపు పార్టీ కార్యవర్గం చేతుల్లో ఉండాలి. ఉంది. పార్టీ తత్వంకూడా అట్లాగే ఉంటుంది. అధికారంఅంతకు పార్టీయే జనిస్థానం అన్న విధంగా ఉంటుంది యీ తత్వం.

ఇక్కడ ఇంకో విషయం ఉంది. ఈ పార్టీలలో ఒకరకం పార్టీ ఒక ప్రత్యేకమైన తత్వాన్ని లేక ప్రత్యేకమైన కార్యక్రమాన్ని అవలంబించి ఉంటుంది. మరోరకం పార్టీ అన్నిరకాల అభిప్రాయాలవారిని, అన్నివిధములైన వారిని, తనలో చేర్చుకుని, అన్ని రకాల భావాలను చర్చించేందుకు సావకాశం కల్పిస్తానంటూ ఉంటుంది. ఈ రకం పార్టీని కట్టినవారు తాము ప్రతిపక్షాలకు గూడా పార్టీలో స్థానం కల్పించాము అంటారు. ప్రతిపక్షం అంటూ ఉన్నదని గుర్తించక తప్పదని తాము గుర్తించినట్లు పేర్కొంటారు. దేశంలో బహురకాల వారు, బహు భావాలవారు ఉంటారు. వారి వారి వైఖరులుకూడా భేదిస్తూ ఉంటాయి. అందువల్ల యీ అందరికీగూడా పార్టీలో స్థానం అంటూ ఉన్నప్పుడు ఏ ప్రతిపాదన వచ్చినా, దాన్ని అన్ని రకాల దృక్కోణాలనుంచి పరిశీలించవచ్చు. ఈ రకం పార్టీలను కట్టినవారు, తాము ప్రతిపక్షాలను పార్టీలో చేరవలసిందిగా ఆహ్వానిస్తున్నామనికూడా చెప్పడం ఉంది. ఇటువంటి విషయాలను చదువుతూఉంటే ఈ ఏకైక రాజకీయ పక్షాల వ్యవహారం అంతాకూడా ఒక పెద్ద రాజకీయ సదస్సులాగా తోస్తూ ఉంటుంది. ఈ సదస్సులో వీరు పాల్గొనవచ్చు, వీరు రాదు అని కూడా లేదనిపిస్తున్నది.

ఆఫ్రికాలో రాజకీయ ప్రచారకులు ఈ రకమైన పార్టీ పద్ధతిని గూర్చి రోళ్లను రోకళ్లను కొడుతూ ఉంటారు. ఇది ఏదో గొప్ప విశేషమైందని చెబుతూ ఉంటారు. అయితే ఒక రాజకీయ పక్షం ఇట్లా అన్ని తలుపులూ తెరుచుకు పనిచేయాలంటే అందుకు తగిన పరిస్థితులు అక్కడ లేవు. ఒకటో, రెండో పార్టీలలో అంతరంగికంగా ప్రజాస్వామ్య సిద్ధాంతాలు చెల్లుతున్నాయని చూపించి, నాయకులకు అనుచరులకు మధ్య సంబంధాలు బాగా ఉన్నాయని ప్రదర్శించి, ఈ అనుచరులలో అన్ని తెగలకు, జాతులకు, ప్రాంతాలకు చెందినవారు సభ్యులుగా ఉన్నారని వాదించి లాభంలేదు. సిద్ధాంత సంబంధమైన పార్టీలు ఉన్నాయంటే, అవి ఇట్లా వాదించటం అలవాటై పోయింది. "ప్రజాస్వామ్యం" ఉంటుంది. కాని అది ఎవరికి ? పార్టీ సభ్యులకు మాత్రమే. వారు కాని ఇతరులు నోరు ఎత్తితే పోలీసులో, పార్టీ తాలూకు గూండాలో వచ్చి ఇళ్లమీద పడతారు. మరి పార్టీ సభ్యులకు అయినా ఈ "ప్రజాస్వామ్యం" పూర్తిగా చెల్లుతుందా ? ఇందుకు వారుగూడా కొన్ని హద్దుల్లో ఉండాలి. పార్టీ పెట్టుకున్న ఆలోచనా

పద్ధతులను ఆమోదించాలి. వానిని ఆమోదించని నాడు లేక వ్యతిరేకించిననాడు వానికి వెలి.

ప్రజలకు ఈ పార్టీకి ఏకాకారత చెప్పడానికి వీలులేదు. పార్టీకిగూడా ఇది ఇష్టంకాదు. పార్టీ నాయకునిపై ప్రజలలో ఎంతో మన్నన ఉండవచ్చు; కాని పార్టీ అనుచరులు మాత్రం ప్రజలకన్న వేరు. ఈ పార్టీలలో కార్యకారులయినవాళ్లు రౌడీలు. వాళ్లు ఒకవిధంగా ధగ్గులు. జనాన్ని వంచటం వీరిపని. పార్టీలో మర్యాదస్తులులేరని కాదు. ఉంటారు. అయితే వారుకూడా తాము అధికులమని భావిస్తారు. నిరంకుశంగా వ్యవహరిస్తారు. అందువల్ల వారంటే జనానికి భయం. పార్టీ సభ్యునిముందు ప్రజలు మాట్లాడేది ఒకటి, భయంలేదు అని అనుకున్నచోటులో మాట్లాడేది ఇంకొకటి. పార్టీఅంటే అంతా భయపడవలసిన దినుసు. అట్లా భయపడటం అవసరమన్నదే దాని ధ్యేయం. అధికారికి యీ భయమే ఆయతనం. అందువల్ల ఆ అధికారం త్రోసివేయబడినప్పుడు "అయ్యో!" అనే వాడు దొరకడు. అధికారంలో ఉండగా ఒక నాయకుడు మృతి చెందాడు. వాని అంత్యక్రియలకు జనం కోకొల్లలుగా వస్తారు. ఆ నాయకుడు అట్లా చావక ఎవరో వానిని అధికారంలోంచి తొలగించారు అనుకుందాము. అప్పుడు ఏడ్చేవాడే ఉండడు. వాని పేరు ఎత్తేవారు కూడా ఉండరు.

పార్టీలో ప్రజాస్వామ్యం ఉన్నదనే మాట పెద్ద అబద్ధం. తమతో ఏకీభవించనివారిని వెలివేయడం, వెళ్లగొట్టడం ఉన్నచోట ప్రజాస్వామ్యం ఉండదు. ఆ పార్టీని "ఓపెన్" పార్టీ అనలేము. "ఓపెన్" పార్టీ అనగానే, అందులో వేరు అభిప్రాయాలను వెల్లడించే వీలు ఉండాలి. వేరువేరు అభిప్రాయాలు చెప్పేవాళ్లను ఆరకంపార్టీ ఉపయోగించుకోవాలి. లక్ష్యాల విషయంలోకూడా అంతే. ఆ లక్ష్యాలు ముందుగా నిర్ణయం అయినవై ఉండకూడదు. నిరంతరమైన చర్చలద్వారా అవి రూపొందింపబడుతూ ఉండాలి. ఒక సోషలిస్టుపార్టీగాని, లేక ఒక లిబరల్ పార్టీగాని తాను "ఓపెన్ పార్టీ" ని అని చెప్పుకుంటే చెల్లదు. అందువల్లనే "ఓపెన్" పార్టీ అనే దాని నాయకులు తటస్థులైనవారై ఉండాలి. అవతలివారు చెప్పే అభిప్రాయాలను విని, వాటిని బట్టి నడుచుకోగలవారై ఉండాలి. అంతేగాక ఈ నాయకులైన వారిని తొలగించడానికి వీళ్లుకూడా ఉండాలి. ఇప్పుడు వేరు అభిప్రాయాలుగలవారు ఒక పార్టీలో ఉన్నారే అనుకుందాము; అప్పుడు వారిని ఎదుర్కొనే ముఖ్యమైన సమస్యలలో ఇది ఒకటి. ఒక నాయకుడు అంటూ ఉన్నప్పుడు, ఆ నాయకుడు ఏమి చేయవలసి ఉన్నదో, దానిని చేయగలడా అన్నది ఆ సమస్య. అందువల్ల ఒక నాయకుణ్ణి పెట్టుకొని, అతని విధానాలను అనుసరించడానికి పెట్టబడిన పార్టీ ఎప్పుడుగాని 'ఓపెన్'పార్టీ కాజాలదు.

ఏకైక రాజకీయ పక్షాల పద్ధతిని గురించి గొప్పలు చెప్పేవాళ్లు ఒకమాట అంటూ ఉంటారు. అది ఏమిటంటే, ఆ పక్షం మూలంగా స్థిరమైన ప్రభుత్వం ఏర్పాటు కావడం సాధ్యం అవుతున్నది— అని. ఆ పక్షమే గనుక మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేస్తే, ఆ ప్రభుత్వం ఇంకా స్థిరంగా ఉంటుందనికూడా అంటారు. ఇది సరికాదు. పశ్చిమ ఆఫ్రికాలో ఉన్న ఏకపక్ష ప్రభుత్వాలన్నీ నిలకడలేనివి. ప్రతిపక్షాలు అంటూ ఉండటం నేరం అయిపోయినప్పుడు ప్రభుత్వాలను పడగొట్టడం అధికార పరివర్తనాల ద్వారానే సాధ్యం. అటువంటివి సంప్రాప్తం కాకుండా ప్రభుత్వం సమర్థమైనదైతే, రహస్యపు పోలీసుబలాన్ని విస్తృతంగా నిర్మించుకుంటుంది. తిరుగుబాటు ముఠాలు ప్రాణం అంటూ పోసుకొనకముందే, వానిని ఈ రహస్యపు పోలీసుబలం హతమార్చివేస్తూ ఉంటుంది. అయితే పశ్చిమ ఆఫ్రికాలో ఏ దేశం ప్రభుత్వానికిగాని ఇంతటి సామర్థ్యం చిక్కలేదు. తిరుగుబాటు చేయగల

వారిపై ఒక కన్నువేసి ఉంచడం తేలిక అయినపని. కాని అప్పుడు ఆ తిరుగుబాటు ముఠాలు పద్ధతులను మార్చుకుంటాయి. తాము ఏమిచేస్తున్నది బయటికి తోచనీయవు. లోపల స్వయంపాకం చేస్తాయి. పార్టీలోనే ఈ గూడుపుఠాణీలు పెరిగిపోతాయి. అప్పుడు కుట్రలు పన్నడం, నిర్వహించడం తేలిక.వీనిని పార్టీలో పెద్ద హోదాలలో ఉన్నవారే నడిపిస్తారు గనుక, వాటికి ఒక మర్యాద అంటూ ఏర్పడుతుంది. ప్రతిబంధకాలు కూడా అట్టే ఉండవు. సమాజంలోని ఉద్రేకాలు, తగూలు అన్నీ, పార్టీ నాయకత్వంలోనే కేంద్రీకృతం అయిపోతాయి. ఆ పార్టీ సభ్యులు సమాజంలోని ఆయా వర్గాలతో ఏకాకారాన్ని భజిస్తారు. వీరు వేరు విధానాలను అంటిపెట్టుకుని ఉంటారు. ఇదే ఇందుకు కారణం. ఇక ఈ ఉద్రేకాలు తీవ్రతరం అయినప్పుడు, నాయకులలో బ్రహ్మాండమైన ముసలం ఆవిర్భవిస్తుంది. ఒకరిపై ఒకరు కత్తులు దూసుకుంటారు.

1962, 1963 సంవత్సరాలలో సెనెగల్, ఐవరీకోస్టు, మాలి, ఘనా, నైజర్, లైబీరియాలలో అనేకమంది మంత్రులు అరెస్టు చేయబడినారు. టోగోలో దహోమీలో సైన్యం తిరుగుబాట్లు, అధికార పరివర్తనాలు కొనసాగాయి. అంతకు ముందు రోజుల్లో ప్రతిపక్షాలకు చెందిన వారితో జైళ్ళు కిటకిటలాడి పోయినాయి. వారి బలం తగ్గిపోయింది. వారు పేరు పూరా లేనివారై పోయినారు. ఇప్పుడు ఉన్న ఏకైక రాజకీయ పక్షాలలోనే తగూలు తల ఎత్తాయి. పార్టీ నాయకులలోనే ఒకరిపై ఒకరు కసి తీర్చుకుంటున్నారు. ఇది ఇట్లా జరక్క తప్పదు. ఏ సమాజంలోగాని ప్రతిపక్షం అంటూ లేకుండా రహితం చెయ్యడం సాధ్యంఅయ్యే పనికాదు. ప్రతి సమాజంలో వేరువేరు ఆకాంక్షలు గలవారు, వేరు వేరు అభిప్రాయాలు గలవారు, వేరువేరు యోగాలు క్షేమాలు గలవారు ఉంటారు.సమాజంలో ఏ రకమైన పరివర్తన అయినా అది అందరిపట్లను ఒక్క తీరుగా ఉండదు. వేరువేరు విధాలుగా వారిని ప్రభావితులను చేస్తుంది. అందువల్ల ఇక్కడ ప్రశ్న ఒక్కటే. ఈ వేరు వేరు అభిప్రాయాలను ఈ వేరు వేరు అభిప్రాయాలు గలవారు శాంతియుతంగా బయటికి చెప్పుకోగలందుకు ప్రజాస్వామ్య ధర్మవిహితములైన మార్గాలు అంటూ ఏమన్నా ఉన్నాయా? లేక అటువంటి మార్గాలు అంటూ లేనందువల్ల దౌర్జన్యమే శరణ్యమై, ముందు పార్టీమీద, తర్వాత పార్టీ లోపలను ఈ దౌర్జన్యాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది. ఈ కారణాలచేత ఏకైకరాజకీయపక్ష పద్ధతి వలన రాజకీయమైన నిలకడ ఏర్పడుతుందనే వాదం పూర్తిగా పూర్వపక్షం అయిపోతున్నది.

ఇప్పుడు ఈ ఏకైక రాజకీయ పక్షపద్ధతిలో ఏమి గొప్పతనాలు ఉన్నవని అంటున్నారో అవి అన్నీ వట్టి దబ్బరలని తేలింది. ప్రజలకు అందరికీ ఈ పార్టీ ప్రాతినిధ్యం వహించలేదు. స్వతంత్రతంగా, స్వేచ్ఛగా చర్చలు జరిగే ఎత్తు ఇక్కడ లేదు.స్థిరమైన ప్రభుత్వాలు ఈ రకం పార్టీపద్ధతి ఉన్నప్పుడు ఏర్పాటు కావు. పోతే ఈ ఏకపక్ష రాజకీయం వలన ప్రాంతీయ విభేదాలు, ప్రాంతీయ దురభిమానంగల తెగలమధ్య విభేదాలు తొలగుతాయా అంటే, అది కూడా లేదు. ఈ పద్ధతి పశ్చిమ ఆఫ్రికాకు సరిపడదు. పుట్టుకురుపు మనుష్యునికి సహజమైనట్లు, ఈ పద్ధతి అక్కడ సహజమేనని అంటే చెప్పేదిలేదు. అట్లా అప్పుడు దాన్ని సహజ లక్షణంక్రింద భావించవచ్చు. కాని యీ దేశాలకు నిజంగా సరిపోయే పద్ధతి బహు పార్టీల పద్ధతి. వేరవేరు ప్రాంతాలకు ప్రాతినిధ్యం వహించే వేరువేరు పార్టీలు ఏర్పడి పనిచేయడం ; అయితే యీ ఏకపక్ష పద్ధతి ఎట్లా వచ్చింది అంటారు. స్వాతంత్ర్యం వచ్చిన క్రొత్తల్లో ఉద్బుద్ధమైన ఉన్మాద విశేషమే ఇందుకు కారణం. ఆ ఉన్మాదస్థితి ఆ దేశాలలో చెల్లుతున్నప్పుడు, కొంతమంది ప్రభుత్వ

యంత్రాంగాన్నంతా ఆక్రమించుకోగల్గారు. తమకు ప్రతిపక్షులైన వారిని అణచివేయగల్గారు. ఇది పశ్చిమ ఆఫ్రికాకు పట్టిన జబ్బు. ఈ జబ్బునుంచి ఆ ప్రాంతంలో అన్నిదేశాలు కోలుకోవలసి ఉంది. అందుకు నిజంగా అవి పాత్రం అయినవి కూడాను.

పశ్చిమ ఆఫ్రికా దేశాలకు ఏకపక్ష రాజకీయ వ్యవస్థ తగదు అంటే, ఆ దేశాలు బ్రిటన్‌లో ఉన్నట్లు, ఫ్రాన్సులో ఉన్నట్లు రాజ్యాంగ వ్యవస్థలను నిర్మించుకోవాలని అర్థంకాదు. బ్రిటన్, ఫ్రాన్సులు రెండున్నూ వర్గసమాజాలు; అనగా class society లు. ఆ దేశాలలో సర్వమైన వ్యవస్థలుయీవిషయం ఆధారంగా,వానిని సర్దుకోడానికి ఏర్పడ్డాయి. పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలు ఇటువంటివి కావు. అక్కడి సమాజాలు వర్గ సమాజాలుకాదు. ఆ దేశాలలో ఉన్నవి బహ్వంగ సమాజాలు. అనగా plural society లు. వర్గ సమాజానికి ఏది మంచిదో, అది యీ బహ్వంగ సమాజాలకు చెరుపు చేస్తుంది. అందువల్ల పశ్చిమ ఆఫ్రికాలో సరియైన రాజ్యాంగ వ్యవస్థలను నిర్మించాలంటే, వారి యీ సమస్యను గురించి పునాదుల దగ్గరనుంచి పైకప్పుదాకా విశదంగా ఆలోచించవలసి ఉంటుంది.

'ప్రజాస్వామ్యం' అన్నమాట ఉన్నదంటే, దానికి రెండు అర్థాలు ఉన్నాయి. ఒక నిర్ణయం అంటూ జరిగినప్పుడు, ఆ నిర్ణయంయొక్క ఫలితాన్ని అనుభవించ వలసినవారు ఎవరైతే ఉన్నారో, వారికి అందరికీకూడా, ఆ నిర్ణయాన్ని చెయ్యడంలో చేయి ఉండాలి. ఆ నిర్ణయం చెయ్యడంలో వారు అందరు పాల్గొనాలి. ఈ పాల్గొనడం అన్నది ప్రత్యక్ష పద్ధతిని జరగవచ్చు. లేదా పరోక్ష పద్ధతిని జరగవచ్చు. ఈ పరోక్ష పద్ధతిలో వారి ప్రతినిధులు యీ నిర్ణయం చేసే పనిలో పాల్గొంటారు. ఇది ఒక అర్థం. రెండో అర్థం—అధిక సంఖ్యాకుల అభిమతం చెల్లాలి—అన్నది. ఈ రెండున్నూ ఒకదానికి ఒకటి ప్రతిబంధకంగా పనిచేయవు. ఏలన, ఐరోపా పార్లమెంటులలో అల్పసంఖ్యాకులు ప్రతిపక్షం క్రింద వ్యవస్థితులు అవుతారు. ఈ ప్రతిపక్షం ఒక పార్టీగా ఉండవచ్చు, లేదా పార్టీలుగా ఉండవచ్చు. వీరికి నిర్ణయంచేసే సందర్భంలో ఎటువంటి అధికారం ఉండదు. ఇది ఇట్లా జరగడం సహజమేనని అంటారు. ఎన్నికలలో ఓట్లు లెక్కింపబడినప్పుడు ఒకరు గెలిచారు; ఇంకొకరు ఓడిపోయారు. ఇది నిజమే. అయినా ప్రజాస్వామ్యానికి ఉన్న యీ గౌణార్థాన్ని ఐరోపా దేశాలలో సాధ్యమైనంతవరకు రాజకీయ రంగానికిమాత్రమే పరిమితం చేస్తారు. తక్కిన అన్నిరంగాలలోను, వ్యవస్థలలోను — వ్యాపారం, క్రీడాలోకం, కుటుంబం, చర్చి, విశ్వవిద్యాలయం మొదలైన స్థానాలలో—కమిటీలు లేక సంఘాలు పని చేస్తాయి. ఆ కమిటీలలో అందరికీ ప్రాతినిధ్యం ఉంటుంది. అన్నిరకాల అభిప్రాయాలు వానిలో చలామణి అవుతాయి. చర్చలు ఆ పద్ధతిలో జరుగుతాయి. వీనిలో నిర్ణయాలు సాధ్యమైనంతవరకు రాజీ పద్ధతినే గాని, ఓటింగ్ పద్ధతిని జరగవు. ఆ రాజీ కోసం యీ సంఘాలలో గట్టి ప్రయత్నాలు జరుగుతాయి. ఓటింగ్ అన్నది అవసరంలేకుండా పనులు జరిపించడానికి విశ్వప్రయత్నం చేస్తారు. కమిటీలలో లుకలుకలు బయలుదేరి, నిర్ణయాలు చేయడానికి ఓటింగ్ అంటూ అవసరమైన పరిస్థితి ఏర్పడినప్పుడు,ఆ కమిటీ ఏమి పనిచెయ్యడానికి ఏర్పాటు చేయబడిందో, ఆపని జరగడంలేదనే అర్థం. కమిటీ అధ్యక్షుడు ఉన్నాడంటే, ఆయన పనిలో తగాలురాకుండా చూడటమున్నూ, ఆ కమిటీ అంతా పూర్తిగా కలిసి కట్టుగా పనిచేసేట్లు చూడటమున్నూ;కమిటీఅధ్యక్షునియొక్క గొప్పతనం ఇందులోనే, ఇక్కడే ఉంటుంది.

వర్గ సమాజాల తాలూకు రాజకీయవ్యవస్థలలో అధిక సంఖ్యాకులమాట చెల్లాలనేది ప్రధాన సిద్ధాంతం అయిపోయింది. ప్రజాస్వామ్యం అంటే

ప్రజలయొక్క, ప్రజల వలన, ప్రజల కొరకు అయిన ప్రభుత్వం అన్న నిర్వచనంలో ఉన్న "ప్రజలు" అన్న మాటకు, ఆ దేశంలో నివసిస్తున్న మనుష్యులందరూ అని అర్థంకాదు. అధిక సంఖ్యాకులనిమాత్రమే అర్థం. ఆ అధికసంఖ్యాకులు దరిద్రులు, మధ్యతరగతి జనం. పై తరగతి జనంనుంచి, భూస్వాములనుంచి, పెద్ద పెట్టుబడి దారులనుంచి "ప్రజలు" అన్న వారిని వేరుచేసి చెప్పడం కోసమే ఆ శబ్దం ప్రయోగించబడింది. యీ పేర్కొన్న తరగతుల జనం ఆట్టే మంది ఉండరు. అతఃపూర్వందాకా అధికారం అన్నది అంతా వారి చేతుల్లోనే ఉంటూ వచ్చింది. వారు సర్వాధికారులై అధికారాన్ని వెలిగించారు. అధికారాన్ని తమ గుత్త చేసుకున్నారు. ఇప్పుడు వచ్చిన ఈ "ప్రజలు" అన్న సిద్ధాంతంలో అకించనులైనవారికి ధనికవర్గాన్ని రహితంచేసే హక్కు ఉత్కర్షించ బడుతున్నది. గణితశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే రాజకీయాలు సున్నా—అంకె లెక్కవతుగా తయారైంది. ఒకడు ఒకదానిని గెల్చుకున్నాడు. అది అవతలివానికి లేకుండా పోయింది. ఒకనికి పుష్కలంగా ధనం ఉన్నదనుకుందాము. ఇంకొకనికి ఆ ధనాన్ని తీసుకునే అధికారం ఉన్నదనడం ఇది. ఐరోపా రాజకీయాలు ఇప్పటికి మూడువందల సంవత్సరాలుగా యీ పద్ధతిని అనుసరించే నడుస్తున్నాయి.

వర్గ సమాజంలో సహజమై కన్పిస్తున్న ఏవంవిధమైన దృక్పథాన్ని, బహ్వంగ సమాజాలకు అనువర్తింప జేయడం అసందర్భంగా ఉండటం ఒక్కటే కాదు; అది అవినీతి అవుతుంది. ప్రజాస్వామ్యం అన్నమాటయొక్క అర్థానికి అతకదు. అనేక విధాలుగాగల ప్రజలతో సజాతీయమైన జాతి నిర్మాణం ఇందువల్ల జరగదు. బహు తెగల వారిని కూడకట్టుకొని వారిని ఒక్క జాతిగా రూపొందించాలన్న ఆలోచనకు యిది భంజకం అయిపోతుంది. వట్టి ఓటుల లెక్కతో, బలంతో కేథలిక్కులు ప్రొటెస్టెంటులను హతమార్చడం ధర్మం అవుతుందా? బ్రిటిష్ గయానాలో భారతీయులు నీగ్రోలను రూపర చేయడం ప్రజాస్వామ్యం అనిపించుకుంటుందా? దక్షిణదేశాలలో ఉన్న నీగ్రోలు తెల్లజాతి జనాన్ని నాశనం చెయ్యడం విహితం అనగలమా? బహ్వంగ సమాజాలలో రాజకీయాలకు సంబంధించినంతవరకు సున్నా—లెక్క పద్ధతిని (Zero sum game) అనుసరించడం నీతి బాహిరం కావడం ఒక్కటే కాదు, అది ఆచరణ సాధ్యమైన విషయంకూడా కాదు.

ఇరవయ్యో శతాబ్దంలో ఏర్పడిన కొత్త రాజ్యాలన్నింటిలోను ప్రధాన సమస్య ఇదే;—ఈ అనేకత్వం. ఈ రాజ్యాలలో బహురకాల ప్రజలు, వేరు వేరు భాషలవారు, జాతులవారు, మతాలవారు, తెగల వారు ఉన్నారు. ఒకరినుంచి ఒకరు భేదిస్తున్నారు. ఈ దేశాలలో కొన్నికొన్ని చోట్ల పురాణ వైరాలు పెట్టుకొని, రాజ్యాధికారం ఎవరి చేతుల్లోనో ఉంటూ వచ్చినందువల్ల కొట్టుకు చావక ఆగిపోయివున్న వాళ్ళు ఉన్నారు. ఫ్రెంచి రచయితలు పక్షభేదం (Cleayage) అన్న మాటను ఉపయోగించినప్పుడు దాని అర్థం యిదే. ఈ రాజ్యాలలో పురాణ వైరాలు ఉన్నాయన్న స్థితిని చెప్పడానికి యీ శబ్దం వినియోగింపబడుతున్నది. ఈ పక్షభేదం మాటలతో తీరదు. ఆర్థిక సంబంధమైన సౌకర్యాలను పరికల్పనం చేసినందువల్లను సమసిపోదు. కారణం ఏమంటే, ఈ రకమైన భేదం ఇటువంటి కారణాలవలన ఏర్పడింది కాదు. ఈ వైరం సిద్ధాంతాలను పురస్కరించుకొని, హక్కులను పురస్కరించుకొని వచ్చిందికాదు. అందువల్లనే ఇది అసాధ్యమైన రాజకీయసమస్య అయిపోయింది.

ఇటువంటి అనేకత్వ భాజనములైన సమాజాలలో ప్రజాస్వామ్యాన్ని అమలుపరచడం ఎట్లా? ఆరకం సమాజంలో భాగాలుగా ఉన్న సర్వులకు నిర్ణయాలు చేయడం సందర్భంలో స్వయంగా

పాల్గొనగల అవకాశాన్ని, ఆ అవకాశాన్ని వినియోగం చేసుకోగలందులకు వీలైన రాజకీయ వ్యవస్థలను సృష్టించవలసి ఉంటుంది. అప్పుడే ఆ వివిధవైఖరుల వారికి తాముగూడా ఆ జాతిలో భాగస్వాములమన్న భావం కల్గుతుంది. తమ అభిప్రాయాలను అధికసంఖ్యాకులు గుర్తిస్తున్నారని, మర్యాద చేస్తున్నారని అనిపిస్తుంది. ఇచ్చట ఒకరిని ఒకరు సమాన ఛాయాలో చూడటం ఉంది. అందువల్లనే వారి మధ్య జాతీయమైన అనుబంధం ఏర్పడుతుంది. ఆ జాతీయ బంధాన్ని మన్నించాలనికూడా వారు అనుకోగల్గుతారు. ఇటువంటి సమాజంలో అధిక సంఖ్యాకులమాట చెల్లాలనడంకన్నా, అల్పసంఖ్యాకుల మాటకు విలువ ఉంటుంది అన్న అర్థం ఏర్పడాలి. నిజానికి ఇందులో ఏదీ సరికాదు. ఉచితం కాదు. ఒకరి మాట ప్రకారం ఇంకొకరు నడుచుకోవాలనే పద్ధతే ఇక్కడ రహితం అయిపోవాలి. ''గెలుపు'' ''ఓటమి'' అనే మాటలు బహ్వంగ సమాజంలో ఎప్పటివ్వగా ఉంటాయి. ఈ రకం మాటలను అచ్చటి రాజకీయ పరిభాషలోంచి తొలగించాలి. ఈ దేశాలలో రాజకీయ సమస్య పరిష్కారం కావాలంటే, ముఠాల వైరాలు, రాజకీయమైన సంఘర్షణలు పూర్తిగా తొలగింపబడటం అవసరం. వాని స్థానంలో పరస్పరమైన సహనం, రాజీ పద్ధతి రావలసిఉంటుంది.

పశ్చిమ ఆఫ్రికా రాజ్యాలలో ఏకపక్ష రాజ్యాంగ వ్యవస్థను సమర్థించే కొందరు ఇట్లా అంటారు. యిరోపా రాజకీయ సంప్రదాయాలనుబట్టి సంక్రమించిన బహుపార్టీలపద్ధతి తగాదాలకంటే, ఏకపక్ష రాజ్యాంగ వ్యవస్థే సవ్యమైనది. ఈ పద్ధతి మూలంగా ప్రమాదభూయిష్టమైన రాజకీయ సంఘర్షణలు తొలగింపబడుతున్నాయి. బహ్వంగ సమాజాలలో అన్నిరకాలవారికి ప్రాతినిధ్యము, స్వతంత్రమైన చర్చలకు అవకాశముండే విధముగా ఏకైక రాజకీయ పక్షాలను సృష్టి చేసుకోగల్గితే, అప్పుడు అది రాజకీయమైన అధికారం కోసం ఆయా పార్టీలమధ్య తగాదాలు సాగే పద్ధతికన్నా ప్రశస్తమైనది అవుతుంది. అయితే అన్ని ఏకైక రాజకీయ పక్షాలు ఇట్లా ఉండవు. వీనిలో కొన్ని టోటిలిటారియన్ పద్ధతి పార్టీలు ఉన్నాయి. కొన్ని పిడి సిద్ధాంతపు పార్టీలు ఉన్నాయి. ఈ ప్రాంతానికి చెందిన కొన్ని కొన్ని దేశాలలో పలుకుబడి కలిగి సువ్యవస్థితాలైన తెగలు, ఒకటి అంటే ఒకదానికి పడనివి, పురాణవైరం కల్గినవి ఉన్నాయి. వీనికి తోడు ఆర్థిక సంబంధమైన అసమానిత్వాలు అధికం. ఇటువంటి పక్ష భేదాలు, హెచ్చు తగ్గులు లేని దేశం ఏదన్నా ఉంటే, అక్కడ రాజకీయ సమస్య అంటూనే లేదు. అప్పుడు రాజకీయ పక్షాల అవసరంకూడా లేదు. అవి ఎటువంటివైనా సరే. ఇట్లాకాక అన్నిరకాల తగాదాలు, ముఠావిరోధాలు మొదలైనవి పుష్కలంగా ఉన్నప్పుడు ఏకైక రాజకీయ పక్షపు పద్ధతివలన ఏమో జరుగుతుందనుకొనడం వట్టి భ్రమ మాత్రమే. అందరికీ ఆయితన ప్రాయమైన సదస్సువంటి దైతే యేయిబ్బంది లేదు. కేవలమైన ఇటువంటి ఆదర్శ పరిస్థితులనుండి పరస్పరము విరోధములు, పరస్పరము అనుమాన కానేషములు గల తెగలు, ముఠాలు ఉండి, అక్కడ ఆ దేశాలలో ఈ సర్వమైన అవాంతరాలను ఏకైక రాజకీయపక్షం పద్ధతిద్వారా పరిష్కారం చేసుకోవచ్చు ననుకుంటే అది కుదరదు. విఫలం అవుతుంది. ప్రతి ముఠాయున్నా తన పార్టీకే ఆ పార్టీలో ప్రాతినిధ్యం ఉండాలి అంటుంది. ఏ ఒక్క ఏకైక పక్షము అచ్చట ఎచ్చటా గుర్తింపబడదు. పూర్వం అనుకున్నాము— ఈ సమస్యలను ఏకైక రాజకీయ పక్ష పద్ధతి పరిష్కారం చేయలేదని; అక్కడ మిశ్రమ ప్రభుత్వాలు, ఫెడరల్ పద్ధతులు అవసరము అని. వివిధాలైన తెగలకుచెందిన వారిని, జాతులకు చెందిన వారిని దమననీతి ద్వారామున ఒక్క జాతిగా రూపొందచేయుడము అంటే అది పనిచెయ్యదు. అచ్చట ఇందుకు అనేకమైన తెగలను మతాలను అణచివెయ్యాలి; మరి అచ్చట నాయకులు

వీటిని వదిలి వ్యవహరిస్తారా అంటే అది ఉండదు. వారే, ఆ తెగలకు, ఆ మతాలకు, ఇంకా ఇతరమైన సంఘాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చి వ్యవహరిస్తూ ఉండటం జరుగుతూ ఉంటుంది. అందువల్లనే ఈ రకమైన యత్నం అడుగు ముందుకు వెయ్యదు. తెగకు సంబంధించిన అభినివేశాదులను జాతీయ సంబంధమైన అభినివేశం హఠాత్తుగా కొట్టిపారవెయ్యలేదు. వాని స్థానాన్ని ఉన్నపళంగా ఆక్రమించుకోలేదు. తెగలకు సంబంధించిన అభినివేశ విశ్వాసాలను అట్లా ఉంచి, వానిపైన యీ అఖండ జాతీయ భావాభినివేశాన్ని నిర్మించుకు రావాలి. ఇందుకుగాను చేయవలసిన పని ఇది. అన్ని తెగలవారున్నూ, తమఅభిప్రాయాలను తాము స్వేచ్ఛగా చెప్పుకోగల్గుతున్నామన్న భావాన్ని ఆత్మనా పొందగలందులకు వీలైన వ్యవస్థలను నిర్మాణం చెయ్యాలి.

పార్టీ పద్ధతి రాజకీయాలు బహ్వంగ సమాజాలను ఏమి చేస్తున్నదీ చూచినవారికి ఎవరికైనా ఒకటి అనిపిస్తుంది. ప్రజాస్వామ్యంయొక్క ప్రాథమిక దశ ఉంది. ఆ రకం ప్రజాస్వామ్యంలో ప్రజలు పార్టీలతో నిమిత్తంలేకుండా తమ ప్రతినిధులను ఎన్నుకుంటారు. తక్కిన ప్రజాస్వామ్య సంస్థలు తను తమ వ్యవహారాలను నడిపించుకుంటున్న తీరులోనే వీరూ తమ వ్యవహారాలను నడుపుకుంటారు. ఇటువంటి మనస్థితి సంవేదనము ఉన్నచోట, ఏకైక రాజకీయ పద్ధతి రాజ్యాంగం నచ్చుతూ ఉంటుంది. ప్రతి ఒక్కరు ఒకేపార్టీకి చెందిఉండి, అన్ని సమస్యలను స్వేచ్ఛగా చర్చచేయగలిగి ఉండిన పరిస్థితి అంటూ ఉన్నప్పుడు, అప్పుడు ఆ పరిస్థితికూడా పార్టీ అంటూ లేకుండా పనులు జరుపుకునే ఏర్పాటు ఉన్న సందర్భంలో ఉండే పరిస్థితి వంటిదే అవుతుంది. రాజకీయ పక్షాల లక్ష్యం, ప్రయోజనం రాజకీయమైన సంఘర్షణలు కొనసాగించడం; సమాజం వర్గసమాజం అయినప్పుడు ఇది సహించతగినది అవుతుంది. కాని బహ్వంగ సమాజాలలో ఇది చెల్లదు. పనిచేయదు. (సశేషం)

—ఎన్‌కౌంటర్ సౌజన్యంతో.



# కకుద్గిరి క్షేత్రము : కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి

శ్రీ కె. ఎస్. కోదండరామయ్య

(గతసంచిక తరువాయి)

అనంతపురము శాసనము తప్ప ప్రతాపరుద్ర చక్రవర్తి దక్షిణ దేశమున తీర్థయాత్ర కేగియుండెనని తెలియజేయు శాసన మేదియు నింతవరకు దొరకలేదు. అందువలన పై శాసనమందు చెప్పబడియుండు పుణ్యక్షేత్రయాత్ర అది యొక్కటియే యాతడు గావించినదని నిశ్చయముగా చెప్ప వచ్చును.

అయినను, శ్రీ మారేమండ రామారావుగారు ప్రతాపరుద్రుడు రాజ్యభారమును వహించినపిదప యొకసారి దక్షిణ దేశములోని పుణ్యతీర్థములను సేవించుటకు పోయి యుండెనని యూహించి యున్నారు. వారి యూహ సరియైనదా ? కాదా ? యనుటను పరిశీలించి చూడవలసి యున్నది. దీనిని గురించి వారిట్లు వ్రాసియున్నారు : "ఈ విజయములకు పిమ్మట చక్రవర్తి పుణ్యక్షేత్రముల దర్శింప నేగెను. .... శ్రీశైల త్రిపురాంతకాది యాలయములను జూచి, యటుపై నీ చక్రవర్తి దక్షిణమున కంచి కేగి, యటనుండి శ్రీరంగ, జంబుకేశ్వరముల వరకు ఏగెను. జంబుకేశ్వరము నందలి శివాలయములో నొకశాసనమున నేకశిలా పురపాలకుడగు ప్రతాపరుద్రదేవుడు ప్రశంసింపబడి యున్నాడు.....ఈ ప్రశంసనుబట్టి కాకతీయ చక్రవర్తి ఇంతవరకును వచ్చి యుండెనని యూహించుట కవకాశము నొసంగుచున్నది. అప్పటికా ప్రాంతమున ప్రబలురగు ప్రత్యర్థు లెవ్వరును లేకుండిరి..... ఈ కారణములను బట్టి ప్రతాపరుద్రుడు జంబుకేశ్వరమున దన విజయధ్వజమును నాటెనని యూహింపవచ్చును. ఈ సందర్భమునందీతడు ప్రకృతము మైసూరు దేశమందలి గొన్ని భాగములందు వీర విహార మొనర్చెనని తెలియుచున్నది. అందలి తుంకూరు తాలూకాలోని యొక శాసనమందు..... కాకతీయ ప్రతాపరుద్రుడు శివగంగ పర్వతమున కేగి, యచ్చట పుణ్యోదకమున స్నానమాడి అనంతపురమను గ్రామము నగ్రహారముగ దాన మొసగెనని చెప్పబడి యున్నది ......" (చూ. కాకతీయ సంచిక—పుట. 95).

దీని ననుసరించి కాబోలు సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ కర్తలు సయితమీ తీర్థయాత్రను గురించి, "దక్షిణమున పాండ్యులు కంచిని పట్టుకొని కాకతీయ పరిపాలకులను పారద్రోలిరి. వారిని ఓడించి తమ బలమును స్థిరపరచుకొనుటకు కాకతీయ సేనానులు ప్రయత్నించి నెగ్గిరి. మహారాజు శ్రీశైల, త్రిపురాంతక, కంచి, జంబుకేశ్వరాది పుణ్యతీర్థములను సేవించి, అనేక భూదానము లొనర్చి క్రీ. శ. 1318 నాటికి ఓరుగల్లు చేరెను......" (చూ. సం. ఆ. వి. కోశము. భాగ 1 పుట. 461.)

ఈ రెండు ఆధారములలోని అంశముల నుండి (1) ప్రతాపరుద్రుడు శ్రీశైల యాత్రతోపాటు దక్షిణ దేశము నందుగూడ పుణ్యక్షేత్ర యాత్రగావించెనా ? (2) జంబుకేశ్వరాలయ శాసనము ఆ సమయమున వేయబడినదా ? (3) తత్కాలమందలి దక్షిణ దేశ పరిస్థితులు తీర్థయాత్ర కనుకూలముగ నుండెనా ? (4) తుమకూరు ప్రాంతములకు ఆ సమయమున రుద్రరాజు వీరవిహార మొనర్చుట కేగియుండెనా ? అను ప్రశ్నలు బయల్వెడలుచున్నవి. అందువలన వీనికి దగు సమాధానములను కనుగొనవలసి యున్నది.

## శ్రీశైల యాత్ర

ప్రతాపరుద్రరాజొకసారి శ్రీశైల ప్రాంతమున కేగి యుండెను. ఈ యాత్ర మహమ్మదీయుల మూడవ దండయాత్ర సాగినపిదప జరిగినదని చిలుకూరి వీరభద్రరావు గారు విశదపరచి యున్నారు. (చూ. కాకతీయాంధ్రరాజ యుగ చరిత్రము. పుట 570). మాలికాఫర్ మూడవ దండయాత్రను పూర్తిగావించుకొని, అపారమైన ధనరాసులతో క్రీ. శ. 1310 వ సంవత్సరము, మార్చి నెల 16 వ తేదీని ఢిల్లీకి పయనమై పోయినట్లు తెలియుచున్నది. కాని, అతడు ఢిల్లీ నగరమున గొన్ని నెలలు మాత్రమే యుండి, ఆ సంవత్సరము కడపట, అనగా క్రీ. శ. 1310 వ సంవత్సరమున నవంబరు నెలలో మరల (నాలుగవసారి) దక్షిణ దేశముపై దండయాత్రకు బయలుదేరెను. ఈ సమయమందే అతడు

హొయసలుల రాజధానియగు ద్వారసముద్రమును కొల్లగొట్టి, పిదప దక్షిణ మధుర కేగి, యచ్చట ధనరాసుల దోచుకొని, మరల 1311 వ సంవత్సరాంతమందో, లేక 1312 వ సంవత్సరాదియందో ఢిల్లీకి మరలిపోయెనని చరిత్ర గ్రంథముల నుండి తెలియుచున్నది.

"The army left Delhi in november A. D. 1310······Malik kafur, returned to Delhi about the end of the year A. D. 1311 or early in 1312 with all the great booty that he had taken in his invasion of Mabar. .... .. [Vide. South India and her Muhammadan Invaders. Page 92 and 118.]

దీనినుండి మాలికాఫరు గావించిన మూడవ దండయాత్రకును, మరియు నాలుగవ దండయాత్రకును మధ్య నుండిన వ్యవధి దాదాపు ఏడెనిమిది నెలలు మాత్రమేయని తెలియుచున్నది. ప్రతాపరుద్రుడు మూడవ దండయాత్ర కాలమున మహమ్మదీయులతో నైన యుద్ధమువలన నధిక కష్టమును బొందెను. కావున మరల ధనమును సంపాదించి రాజ్యమును బాగుచేసుకొనుటకును, తన రాజ్యపు దక్షిణ సరిహద్దులలో పొడచూపిన అల్లరుల నణచి కాపాడుటకును వెళ్లియుండెను. ఆ సమయమందే యతడు శ్రీశైలము, మరియు త్రిపురాంతకములను దర్శించెను. కావున నీ కార్యములు పై మూడవ దండయాత్రకును, మరియు నాలుగవ దండయాత్రకును మధ్య నుండిన ఆ స్వల్పమైన వ్యవధియందే జరిగియుండవలయును. ఏల యనగా క్రీ. శ. 1311 వ సంవత్సరమున మాలికాఫరు దక్షిణ దేశమున నుండెను. కావున ఆ సమయమందు శ్రీశైల ప్రాంతములకేగుట కవకాశములేదు. కావున క్రీ. శ. 1310 వ సంవత్సరమందే ప్రతాపరుద్రరాజు శ్రీశైలమున కేగియుండెనని గట్టిగ చెప్పవచ్చును. ఈ నిశ్చయమును ఋజువుపరచగల మరియొక ఆధారమున్నది. ప్రతాపరుద్రరాజు ముందుగా త్రిపురాంతమున కేగెను; ఆ పిదప శ్రీశైలమున కేగెను. అచ్చటినుండి అతడు బయలుదేరి కొచ్చెర్లకోట దుర్గప్రాంతమున కేగెను. ఆ సమయమునందే యతడు కందనోలిసీమను విడెము కొమ్మరాజున కొసంగెను. ఈ కొమ్మరాజునకు నాగరాజు అను మంత్రి యుండెను. అతడనేక గ్రామముల నిర్మించి దానధర్మములు గావించెను. అతడు గ్రామములను శా. శ. 1232 (క్రీ. శ 1310) లో గావించినటుల శాసనములనుండి తెలియుచున్నది. (చూ. కాకతీయ ఆంధ్రరాజ చరిత్రము. పుట. 571) ఈ దానములు గావింపబడుటకు కొంతముందు ప్రతాపరుద్రుడు కందనోలిసీమను కొమ్మరాజున కిచ్చెనని పై అంశమునుండి విశదమగుచున్నది. ఇది ఇంచుమించుగ క్రీ. శ. 1310 వ సంవత్సర మధ్యభాగమున జరిగెనని దలంపవచ్చును. ఆ సంవత్సరాంతమున మాలికాఫరు మరల దండయాత్రకు బయలుదేరె ననెడి వార్తలు వచ్చియుండును. అందువలన ప్రతాపరుద్రుడు తన రాజధానికి మరలిపోయియుండును. కావున పై విషయముల నన్నిటిని పరిశీలించి చూచినయెడల ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1310 వ సంవత్సరము ముగియక మునుపే శ్రీశైలయాత్రను ముగించియుండెననియు, అతడా ప్రాంతమునుండి రాజధానికి మరలివచ్చెనే కాని, కాంచీపురము వైపు పోలేదనియు నిశ్చయముగా జెప్పవచ్చును.

## కాకతీయ సేనానుల కాంచీపుర దండయాత్ర

ప్రతాపరుద్రుడు శ్రీశైల ప్రాంతమునుండి ఓరుగంటికి మరలిపోయెనే కాని, కాంచీపురమునకు బోలేదని తెలిసినది. క్రీ. శ. 1311 నుండి 1312 సంవత్సరారంభమువరకు మాలికాఫరు దక్షిణదేశములో దండయాత్రను సాగించుచుండెను. అతడు దానిని ముగించుకొని ఢిల్లీ నగరమునకు బయనమై పోయినపిదప, పాండ్యరాజులు కాంచీపురమును ముట్టడించి, యచటనుండిన కాకతీయసామంతుడైన మనుమగండగోపాలుని పారద్రోలి ఆ పట్టణమును ఆక్రమించుకొనిరని చరిత్ర గ్రంథముల నుండి తెలియుచున్నది. ఇది తెలిసి రుద్రరాజు తన సేనానాయకుండగు ఎఱ్ఱదాచానాయుడు, మరియు నతని సోదరుడగు నల్లదాచానాయుడు అను వారలను పాండ్యులమీదికి బంపెను. వారును కంచినిజేరి, పాండ్యులతో యుద్ధముచేసి, వారిని జయించి, ధనకనక వస్తువాహనములతో ఓరుగంటికి వచ్చిరని తెలియుచున్నది. ఈ విషయమును గురించి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారిట్లు వ్రాసియున్నారు : "ఎఱ్ఱదాచానాయడు కాంచీపుర సామీప్యమున బాండ్యులతో ఘోర యుద్ధముచేసి, వారలను జయించి గజ తురగచ్ఛత్ర చామరాందోళికాదులు పెక్కులు గ్రహించుటయే గాక, శిరోభూషణమగు నఱచేతి వెడల్పుగల యొక గొప్ప పచ్చను, ఒక స్వర్ణమయ సింహాసనమును దీసికొనివచ్చి, తాను దెచ్చిన ధనకనకవస్తువాహనాదులు నమూల్య రత్నాదులను ప్రతాపరుద్రునకు సమర్పించెను. ప్రతాపరుద్రుడు మెచ్చి వానికి "పంచపాండ్యదళ విభాళ", "కంచి కవాట చూరకార" అను బిరుదముల నిచ్చెనట......" (చూ. కాక. ఆం. రా. చరిత్రము. పుట. 473.)

దీనినుండి కంచిదండయాత్రకు ప్రతాపరుద్రరాజు పోలేదనియు, నతడా కార్యమునకు తన సేనానులను బంపి, తాను ఓరుగంటియందే యుండెననియు తెలియుచున్నది. ఈ విషయమును వెలుగోటివారి వంశావళిలోని క్రింది పద్యములు బలపరచుచున్నవి.

చం. వెలయ బ్రతాపరుద్రునసభ విశ్రుతికెక్క, భటాళి చూడగా
జలమున గుంతమందుకొని చయ్యనవచ్చుగజంబు నోర్చి, దో
ర్బల భుజవిక్రమంబునను బైకొని తా జయలక్ష్మి జేకొనన్
గెలిచెను బాండ్యరాజ గజకేసరి దాచయశౌరి పాండ్యులన్.
(పద్యము 36)

ఉ. లాలిత శౌర్యశక్తి నవలక్ష తెనుంగు దళంబు నాజిలో
దోలిన పాండ్యభూవిభునితోడి పెనంకువకోర్చి సన్నుతిన్,
వాలి ప్రతాపరుద్రుసభ వర్ణనకెక్కిన యెఱ్ఱి దాచ భూ
పాలసుతుండు సింగని కభంగుని కే బిరుదైన జెల్లదే.
(పద్యం—41)

ఈ రెండు పద్యములను పరిశీలించి చూచిన పాండ్యులనుజయించుటకు, కాంచీపుర రణరంగమునకు ప్రతాపరుద్రుడు పోలేదనియు, నతడు ఓరగంటియందే యుండెననియు, అతని సేనానాయకులు మాత్రమే పోయియుండిరనియు స్పష్టముగా దెలియుచున్నది. దీనినుండి, వెలుగోటివారి వంశావళిలోని ఆంగ్ల పీఠికలో శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు, కాంచీపుర దండయాత్రలో ప్రతాపరుద్రుడు కూడ నుండెనని వ్రాసియుండుట సరికాదని చెప్పవలసియున్నది. వారిట్లు వ్రాసియున్నారు :

"Erradacha boldly faced the Pandyas who had put the 900,000 Telugu forces to flight on a former occasion; he charged the famous Pandyan elephant squadron at the command of king pratapa-rudra and captued it. Finally he attached the five Pandyas, Vira Pandya, Vikrama Pandya, Parakrama Pandya, Sundara-Pandya and Kulasekhara Pandya and inflicted an ignominous defeat on them. As a mark of his appreciation Pratapa-rudra conferred on Erra Dacha and his Cousin the titles, 'Pandya-dala Vibhala,' (Chastiser of the Pandyan army) and 'Pandya Gaja Kesari' (Lion to Pandyan elephant" (Vide. Intro-page 5 and 6.)

ఈ వ్రాత కాధారమైన పై రెండు పద్యములలో, ఎఱ్ఱిదాచానాయుడు పాండ్యుల గజంబును దాకి దానిని బట్టుకొనెనను విషయము ప్రతాపరుద్రుని సభలో విశ్రుతి కెక్కెనని మొదటి పద్యమునందును, పాండ్యులను జయించి ఎఱ్ఱిదాచానాయకుడు ప్రతాపరుద్రరాజు సభ కేగగా నాతని సభలో నీ విషయము వర్ణన కెక్కెనని రెండవ పద్యమునందును నున్నవి. అంతేకాని, దేనియందును ప్రతాపరుద్రుడు సంగ్రామ రంగము కేగెనని లేదు. అందువల్లనే ప్రతాపరుద్రుడు కాంచీపుర రణభూమి కేగి యుండెనను యూహ సరికాదని చెప్పవలసి యున్నది.

## మొదటి కాంచీపుర దండయాత్ర జరిగిన కాలము

కాంచీపురమువద్ద పాండ్యులతో కాకతీయులకు జరిగిన యీ యుద్ధము క్రీ. శ. 1313 లో తటస్థించినట్లు శ్రీ వీరభద్రరావుగారి వ్రాతల నుండి తెలియుచున్నది. వారిట్లు వ్రాసియున్నారు : "విక్రమసింహ పురాధిపతియైన నల్లసిద్ధిరాజునకు జ్యేష్ఠ కుమారుడైన మనుమగండ గోపాలదేవ మహారాజు కాకతీయ సైన్యాధిపతుల సాహాయ్యముతో కాంచీపురమును మరల స్వాధీనముచేసికొని, పరిపాలనము చేయుచుండగా, పరాభూతులయిన పాండ్యరాజ కుమారులను దోడు చేసికొని, కేరళాధీశ్వరుండైన రవివర్మ క్రీ. శ. 1313—14 వ సంవత్సరమున గాంచీపురమును రెండవమారు ముట్టడించి మనుమగండ గోపాలుని బాఱద్రోలి రాజ్యమాక్రమించుకొని కాంచీపురమున బట్టాభిషిక్తుడయ్యెను....." (చూ. కాక— ఆం. రా. చరిత్రము. పుట. 574.)

ఈ యుద్ధము, శ్రీ వీరభద్రరావుగారు నిశ్చయించియుండు సంవత్సరము, అనగా క్రీ. శ. 1313 కు గొంత ముందుగా జరిగినట్లు నిశ్చయించుటకు గొంత అవకాశమున్నది. ఆ విషయమును పరిశీలించి చూతము. కేరళ రాజగు రవివర్మ కులశేఖరరాజు, కాంచీపుర ప్రాంతమును స్వాధీనపఱచుకొని, వేగావతీ నదీతీరమందుండిన యీ నగరములో క్రీ. శ. 1313 లోపట్టాభిషేకము చేసికొనినట్లు చరిత్రకారులంగీకరించియున్నారు. కాని, యాతడు పట్టాభిషిక్తుడైన పిదప కొన్ని నెలలలోనే మరణించెనని కేరళ దేశ చరిత్రకారులిటీవల నిర్ణయించినారు.

"Vira Pandya proving himself too powerful, the parricide Sundara was forced to seek the help of Muhammadans. When the latter advanced against Madura in 1311 A.D, that place was evacuated by Vira Pandya ... .... Taking advantage of these events Ravivarma Sangrama dhira appears to have pushed his armies as far north as Conjivaram conquering Vira Pandya, subjugating the Pandya and Chola territories and crowning himself on the banks of the Vegavati in Congivaram, in 1313. It looks as if Ravivarman did not continue long after his coronation .... ...." (Vide.Some Early Sovereigns of Travancore, by Sri Sundaram pillai M. A. page 68. Foot note: no. 1).

పట్టాభిషిక్తుడైన కొన్ని నెలలలోనే రవివర్మ హఠాత్తుగ మరణించెనని పై అంశమునుండి తెలియుచున్నది. ఇది నిజమనుటను మరియొక ఆధారము కూడ బలపరచుచున్నది. 'ఆధునిక తిరువాన్కూరు' అను ఆంగ్ల గ్రంథమందు తత్కర్తయగు శ్రీ పద్మనాభ అయ్యరుగారీ విషయమును గురించి యిట్లు వ్రాసియున్నారు.

"The period of Ravivarma was the brightest in the medieval History of Travancore. It was during his reign that Travancore attained to the hegamony of South India ...... Ravi Varma showed marks of greatness even as a boy by defeating Vikrama Pandya and winning the daughter of the Pandyan king in marriage. Before he attained his thirty third year, he brought the Pandya territories to subjugation. Soon after, he overran the whole of the west coast and established his undisputed authority. His ambition urged him to further conquests. He crossed the Sahyadri once again, conquered the whole of south India up to Nellore in the North and crowned himself *emperor* on the banks of the Vegavathi, in the ancient and historic city of Kanchipuram. This event of unique importance was celeberated in 1313 A D, in his 46 th year of age .... .... The imperial position attained by Travancore under Ravivarma was however, short lived. With his sudden and premature death in 1313 AD, the newly acquired territories fell to pieces. The Kakatiyas of Warrangal and the Pandya King who had been driven away by Ravi Varma recovered possession of their last dominions" (Vide-Modern Travancore by. A. Padmanabha Iyer. page. 22.)

ఈ యాధారమునుండి పట్టాభిషిక్తుడైన కొన్ని నెలలలోనే రవివర్మ మరణించెననుట నిజమని తేలినది.

రవివర్మ మరణానంతరము కేరళ సింహాసనమునకు రెండవ ఉదయమార్తాండవర్మ వచ్చెనని తెలియుచున్నది. ఇతని శాసన మొకటి క్రీ. శ. 1313 నాటిది కాంచీపురమున దొరికినది. క్రీ. శ. 1313 లో వీరమార్తాండవర్మ తిరువాన్కూరుకు రాజుగా నుండెనని యీ శాసనమునుండి తెలియుచున్నది.

"It looks as if Ravivarman did not continue long after his coronation, since we are told by this record (Ins. no 14/69) that Vira Udaya Marthanda Varma was the king of Venadu in A.D. 1313." (Vide—Early sour—of Travancore, page. 67)

ఈ యీ శాసనాధారము రవివర్మ క్రీ. శ. 1313 లో మరణించెననుట యదార్థమని నిరూపించుచున్నది. రవివర్మ కాంచీపురమునందుండిన పాండ్యులను జయించి, అచ్చట క్రీ. శ. 1313 లో పట్టాభిషేకము చేసికొనెనని తెలియుచున్నందున, రవివర్మ ఆక్రమణమునకుముందు కాంచీపురము పాండ్యుల వశమందుండెనని తెలియుచున్నది. ఈ యంశముల నన్నింటిని బట్టి యాలోచించిన, మాలికాఫరు మరలిపోయిన పిదప పాండ్యులు కాంచీపురమును ఆక్రమించిరనియు, అందువలన ప్రతాపరుద్రుడు తన సేనానాయకులగు ఎఱ్ఱదాచానాయడు మరియు నల్లదాచానాయడు మొదలగువారిని బంపగా వారు పాండ్యులను జయించి, కాంచీపురమును స్వాధీనపరచుకొని మనుమగండ గోపాలదేవుని మరల కంచిలో నిలిపిరనియు, కాని, మరల పాండ్యు లతనిని బారద్రోలి, ఆ పట్టణమును స్వాధీన పరచుకొనియుండగా, కేరళ రాజగు రవివర్మ పాండ్యులను జయించి, కంచి నాక్రమించి యచ్చట పట్టాభిషిక్తుడయ్యె ననియు తెలియుచున్నది. గావున క్రీ. శ. 1312 వ సంవత్స రాదియందు మాలికాఫరు మరలిపోయిన తర్వాతను, రవివర్మ కంచిని జయించుటకు పూర్వమును కాకతీయుల కాంచీపుర దండయాత్ర జరిగెనని తేలుచున్నది. అనగా నా దండయాత్ర క్రీ. శ. 1312—1313 లో జరిగెనని దృఢముగా నిశ్చ యించవచ్చును. ఇది కాంచీపురముపై కాకతీయులు గావించిన మొదటి దండయాత్ర. ఈ అంశములనుండి, ప్రతాపరుద్రరాజు యీ దండయాత్రలో నుండలేదనియు, నాతడా సమయమున రాజధానియందే యుండెననియు నిశ్చయముగా దెలియుచున్నది.

## జంబుకేశ్వరాలయ శాసనము

కాకతీయ సంచిక సంపాదకులు, ప్రతాపరుద్రుడు కంచి కేగి, యచ్చటినుండి శ్రీరంగము, జంబుకేశ్వరమువరకు పోయియుండెననియు, జంబుకేశ్వరాలయములో నతడు శిలా శాసనము వేయించెననియు చెప్పియున్నారు. కాని, ఇంతవరకు చెప్పియుండు విషయములనుండి అతడు క్రీ. శ. 1312—13 ప్రాంతమున కాంచీపురమునకే పోలేదని తేలినది. కాంచీపుర మునకే పోని యాతడు జంబుకేశ్వరమున కెట్లు పోయి యుండగలడు ? అందువలన ప్రతాపరుద్రుడు జంబుకేశ్వర మునకు వెళ్లలేదని దృఢముగా చెప్పవచ్చును. కాబట్టి జంబు కేశ్వరాలయమందలి శాసనము, కాకతీయ సంచికా సంపాద కులూహించినపుడు వేయించినది కాదు. అది వేరొక సందర్భ మున వేయించినదై యుండును.

## రెండవ కాంచీపుర దండయాత్ర

కాకతీయ సేనాధీశుడైన ముప్పిడి నాయకు డొకసారి కంచిపై దాడి సలిపి, పాండ్యుల నోడించి, తెలుగు చోడుడును, కాకతీయ సామంతుడును నైన మానవీరుని సింహా

సనముపై గూర్చుండబెట్టెనని కాకతీయరాజుల చరిత్రము నుండి తెలియుచున్నది. దీనిని గురించి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారిట్లు వ్రాసియున్నారు : "మనుమగండ గోపాలదేవ చోడవ మహారాజు కాకతీయ సైన్యాధిపతుల సాహాయ్యముతో కాంచీపురమును మరల స్వాధీనము చేసుకొని పరిపాలనము చేయుచుండగా పరాభూతులయిన పాండ్యరాజ కుమారులను దోడు చేసికొని, కేరళాధీశ్వరుండైన రవివర్మ క్రీ.శ.1313-14 వ సంవత్సరమున కాంచీపురమును రెండవమారు ముట్టడించి మనుమగండ గోపాలుని బాఱద్రోలి, రాజ్య మాక్రమించుకొని కాంచీపురమున పట్టాభిషిక్తుడయ్యెను. ఈ వృత్తాంతమును విని ప్రతాపరుద్రుని మహా ప్రధానులలో నొక్కడగు ముప్పిడినాయకుడు దాక్షిణాత్యులను కాంచీపురము నుండి తరుమగొట్టుటకై నియోగింపబడెను..... ఈ కమ్మ సేనాధిపతియైన ముప్పిడి నాయకుడు కాంచీపురమును ముట్టడించి, పాండ్య కేరళుల తోడ ఘోర యుద్ధము చేసి రవివర్మ యాదిగాగల రాజకుమార వర్గమును బాఱద్రోలి కాంచీపురమును ప్రవేశించి, మానవీరుని పట్టాభిషిక్తుని గావించెను... ముప్పిడినాయకుడు క్రీ. శ. 1319 వ సంవత్సరము జూను నెల 11 వ తేదీ మానవీరుని పట్టబంధము గావించి సింహాసనమెక్కించి, 16 వ తేదీని కాంచీపురములో నున్నట్టి అరుళాళ పెరుమాళ్ల దేవాలయమునకు దానధర్మములను గావించి శాసనము వ్రాయించెను...." (చూ. కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము పుట. 374.)

తెలుగు విజ్ఞాన సర్వస్వములో శ్రీ మారేమండ రామారావుగా రిట్లు వ్రాసియున్నారు : "1313 లో రవివర్మ మనుమగండ గోపాలుని పారద్రోలి కంచిని ఆక్రమించుకొనెను...... ......ముప్పిడి నాయకుడు కాంచీపురముపై కేగెను....మహారాజును, ముప్పిడి నాయకుడును పాండ్యులను జయించి కంచిని వశపరచుకొనిరి. దేవరి నాయనింగారు, కొలని అన్నమదేవుడు మున్నగు సేనానులు పాండ్యులను జంబుకేశ్వరము వరకు తరిమిరి. నెల్లూరు నగరమున మానవీరుడను సామంతుడు ప్రతిష్ఠింపబడెను......" (చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము—భాగము 3. పుట. 233.)

పై ఇరువురి వ్రాతల యందును పరస్పర విరుద్ధాంశములు కొన్ని యున్నవి. ప్రతాపరుద్రుడు ముప్పిడి నాయకునితో కాంచీపురమునకు బోయి యుండినట్లు చిలుకూరి వీరభద్రరావుగారు చెప్పలేదు. కాని రామారావుగా రతడు వెళ్లి యుండెనని వ్రాసియున్నారు. ఇదియేగాక, ఇటీవల లభించి యుండు కొన్ని చారిత్రకాధారములనుంచి పై ఇరువురి వ్రాతలలోని కొన్ని యంశములు సరిగా లేవని చెప్పవలసి యున్నది. వీని నిచ్చట విశదపరచెదను.

రవివర్మ కులశేఖరుడు పాండ్యరాజ కుమారులను దోడు చేసుకొని క్రీ. శ. 1313 లో కాంచీపురమును ముట్టడించెననుట సరిగాదు. రవివర్మకు పాండ్యులు తోడ్పడిరని చెప్పుట కాధారములు లేవు. మహాశూరుడగు నతడొక్కడే యా పనిని సాధించెనని తెలియుచున్నది. ఇట్లే ముప్పిడి నాయకుడు కాంచీపురము ముట్టడిలో రవివర్మ యాదిగాగల రాజకుమార వర్గమును బారద్రోలె ననుటయు సరిగాదు. ఏలయన, ముప్పిడి నాయకుని కాంచీపుర ముట్టడి క్రీ. శ. 1313 వ సంవత్సరమున కావలనే జరిగెను శ్రీ నెలటూరి వేంకటరమణయ్యగారు యుద్ధము క్రీ శ 1316 లో జరిగెనని తేల్చియున్నారు (చూ. వెలుగోటివారి వంశావళి—ఆంగ్ల పీఠిక— పుట 6)

["Tae battle of Kanchi took place during Muppidinayaka's invasion of the Country in 1316 A. D."]

కాంచీపురములో క్రీ. శ. 1313 లో పట్టాభిషిక్తుడయిన రవివర్మ హఠాత్తుగా పట్టాభిషేకమైన కొన్ని నెలలలోనే మరణించెనవియు, ఆ తర్వాత కేరళ దేశమునకు వీర ఉదయమార్తాండవర్మ పాలకుడుగా వచ్చెననియు వింతకుముందే నిరూపించియున్నాను. ఇంతేగాక, క్రీ. శ. 1316 వ సంవత్సరమందు సయిత మార్తాండవర్మయే పాలించుచుండెనని శాసనాధారములనుండి తెలియుచున్నది.

"Thus on the 22nd Kumbha 491 M. E. or roughly speaking about the end of February 1316 the sovereign of Venad was Sri Vira Udaya Marthanda Varma, who it will be observed, styled himself as, 'Vira Pandya Deva" (Vide Some Early Soverigns of Travancore—Page—67.)

దీనిబట్టి ముప్పిడినాయకుడు జయించినది, రవివర్మను కాదనియు, వీరమార్తాండవర్మ ననియు విశదమగుచున్నది.

ఇచ్చట శ్రీ వేంకటరమణయ్యగారి యొక్క అభిప్రాయమును కొంత పరిశీలించవలసి యున్నవి. వెలుగోటివారి వంశావళిలోని ఆంగ్ల పీఠికలో కంచినుండి పాండ్యులను దఱుమగొట్టుటకు ప్రతాపరుద్రుడు ముప్పిడినాయకుని పంపెనని వ్రాసి, మరల నధోజ్ఞప్తికలో (Foot-note) సాధారణముగ ముప్పిడి నాయకుడు కేరళ రాజును కంచినుండి తరుమగొట్టెనని చెప్పబడుచున్నది. కాని యందులకు తగిన యాధారము గనబడదనియు, అరుళాళ పెరుమాళ దేవాలయ శాసనములో నతడు దాక్షిణాత్య రాజులను యుద్ధమం దోడించెనని మాత్రమే చెప్పబడినదనియు, ఒకవేళ ముప్పిడి నాయకుడు పాండ్యులను జయించెనని తలంచిన పక్షమున, పాండ్యులు, రవివర్మ కులశేఖరుని ఓడించి కంచిని ఆక్రమించి యుండగా, ముప్పిడి నాయకుడు వీరిని జయించి కంచినుండి తఱుమగొట్టెనని చెప్పవలసియుండుననియు వ్రాసియున్నారు.:

"It was to supress this rebellion and expell the Pandyas from Kanchi that Pratapa Rudra sent an expedition to the

South. The army was placed under the commaud of Muppidi Nayaka, the governor of Vikramasimha Pattama (Nellore)..... The opinion which is commonly held that the Kerala Sovereign was expelled by Muppidi Nayaka is baseless. The available evidence does not Justify this inference. The Arulala Perumal temple inscription states in general terms that Muppidi Nayaka defeated the Southern Kings. The Velugotivari Vamsavali refers, as noticed above only to the Pancha Pandyas in this connection. If Muppidi Nayaka captured Kanchi after defeating the Pandyas in 1316 A.D., it is reasonable to hold that the Pandyas were in occupation of the city at that time. It follows from this that they should have driven away Ravivarma Kulasekara and re-occupied Kanchi and the neighbouring territory" (Vide. Page 7)

పై పంక్తులలోని అంశములు సరియైనవా ? కావా ? యనుటను పరిశీలించి చూడవలసి యున్నది. ముప్పిడి నాయకుడు పాండ్య కేరళులతోడ యుద్ధముచేసి, రవివర్మ యాదిగా గల రాజకుమార వర్గమును ఓడించి పాఱద్రోలెనని చిలుకూరు వీరభద్రరావుగారు వ్రాసియుండగా శ్రీ వేంకటరమణయ్యగారు, ముప్పిడినాయకుడు కేరళులతో యుద్ధము చేయలేదనియు, దాక్షిణాత్య రాజులతో మాత్రమే యుద్ధము జేసెననియు వ్రాసియున్నారు. కావున, ఈ దాక్షిణాత్య రాజులెవరో కనుగొనవలయును. ముప్పిడి నాయకుని దండయాత్ర జరిగిన సమయమున దక్షిణ దేశమును (అనగా కాకతీయ రాజ్యమునకు దక్షిణమున గల దేశమును) పాలించుచుండిన వారు, ముప్పురు. వారిలో నొకరు కేరళులు, రెండవవారు పాండ్యులు. మూడవవారు హోయసలులు. ముప్పిడి నాయకుడు జయించినది "దాకిణాత్య రాజులను" (Southern Kings) అని బహువచనమున జెప్పియున్నందున ఆ యుద్ధములో పై ముప్పురిలో కనీస మిరువురైన యుండిరని దృఢముగ జెప్పవచ్చును. ఆ సమయమున హోయసల రాజ్యమును పాలించుచుండినది మూడవ బల్లాళుడు. అతడు క్రీ. శ. 1291 నుండి 1342 వరకు హోయసల రాజ్యమును పాలించెను. కాని, 'ఆతడీ కాంచీపుర యుద్ధములో పాల్గొనినట్లు కనబడదు. అందువలన నిక మిగిలినవా రిరువురే. కావుననే ముప్పిడి నాయకుడు కేరళులతోను, మరియు పాండ్యులతోను పోరెనని తెలియుచున్నది. కేరళ రాజగు రవివర్మ క్రీ. శ. 1313 లోనే మరణించెననియు, నాతనికి పిదప వీరమార్తాండవర్మయను నాతడు కేరళ సింహాసనమునకు వచ్చెననియు నింతకుముందే విశదపరచియున్నాను. అందువలన ముప్పిడి నాయకుడీ మార్తాండ వర్మతోనే యుద్ధము చేసెననుట తథ్యమగుచున్నది.

కేరళులు మరియు పాండ్యులు కలసి ముప్పిడినాయకునితో బోరిరా ? లేక విడివిడిగా పోరిరా ? యనుటను కనుగొనవలసి యున్నది. తిరువాన్కూరు రాజ్య చరిత్ర గ్రంథము లందు, రవివర్మ వలెనే, వీరమార్తాండవర్మ కూడ పాండ్యులను తనకు విధేయులుగా జేసికొని పాలించెననియు, మరియు పాండ్యులకు సంతృప్తిని కలిగించుటకై మార్తాండవర్మ తన పేరుతో "వీరపాండ్య" యను పదమును గూడ చేర్చి, వ్యవహరించుచుండెననియు విశదముగా జెప్పబడి యున్నది.

"In the subjoined record the word 'Vira-Pandya devarku' is entered immediatly after Vira Udaya Marthanda Varma Tiruvadiyar, the proper name of the Venadu King and seems to form part of it... .In the case Viramarthanda Varma Tirumudiyar, therefore it is certain that 'Vira Pandya' was a part of the name of the Venadu King. We have perhaps to assume that it was adopted to show his overlordship and was just as in the case of his immediate predecessor Ravivarma Sangramadhira,..."(Vide-Some Early Soverigns of Travancore-Page 67, F. N. 3)

ఇంతేకాక, పై ఆంగ్ల గ్రంథము నుండి క్రీ. శ. 1316 వ ప్రాంతమున పాండ్యరాజ్యమును "వీరపాండ్యుడు" అను రాజు పాలించుచుండెననియు దెలియుచున్నది.

"The Pandya contemporary of Vira Udaya Marthanda Varma Tirumudi was Vira Pandya....who was actually crowned in A D. 1310 and continued to rule till A. D. 1342" (Vida—ibid).

ఇట్లు పాండ్యరాజగు వీరపాండ్యుడు, కేరళ రాజగు ఉదయమార్తాండవర్మకు లోబడి యతని సామంతరాజుగా పాలించుచుండెనని తెలియుచున్నది. వీరిద్దరు కలిసి, కాంచీపురమువద్ద ముప్పిడి నాయకునితో బోరి, తుద కోడిపోయిరని దృఢముగా చెప్పవచ్చును.

## కాంచీనగరములో ముప్పిడి నాయకుడు

ముప్పిడి నాయకుడు క్రీ. శ. 1316 లో కంచిని స్వాధీనపరచుకొనినను, వెంటనే ఓరుగంటికి మరలిరాక, సుమారు మూడు సంవత్సరములచ్చటనే యుండెనని తెలియుచున్నది. ఇట్లాత డచ్చట చాలకాలము వరకు నుండుట కేమి

కారణమో తెలియదు. ఒకవేళ 1316 లో ప్రారంభమైన యుద్ధము వెనువెంటనే పూర్తిగా ముగియక, మరికొంత కాలము వరకు సాగెనో, లేక, కాంచీపుర ప్రాంత మందలి రాజకీయ పరిస్థితులు తృప్తికరముగా నుండనందున, మరికొంత కాల మచ్చటనే యుండి, పరిస్థితులను చక్కబరచి, మరల పాండ్యులనుండి యేలాటి భయమును లేకుండ జేసి, కాకతీయ చక్రవర్తి అధికార మా ప్రాంతమున స్థిరముగా నెలకొల్పి, పిదప రాజధానికి మరలివచ్చెనో నిశ్చయముగ దెలియదు.

ముప్పిడి నాయకుడు కంచిని వదలిపోవుటకు ముందు 'మానవీరుడ'ను తెలుగుచోడరాజును కాంచీపురమునకు పాలకునిగా నియమించెనని తెలియుచున్నది. ఈ మానవీరుని పట్టాభిషేకము క్రీ. శ. 1319 వ సంవత్సరము జూను నెల 11 వ తేదీని జరిగెనని అరుళాళ పెరుమాళ దేవాలయములోని యొక శాసనమునుండి తెలియుచున్నది. దీనినిబట్టి ముప్పిడి నాయకుడు కాంచీ నగరములో దాదాపు మూడు సంవత్సరము లుండెననుట యదార్థము.

## ఈ మానవీరు డెవడు?

కాంచీపుర పాలకుడుగా పట్టాభిషిక్తుడయిన యీ మానవీరు డెవడో స్పష్టముగా దెలియదు. శ్రీ మన్మహామండలేశ్వర మనుమగండ గోపాలదేవుడును, మానవీరుడును నొకే వ్యక్తిగా నుండవచ్చునని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగా రూహించి యున్నారు. "మనుమగండ గోపాలదేవ చోడ మహారాజే మానవీరుడని పేర్కొనబడియెనని తోచుచున్నది" (చూ. కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము, పుట. 574)

మానవీరుడును, మనుమగండ గోపాలదేవుడును నొకరే యని నిరూపించుటకు దగిన ఆధారము లింతవరకు లభించ లేదు. కాన ఈ మానవీరుడు ప్రత్యేకమైన వ్యక్తియని యూహించుటకు కొంత నిలువున్నది. శేలం జిల్లాలోని కృష్ణగిరి తాలూకాకు జెందిన వేపనపల్లి ఫిర్కాలో "మనవారునిపల్లి" యను నొక గ్రామ మున్నది. దీనికి సరియైన రూపము "మనవీరు (మానవీర) నిపలి" యని యుండవచ్చును. ఈ గ్రామము కోలారుజిల్లా నుండి, దక్షిణమున తమిళ జిల్లాలకు పోవు ప్రాచీన రాణువమార్గముమీద నున్నది. ఇచ్చట నొక ప్రాచీనమైన కోట శిధిలములు గలవు. హొయసల చక్రవర్తుల తూర్పు రాజధానియైన "కుందాణి దుర్గము" ఈ గ్రామమునకు కడు సమీపమందే యున్నది. ఇది హొయసలులకును, కాకతీయులకును సరిహద్దు ప్రాంతము. హొయసల చక్రవర్తియగు వీరసోమేశ్వరుని యనంతరము హొయసల రాజ్యము రెండుగా విభజింపబడెను. సోమేశ్వరుని పెద్దకొడుకైన ముమ్మడి నరసింహుడు పడమటి భాగమునకు పాలకుడుకాగా రెండవ కుమారుడైన వీరరామనాథుడు తూర్పు భాగమునకు పాలకుడై, కుందాణి నగరమును రాజధానిగా జేసికొని, తూర్పు భాగమును పాలించెను. "

"Kundani:— This is a place till recently unknown to fame in the Krishnagiri Taluk of the Salem district. It seens to have been in early times a place of considerable importance and is on one of those military Roads which were often made use of in the wars of Carnatic. As a road from here passes through the Berigai Palyam (in Hosur Taluk), Budikota (in Kolar district), and thence to Bangalore, it was one of the Capitals in the days of the last Hoyasalas" (Vide — Salem District Gazetteer. vol-1. Pt. II; Page 43).

కాకతీయులకును, హొయసలులకును మొదటినుండి శత్రుత్వ ముండినది. అందువలన నుభయ రాజ్యములకు మధ్య నుండిన గడిప్రాంతములలో నిరువురకును తరచుగా యుద్ధములు జరుగుచు, సరిహద్దు గీతలు మారుచు నుండెను. తిక్కనసోమయాజిచే నిర్వచనోత్తర రామాయణమును అంకితముగ గొన్న మనుమసిద్ధిరాజు తండ్రియగు "తిక్కరాజు" హొయసల చక్రవర్తియగు "సోమేశుని" జయించి నట్లును, మనుమసిద్ధిరాజు "కర్ణాటదర్ప విఘాతంబు నొనర్చె" నట్లును సాహిత్య గ్రంథాధారముల నుండియు, శాసనాధారముల నుండియు తెలియుచున్నది. వీరరామనాథుడు క్రీ. శ. 1254 నుండి 1295 వరకును, ఆ పిదప నాతడి కుమారుడగు విశ్వనాథుడు క్రీ. శ. 1293 నుండి 1298 వరకు కుందాణి నగరము నుండి హొయసల రాజ్యము యొక్క తూర్పు భాగమును పాలించిరి. ఆ పిదప మూడవ బల్లాళ చక్రవర్తి హొయసల సామ్రాజ్యమున కంతటికిని ఏకైక పాలకుడుగా సింహాసన మెక్కెను. కాని, క్రీ. శ. 1310—11 లో మాలికాఫరు దక్షిణ దేశముపై మరల దండెత్తి వచ్చెను. అతడు హొయసలుల రాజధానియగు ద్వారసముద్రమును ధ్వంస మొనర్చి, పిదప కుందాణి మార్గముగా దక్షిణ మధురకు దండయాత్ర సాగించెను. మాలికాఫరు కుందాణిని కొల్లగొట్టి నాశన మొనర్చెను. అంతటితో కుందాణి వైభవము క్రమముగా నశించినది. నేడిచ్చట ప్రాచీన శిధిలములు మాత్ర మగపడుచున్నవి. కుందాణి పతనముతో హొయసల రాజ్యములోని తూర్పు భాగమున అరాజక పరిస్థితు లేర్పడినట్లు తోచుచున్నది. అలాంటి సమయమున కాకతీయుల సామంతుడైన మానవీరుడనువాడు, కుందాణికి సమీపమున, నొక బలమైన దుర్గమును నిర్మించి కాకతీయ రాజ్యపు గడి రక్షకుడై పాలించుచుండవచ్చును. మానవీరుడు పాలించినందువల్లనే యా గ్రామమునకు "మానవీరునిపల్లి" యను పేరు గలిగి యుంటుంది. ముప్పిడి నాయకుడు కాంచీపురమున కేరళులతోను, పాండ్యులతోను యుద్ధము చేయుచున్న సమయమున ఈ మానవీరుడు తన సైన్యముతోనే యతనికి దోడ్పడి యుండును. యుద్ధమునందాతని శక్తి సామర్థ్యములను జూచి, ముప్పిడినాయకుడతనిని క్రీ. శ. 1319 లో కాంచీ

పురమునకు పాలకునిగా జేసియుండును. దీనికి సంబంధించిన వివరములు భావిపరిశోధనల ద్వారా తెలియవలసి యున్నది.

## ప్రతాపరుద్ర రాజు కాంచీపుర యుద్ధములకు పోలేదనుటకు మరియొక ఆధారము

ప్రతాపరుద్ర చక్రవర్తి క్రీ. శ. 1313 లో జరిగిన కాంచీపురపు ముట్టడియందు కాని, అలాగే క్రీ. శ. 1316 లో జరిగిన ముట్టడియందు కాని పాల్గొనలేదని యింతవరకు జెప్పబడిన అంశములనుండి స్పష్టముగా తెలియుచున్నది. ఆ సమయములందతడు రాజధానీ నగరమందే యుండెను. మరియు నప్పటి దేశపరిస్థితులు చాల అల్లకల్లోలముగ నుండెను. మాలికాఫరు దండయాత్ర జరిగిన సమయమున మహమ్మదీయులు గావించిన కిరాతక కృత్యములు, దోపిడులు ప్రజలను భయకంపితులను గావించెను. దేవగిరి దుర్గము, ఓరుగల్లు, ద్వారసముద్రము మొదలగు మహా రాజధానీ నగరములనే గాక తుదకు దక్షిణమందుండిన మధురా నగరమును గూడ మహమ్మదీయులు కొల్లగొట్టిరి. ఆ సమయమున వారి నెదిరించి పోరాడగల రాజెవ్వడును దక్షిణ దేశమందు గనబడలేదు. మూడవసారి మాలికాఫరు ఓరుగంటిని ముట్టడించినప్పు డతనితో పోరాడజాలక ప్రతాపరుద్రుడు ధనరాసు లొసగియు, జిజియా పన్ను నిచ్చుట కంగీకరించియు, సంధిచేసుకొని విశ్వ ప్రయత్నముతో ఆంధ్రసామ్రాజ్యమును అకాలప్రళయమునుండి రక్షించెను.

ఆ సమయమున ఢిల్లీ నగరమునకు మరలిపోయిన ఆ మహమ్మదీయ సేనానాయకుడు హఠాత్తుగా గొన్ని నెలలలోనే మరల దండెత్తి వచ్చెను. ఈ దండయాత్రలో మాలికాఫరు నర్మదా నదీతీరమునకు వచ్చినప్పు డాతనికి ఏనుగు లవసరమైనవట. వెంటనే యాతడు మంచి ఏనుగులను గొన్నింటిని పంపుమని ప్రతాపరుద్ర రాజునకు వార్త బంపెనట. మార్గాంతరము లేనందున నాతడు ఇరువది మూడు ఏనుగులను బంపెనట.

("The army left Delhi on the 24 th of Jumadal Akhir, A. H. 710, (November A.D. 1310), and marched by the bank of the Jumna ...... During these seventeen days, Amir Khusru says, they had to pass through ghats and the road lay across heights and depths, where even elephants became nearly invisible .... ... At the end of this march the Raja of Telingana sent twenty three powerful elephants ........" Vide, South India and Her Muhammadan Invaders—page 92.)

దీనినిబట్టి క్రీ. శ. 1310 వ సంవత్సరమందును, ఆవల 1312 సంవత్సరారంభమున మాలికాఫరు దక్షిణ దేశమునుండి మరలిపోవు వరకును రుద్రరాజు రాజధానియందే యుండెనని విశద మగుచున్నది. రుద్రరాజే గాక, హొయసల చక్రవర్తియగు వీరబల్లాళుడు సయితము ద్వారసముద్రము నుండి బెంగళూరు వరకు మాలికాఫరుకు త్రోవ చూపవలసి వచ్చెనట. ఈ దండయాత్ర ముగించుకొని మహమ్మదీయ సేనాని వెళ్లిపోయినను, మరల నాత డెప్పుడు రాగలడో యను భయము దాక్షిణాత్య రాజులను కలవర పెట్టుచునే యుండెను. ఇట్టి అయోమయమైన పరిస్థితిలో రుద్రరాజు నిర్భయముగా రాజధానిని వదలి, కడు దూరమున నుండు కాంచీపురమున కేగి, యచట నెలల తరబడి జరిగిన యుద్ధములలో పాల్గొని, తుదకు ఇంకను దక్షిణముగ జంబుకేశ్వరము వరకు వెళ్లి విరామముగా తీర్థయాత్రలు గావించి, ఆదేవాలయములలో శిలాశాసనములు వేయించెననుట విశ్వాసార్హము కాదు.

ప్రతాపరుద్ర చక్రవర్తి మొదటి కాంచీపురము దండయాత్రకు పోనట్లే, అతడు క్రీ. శ. 1316లో జరిగిన రెండవ కాంచీపుర దండయాత్రకు పోలేదని తెలియుచున్నది. ఇందుల కాసమయ మందుండిన దుర్భరమైన రాజకీయ పరిస్థితులే కారణము. ఇంతేకాక దేవగిరిలో ఢిల్లీ సుల్తాను గావించిన భయంకర కృత్యములు, అతని సేనాని కుస్రూఖాను అను నతడు దక్షిణ దేశమునకు రానున్నాడను వార్తలు హిందూరాజులకు భీతిని కల్గించినవి.

ఈ విధముగా, రుద్రరాజు క్రీ. శ. 1294 వ సంవత్సరమునందు తప్ప మరల దక్షిణదేశమున తీర్థయాత్రలకు పోలేదని తెలియుచున్నది. కాని, కాకతీయ సంచికా సంపాదకులు, మొదలగువారు, వేర్వేరు కాలమున జరిగిన విషయము లన్నిటిని జేర్చి, యవి యన్నియు నొక సమయమందే జరిగినట్లుగా భావించి వ్రాసి యున్నారు. రుద్రరాజు శ్రీశైలమునకు బోయి యుండిన విషయము, ఆ పిదప జరిగిన ఎఱ్ఱదాచానాయుని కాంచీపుర దండయాత్ర, ఆవల జరిగిన ముప్పిడినాయకుడు గావించిన కాంచీపుర దండయాత్ర వీటన్నిటిని నొకటిగాజేర్చి, ప్రతాపరుద్రుడు "శ్రీశైల, త్రిపురాంతక, కంచి, జంబుకేశ్వరాది పుణ్యతీర్థముల సేవించి క్రీ. శ. 1318 నాటికి ఓరుగల్లు జేరెను" అని నిశ్చయించి యున్నట్లు తోచుచున్నది.

## క్రీ. శ. 1318 వ ప్రాంతమున రుద్రరాజు తుమకూరు ప్రాంతమున వీరవిహార మొనర్చెనా?

ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1318 వ ప్రాంతమున ప్రకృతపు మైసూరు నందలి కొన్నిభాగములలో వీరవిహార మొనర్చె ననియు, ఆ సమయమందే అతడు శివగంగ క్షేత్రమును దర్శించె ననియు కాకతీయ సంచికలో పేర్కొనబడి యున్నది. కాని, ఇది సరికాదు. రుద్రరాజు తీర్థయాత్ర కోసమే తుమకూరు ప్రాంతము

గుండ ప్రయాణము గావించెననియు, నది క్రీ. శ. 1294 వ సంవత్సరమందే జరిగెననియు నీవరకే నిరూపించి యున్నాను. అనంతపుర తామ్రశాసనమందీ విషయము, "స ఏకదా తీర్థ యాత్రానుటన్ క్షేత్రం కకుద్గిరిం ఆగత్య....."అని ఆ ప్రయాణము యొక్క యుద్దేశము స్పష్టముగా పేర్కొనబడియున్నది. ఆ సమయమందే అతడు శివగంగ క్షేత్రమునకేగి, స్వామిని సేవించి, దాని పరిసరమున అనంతపురమును అగ్రహారముగ గల్పించి నృసింహ దీక్షితునకు దాన మొసగినది. ఆ పిదప మరల నాతడు తుమకూరు ప్రాంతమునకుగాని, మరియే యితర ప్రాంతమునకుగాని తీర్థయాత్రల కొరకు పోలేదు. కావున ప్రతాపరుద్రుడు జంబుకేశ్వరమున తన విజయధ్వజము నాటిన సందర్భమున మైసూరు దేశమందలి తుమకూరు ప్రాంతములలో వీరవిహార మొనర్చెననుట యదార్థముకాదు. క్రీ. శ. 1294 సంవత్సరము తీర్థయాత్రల కేగుటకు సన్నివిధముల ననుకూలముగ నుండెను. అందువలననే ఆతడు తుమకూరు ప్రాంతమున కేగి, యటనుండి దక్షిణముగా ప్రయాణము సాగించి, కాంచీపురము, శ్రీరంగము, మరియు జంబుకేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములకేగి యుండును. ఆయా క్షేత్రమందు గల దేవతలను సేవించి, దానధర్మములు గావించి, జంబుకేశ్వరములో శిలా శాసనము వేయించి యుండును. ఇట్లు జరిగి యుండుటయే సమంజసమైనదిగా గనబడుచున్నది.

ఈలాటి యాత్రలలో తీర్థక్షేత్రములను దర్శించుటయే ప్రధానోద్దేశమైనను, దానికి తోడుగ రాజకీయోద్దేశములు గూడ నుండునని చరిత్రకారు లూహించియున్నారు.

ప్రాచీనకాలపు చక్రవర్తు లీలాంటి యాత్రల వ్యాజమున, తమ రాజ్యము నంతటిని చూచుటయు, శత్రురాజులకు తమ బలపరాక్రమములు గోచరించునట్లు చేయుటయు, తమరాజ్యములోని వివిధ భాగములందలి ప్రజలను గలసి, వారి కష్టసుఖములు గ్రహించుటయు, తమ ప్రాభవప్రతాపములను ప్రజలు గ్రహించునటుల జేయుటయు జరుగుచుండెనని దెలియుచున్నది. విజయనగర సామ్రాజ్యమును పాలించిన మహాచక్రవర్తియగు కృష్ణదేవరాయ లీలాటి తీర్థయాత్రనొకసారిగావించెనని తెలియుచున్నది. ఈ విషయమును రాయవాచకము, మరియు కృష్ణరాయవిజయము గూడ పేర్కొని యున్నవి. ఈ యాత్రలందలి ఉద్దేశములను గురించి, మైసూరు గజెటియరుకారు డీ విధముగా వ్రాసియున్నాడు.

"If the Rayavachakamu and the Krishna Raya Vijayamu are to be believed, Krishna Deva Raya's grand tour through his dominions should have been in the nature of a great triumphal march through it, to commemorate as much his Victories over his enemies as to come into direct contact with the people of the vast area he governed and incidentally to visit the sacred places and rivers and temples that lay in them...." [Vide. page 1881.]

కాకతీయ సంచికాకర్త సయితము ప్రతాపరుద్రుడు గావించిన తీర్థయాత్ర స్వభావమును గురించి వ్రాయుచు, నాతడు తనకాలమున సామ్రాజ్యము నంతటిని నొకసారి పరిశీలించి పలుచోట్ల కట్టుదిట్టములు జేసెనని చెప్పియున్నాడు.

తుమకూరు యాత్రలో మరొక విశేషము గలదు. ప్రతాపరుద్రుడీ యాత్రలో తన రాజ్యము యొక్క మధ్యభాగము గుండా గాక, తన రాజ్యపు పడమటి, మరియు దక్షిణపు గడి ప్రాంతముల గుండా పోయియున్నట్లు తెలియుచున్నది. తుమకూరు ప్రాంతము కాకతీయ రాజ్యమునకును, హొయసల రాజ్యమునకును మధ్య నుండిన యొక సరిహద్దు ప్రాంతము. అలాటి ప్రాంతములో నుండిన యొక గ్రామమును అగ్రహారముగ జేసి, తన యొద్ద నుండిన పండితుడైన బ్రాహ్మణుని కొకనికి ఇచ్చెననుటను బట్టి, ఆ సమయమున తుమకూరు ప్రాంతము కాకతీయుల వశమందుండి వారి సామ్రాజ్యములో జేరియుండెనని స్పష్టమగుచున్నది. అట్లుకాక, ఆ ప్రాంతము హొయసలుల వశమందుండిన పక్షమున, శత్రువుల రాజ్యములోని యొక గ్రామమును రుద్రరాజు దానము చేసెననుట సమంజసముగా నుండదు. ఈ తీర్థయాత్రకు బయలుదేరుటకు పూర్వమే రుద్రరాజు మహారాష్ట్రులు, కర్ణాటులు మొదలగు వారిని జయించి యుండెనని అనంతపుర శాసనమందు చెప్పబడియున్నందున, ఆ సమయమున తుమకూరు ప్రాంతము వరకు కాకతీయ సామ్రాజ్యము వ్యాపించి యుండెనని చెప్పవచ్చును.

## దత్తగ్రామము-దానిపేరు

క్రీ. శ. 1294 వ సంవత్సరమున తుమకూరు ప్రాంతమునకు ప్రతాపరుద్రుడు తీర్థయాత్ర గావించుచు పోయి యుండిన సమయమున, శివగంగ క్షేత్రమునకు సమీపమున నొక అగ్రహారమును గల్పించి దానికి "అనంతపురము" అను పేరిడి, పండితుడైన నృసింహదీక్షితునకు దానము గావించెనని అనంతపుర తామ్రశాసనమునుండి తెలియుచున్నది. కాని, రుద్రదేవుడు కల్పించిన యీ యగ్రహారమునకు "అనంతపురము"ను పే రేల పెట్టబడెనో తెలియదు. సాధారణముగ రాజులు, చక్రవర్తులు తాము నిర్మించు గ్రామములకు తమ పేరూ, లేక తమ పూర్వీకుల పేరూ పెట్టుట వాడుకగ నున్నది. ఉదాహరణముగ బేతేశ్వరము, బేతమంగలము, రుద్రవరము, గణపేశ్వరము మొదలగు గ్రామములను బేర్కొనవచ్చును. ఈ గ్రామము లాయా రాజుల పేరిట నేర్పడినవి. కృష్ణదేవరాయల కాలమున నతడు వేయించిన అగ్రహారములకు కృష్ణాపురము, కృష్ణరాయసముద్రము అను పేళ్లు గలవు. ఇట్లే, రెండవ ప్రతాపరుద్ర రాజు తాను నిర్మించి దానము చేసిన గ్రామమునకు తన పేరుంచక "అనంతపురము" పేరేల యుంచెనో తెలియదు. అది అతని తండ్రి పేరుగాని, తల్లి పేరుగాని కాదు. తండ్రి మహాదేవరాజు, తల్లి ముమ్మడాంబ. అది, కాకతీయుల ఇంటి దేవుని పేర్ కూడ కాదు. కావున నది యెవరి పేరో తెలియకున్నది. అయినప్పటికి యొకవిధముగ నూహించుట కవకాశమున్నది. ఇది

యొకవేళ రుద్రరాజు తాత, అనగా మహాదేవరాజు తండ్రిపేరై యుండునేమో! ఈ విషయము నింకను పరిశీలించవలసియున్నది.

## మహాదేవరాజు-వ్యక్తి నిరూపణము

అనంతపుర శాసనము కాకతీయాంధ్రుల చరిత్రకు మహోపకారము చేసినదని వెనుక వ్రాసియున్నాను. ఈ శాసనము నుండియే, రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి తండ్రియగు మహదేవరాజు కాకతీయ వంశమునకు జెందిన వాడను విషయము వెలుగులోనికి వచ్చినది. దీనితో యీ మహాదేవరాజును గురించి సాగుతూ వచ్చుచున్న ఊహాగానములకు స్వస్తి చెప్పవలసియున్నది. కాని,యీ మహాదేవరాజెవ్వడో, ఇతని తలిదండ్రులెవ్వరో తెలియదు.

ఇంతవరకు మనకు దెలిసిన విషయముల నుండి, కాకతీయ రాజులలో నిరువురు మహాదేవరాజులున్నట్లు స్పష్టమైనది. వీరిలోనొకడు మొదటి ప్రతాపరుద్ర దేవుని తమ్ముడును, గణపతి దేవ చక్రవర్తి తండ్రియునగు మహాదేవరాజు. రెండవవాడు రెండవప్రతాపరుద్ర చక్రవర్తి తండ్రి. ఈ యిరువురు మహాదేవరాజులలో మొదటి వాని తండ్రి రెండవ ప్రోలరాజు. ఇక రెండవ యాతని తండ్రి పేరెమో? కాకతీయ రాజుల చరిత్రము నుండి, రెండవ ప్రోలరాజునకు ఐదుగురు కుమారులుండిరని తెలియుచున్నది. వీరిలో మొదటి కొడుకు రుద్రదేవ మహారాజు. రెండవవాడు మహాదేవరాజు. ఇక తక్కిన ముప్పురు పుత్రుల పేర్లేవియో తెలియవు. వారి చరిత్రలు కూడ తెలియవు. అందు వలన రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి తండ్రియగు మహాదేవ రాజు, పేళ్లు తెలియని పై ముప్పురిలోనొకని కుమారుడై యుండ వచ్చును. అందువలననే మహాదేవరాజు కాకతీయాన్వయుడగు టయు, నతని కుమారుడు రుద్రమదేవికి దత్తత స్వీకారమున కర్హుడగుటయు తటస్థించినది.

కాకతీయాంధ్రరాజుల చరిత్రమునందింకను పెక్కు విషయము లజ్ఞాతముగ నున్నవి. వారి సామ్రాజ్యము చాల విశాల ముగ నుండినది. దాని సరిహద్దులు, ముఖ్యముగా పడమటను, తూర్పు దిక్కునందును చాల విస్తృతి గాంచియుండినవి. కావున ఆంధ్ర చరిత్ర పరిశోధకు లిటు మైసూరు రాష్ట్రమునందును అటు మదరాసు ప్రాంతమునందును కాకతీయుల చరిత్రకు సంబంధించిన విషయములను పరిశోధించవలసి యున్నది.

కాకతీయ సామ్రాజ్యపు పడమటి మరియు దక్షిణపు గడి ప్రాంతములను గురించియు, ఈ సరిహద్దుల విషయమున కాకతీయులకును, హొయసలులకును, మరియు కాకతీయుల కును చోళులు, పాండ్యులు మొదలగువారికి జరిగిన కలహములను గురించి నేను సేకరించియుండు విషయములను మరియొక ప్రత్యేకమైన వ్యాసమున తెలియజేసెదను.

---



# కల

శ్రీ కస్తూరి లక్ష్మీనారాయణ

తొలికోడి కూసింది. ప్రక్కతోటలోవున్న సావిడి లోని గిత్తల మెళ్ళలోవున్న మువ్వల చప్పుళ్ళు విన్పిస్తున్నాయి. దుగ్గమ్మ పిల్లవాడి ప్రక్కనుంచి లేచి , తడిక తీసుకుని, గుడిసెలోనుంచి బయటకు వచ్చింది. వెలా తేలా పోతున్న చంద్రుడు ఎదురుగా వున్న నిమ్మచెట్టు చాటుకు దిగిపోతున్నాడు. డొంక మీది చింతగుబురులో నుంచి ఏదోపక్షిలేచి, పెద్దగా అరచి, రెక్కలు ''టపటపా''కొట్టుకుని, మళ్లీ ఆకు ల్లోకి వాలిపోయింది. ప్రక్కనే బోరింగు పంపుదగ్గర నిలవవున్న నీళ్లలోనుంచి యిల కోళ్లు 'కీచు'మని గోలపెడుతున్నాయి.

అప్పుడే నిద్రమేల్కొన్న వీరన్న బద్ధకంగా ఆవులించి లోపలినుంచే కేకేశాడు,''తెల్లారిపోయి నాదంటే దుగ్గమ్మా! లెగిసేదేంటి?'' దుగ్గమ్మ ఒకసారి చుట్టూ చూసి, ''మలికోడి గూడ కూసే యాలయిందన్నా. లెగవక పోతే ఎట్టా? తెల్లారే పాలికి సేరద్దూ!'' అని గుడిసెప్రక్కనేవున్న కుండ తీసుకుని పంపుదగ్గర నీళ్లునింపుకుని తెచ్చి పెట్టింది. పక్కలో వ్వాడి పడిపోయిన తలగుడ్డను చుట్టుకుంటూ బయటకు వచ్చాడు వీరన్న. ''నేనట్టా పోయి పచ్చిపుల్ల తెచ్చుకుంటాగాని, ఈలోపట అయెన్నీ సద్దేసి ముల్లెగట్టు. యెల్లిపోదాం''అంటూ కాలిబాటనే వెళ్లిపోయాడు.

డొంకమీద నాగళ్ళు పోతున్న చప్పుళ్ళు, గిత్తల్ని అదిలిస్తున్న కేకలు వినిపిస్తున్నాయి. పలుచగా కురుస్తున్న మంచుకు నిమ్మచెట్లు కదలకుండా జోగుతున్నాయి. అపుడపుడు తోటలమీదనుంచి వస్తున్న గాలిలో నిమ్మవాసనలు సోకుతున్నాయి. దుగ్గమ్మ ఏదో తల్చుకుని ఒకసారి నిట్టూర్చి గుడిసెలోకి పోయింది.

వీరన్న వచ్చేసరికి గుడ్డలన్నీ సర్ది మూటకట్టింది. అతడు వస్తూనే నోట్లో పుల్లపారేసి, ముఖమూ కాళ్ళూ, చేతులు కడుక్కున్నాడు. పైగుడ్డతో ముఖం తుడుచుకుంటూ, ''సద్దటం అయిపోయినాదంటే అమ్మాయ్! యిగెల్లి పోదాం'' అంటూ లోపలికి వెళ్లాడు. దుగ్గమ్మ పిల్లవాడికి చీర మడతకప్పి భుజాన వేసుకుంది. వీరన్న పరిచివున్న చాపను చుట్టి చెల్లెలిచేతి కిచ్చాడు. తర్వాత సామానువేసి మూతి కట్టిన గోనె, గుడ్డల మూట బయటకు తెచ్చాడు. పైగుడ్డ చుట్ట చుట్టుకొని తలమీద పెట్టుకొని రెండు మూటలు పైకెత్తుకున్నాడు. ''ఇగ పదవే అమ్మాయ్. మూడు కోసులు పోవాల, కొంచెం కాలు సాగోపోతే లాబంలేదు.''

దుగ్గమ్మ ముందుకు సాగింది.గుడిసెకు కొంచెం ప్రక్కగా నిలువెత్తు పెరిగి విరగచూస్తున్న గులాబీ పాదునుతిరిగితిరిగిచూస్తూ ముందునడుస్తున్న చెల్లెలిని చూసి గొణుక్కున్నాడు. ''రెండు సమచ్చరాల బందం యియ్యాల్టితో పూర్తిగా తెగిపోనాది. ఏనాటికి యాడో......?'' తోట గట్టుమీది కాలిబాటనే నడిచి డొంక ఎక్కారు.దుగ్గమ్మ వీరన్నకు కొంచెం వెనకగా నడుస్తూ నిలబడి, తిరిగి తోటలోకిచూసింది. తూర్పున విరిసే వెలుగుకు పాలిపోతున్న వెన్నెలలో దుగ్గమ్మకు గడచిన రెండుసంవత్సరాలు నీడయిచ్చిన

గుడిసె, నిమ్మచెట్లు నల్లగా దయ్యాల్లా కన్పిస్తున్నాయి. ఆమె కళ్ళు నీళ్లతో నిండాయి. "ఇంత బతుకు కలలాగ మాయఁవయిపోనాదేటి?" అను కుంటే గుండెల్లో చిక్కబట్టినట్లనిపించింది.

ముందు నడుస్తున్న వీరన్న ఆగి వెనుకకు తిరిగాడు. "యింకా అట్టా ఎంతసేపు సూసుకున్నా బాదే కదమ్మాయ్. బాదపడి సేసేదేఁవుంటాది? దిగమింగుకుని పోతావుండాల." చెంగుతో కళ్లు తుడుచుకుని వెంబడించింది దుగ్గమ్మ. కొంతదూరం పోయేసరికి తలమీద తుండుగుడ్డ కప్పుకుని ఎవరో వ్యక్తి ఎదురు వచ్చాడు. వీళ్ళనుచూసి కొంచెంఆగి, "ఎవరది! దుగ్గమ్మా........"అన్నాడు. "నేనే తాతా......."అంది దుగ్గమ్మ.

"అన్నతో యెల్లిపోతుతన్నావన్నమాట.కానీ!....సేసేదేఁవుంది?"అని యింకా ఏమిటేమిటో గొణుక్కుంటూ వెళ్ళాడు. ఊరుదాటే సరికి కొద్దికొద్దిగా తెల్ల వారుతోంది. చింతలచెరువు దగ్గరకు వస్తోంది. చెరువుచుట్టూ వున్న చింతగుబుర్లమీద నిద్ర లేచిన పక్షులు కోలాహలంగా అరుస్తున్నాయి.అక్కడ వున్నతాడిచెట్లు యిదేమీ పట్టనట్లు ఠీవిగా ఆకాశం లోకి చూస్తున్నాయి. చెరువుగట్టుమీది గంగరావి చెట్టు పండుటాకులన్నీ రాల్చేసి మోండిగా నిల్చునుంది. రాలిపోయిన ఆకులు ఎండి,ఈదురుగాలికి గలగల లాడుతూ కొట్టుకు పోతున్నాయి.

* * *

ఆచెట్టునుచూస్తూ ముందుకు నడిచింది దుగ్గమ్మ. కొట్టుకుపోతున్న ఆకులను చూస్తుంటే తనను నారయ్య కాపరానికి తీసుకొచ్చుకుంటున్న రోజు గుర్తుకు వచ్చింది.

ఆరోజు పట్నంనుంచి నడిచి నడిచి అక్కడికి వచ్చేసరికి, నారయ్య అన్నాడు," ఈసెరువూ,తోపూ సూశావంటే పిల్లా! మీపట్నంలో యాడయినా ఒక్కుంటుందా యిట్టాంటిది. యీడనే బువ్వ తిని వూళ్ళోకి పోదాం" అంటూ గట్టెక్కి కర్రకు తగిలించిన అన్నంమూటసంచి గంగరావిచెట్టుక్రింద పెట్టాడు. తరువాత యిద్దరూ చెరువులో కాళ్ళూ చేతులు కడుక్కుని అన్నానికి కూర్చున్నారు. తను ప్రక్కనే రాలిపడివున్న రెండుగంగరావి పూలుఏరి "యియ్యి తల్లో పెట్టుకోనా" అంటే, "అయ్యేందుకే నీకు. తోటలో గులాబంటు పెంచుతున్నాను గెందా, నువ్వొచ్చేయాలకి పుయ్యాలని" అని నవ్వి అన్నంమూట తనముందుకు నెట్టి సంచిలోనుండి రెండు పొట్లాలు తీశాడు. తనుమూటవిప్పి రెండాకుల్లోను అన్నంపెట్టి ఒకటి అతని ముందు వుంచింది. నారయ్య ఒకపొట్లంలో నుంచి జిలేబి తీసి తన అన్నంమీద పెడుతూ , "యియ్యాల ఇద్దరం కలిసి వనలచ్చిమికాడ బువ్వ తింటున్నాం. బతుకంతా యిట్టాగే తియ్యగా యెల్లిపోవాలని కోరుకో" అన్నాడు. దుగ్గమ్మ అతన్ని చూసి చిరునవ్వు నవ్వి, "మరి ఆ మెరపకాయ బజ్జీల్లాగా కారం పుడితే ఎట్టమాఁవా?"అని అడిగింది.

"అదేందే ఎర్రిమొగమా. అపుడపుడట్టా కారం తగలోపోతే తీపికి రుచేడి నుంచొస్తదే?"

"అపుడపుడేకాదు. బతుకంతా కారమే సేసి పోయిండు" అనుకుంది దుగ్గమ్మ.

తరువాత అన్నంతిని చెరువులో నీళ్లు త్రాగి వూళ్ళోకి నడిచారు. మొదట్లోనే యిద్దరుముగ్గురు మనుష్యులు ఎదురై సరదాగా నవ్వుతూ పలకరించారు. ఊడల మర్రి దగ్గరకు వెళ్లేసరికి ఎవరో ఇరవై ఏళ్ల యువకుడు, గ్లాస్కో పంచ, లాల్చీ వేసుకుని, చేతిలో ఏదో పత్రిక పట్టుకుని వీళ్ల వైపు చూసి నవ్వుతూ నిలుచుని వున్నాడు. దగ్గరకు వెళ్లగానే, "ఏరా నారయ్యా!తెల్లవారక ముందే జంటగా వూళ్ళోకి వచ్చి పడ్డావ్.బస్తీలో పూపిరాడ లే దేంటి? సరేగాని... ముందు మనింటికి పోయి తర్వాతే నీ యింటికి వెళ్లు. నే నట్లా తోటకుపోయి వస్తా" అని దుగ్గమ్మను చూసి ఒక నవ్వు విసిరేసి వెళ్లిపోయాడు. అతడు

వెళ్లిపోయింతర్వాత నారయ్యా తన వైపు తిరిగి, "ఎవరో తెలుసా" అని గర్వంగా అడిగాడు.

దుగ్గమ్మ నవ్వుతూ, "నా కెట్టా తెలుస్తది?" అంది.

"అవును. నీకెట్టా తెలుస్తది? మా సిన్నయ్యా డాకటేరుకి సదువు తున్నాడు. ఇంకా రెండు మూడే ళ్లకి అయిపోద్దంట. ఈ వూరు మొత్తంమీద అట్టాంటి కుర్రాణ్ణి సూపు. సదువులో వస్తు. సెలవుమీన ఇంటికొస్తే, ఒక్కగంట యింటో వుండడు. తోటలోనో, సావిడి దగ్గరో, పొలాల్లో దిబ్బల మీనో, ఎక్కడో అక్కడ పని సూసుకుంటా వుండాల్సిందే. ఒక్కడైతే మాత్తరంవేం? పెద్ద య్యకి దిగుల్లేని కొడుకు.....అదిగో. ఎల్లేసిన సివ్మాల పెహరీ డాబ...అదే మన కామందుది. బూషయ్య గారంటే గొప్ప ఆస్తి లేకపోయినా, సుట్టుపక్కల పేరు మోసిన రైతులే."

గేటు తలుపు తీసుకుని లోపలికి పోయేసరికి డాబా ముందు బటానీ పూల పందిరి కన్పించింది. పందిరంతా పూలు గుత్తులు గుత్తులుగా విరిసిపోయి వున్నాయి. వాటిని చూస్తూ వరండాలోకి నడిచింది దుగ్గమ్మ. లోపలి నుంచి పెద్దమ్మ, సుగుణమ్మ వచ్చారు తామిద్దరినీ చూసి.

పెద్దమ్మ నారయ్యను చూసి నవ్వుతూ, "ఏరా నారయ్యా. నీకంటే నీ పెళ్లామే అందంగా వుంది కదరా, ఎలా చేసుకుంది నిన్ను?" అని అడిగింది. ఆ మాటలకు సుగుణమ్మ పకపకా నవ్వుతుంటే తను సిగ్గుతో ముడుచుకుపోయింది. దానికి నారయ్య కూడ నవ్వి, "నాలాటి వోడే దొరక్క శానరోజుల నించి ఎదురు సూత్తందంటమ్మా. దారి పొడుగునా ఆ సంగతే సెప్పింది" అన్నాడు తనను కోరగా చూస్తూ.

ఈ నవ్వుల్లో భూషయ్య లోపలినుండి వుత్తరీయం కప్పుకుంటూ వచ్చాడు. "ఏరోయ్! పక్కనే పెళ్లాన్ని చూడగానే నీకూ సరసాలు వస్తు

న్నాయే'' అని గుబురు మీసాల చాటున ముసిముసిగా నవ్వుకుంటూ బయటకు వెళ్లిపోయాడు.

పెద్దమ్మ, ''వాడికేం నిక్షేపం లాటివాడు. వాడు దొరకటం దాని అదృష్టం....ఇంతకూ నీ పేరే మిటి? చెప్పావుకావు.....'' అడిగింది.

''దుగ్గమ్మ''

'''నారయ్యా, దుగ్గమ్మ' బాగుంది.. సుగుణా, లోపలికి పోయి అవి తీసుకురా'' అంది పెద్దమ్మ.

సుగుణ ఒక పెద్ద పళ్లెంలో చీర, రవిక గుడ్డ, పసుపు కుంకుమ పొట్లాలు, తాంబూలం పెట్టి తీసుకువచ్చింది. తనను బొట్టు పెట్టుకోమని, అవన్నీ తనచేతి కందిస్తూ, పెద్దమ్మ నవ్వుతూ అంది. ''నారయ్యను జాగ్రత్తగా చూసుకో దుగ్గమ్మా, వాడింతవరకు పసివాడిలా పెరిగాడు ఈ యింట్లో. నీకేం కావలసి వచ్చినా అడిగి తీసుకు వెడుతూవుండు. మొహమాట పడకు. సరే...యింటికి వెళ్లండిరా నారయ్యా...అన్నీ వున్నాయిగా.''

నారయ్యా వెనకకు తిరిగి నడుస్తూ, ''అదు రుట్టం అంటే నీదే! యిపుడొచ్చి సంచీడు సరుకు అమ్మగారికాడ కొట్టేసినావు.'' అంటుంటే వెనక వాళ్లిద్దరూ నవ్వుతున్నారు. తనేమీ సిగ్గుతో మాట్లాడలేక గబగబ అడుగు వేసింది.

* * *

తెలతెల వారుతోంది.

భుజాన పడుకున్న పిల్లవాడు మెసలి సన్నగా ఏడుస్తున్నాడు. వాణ్ణి భుజం మార్చి పడుకోబెట్టు కుని ''జో'' కొడుతూ, ''పిల్లల తల్లి, పెద్ద ముత్త యిదువు, పెద్దమ్మ నిండు గుండెతో దీయించి యిచ్చిన పసుపు, కుంకుమ ఏటికి మట్టిలో కలిసిపోనాయి?'' అనుకుంది. ముందు నడుస్తున్న వీరన్న, ''ఈడే తెల్లారి పోనాది. ఇంకా కోసున్నరప్పై మాటే పోవాల. కొంచెం సురుగ్గా నడు దుగ్గమ్మా'' అన్నాడు.

* * *

తర్వాత రెండుమూడు నెలలు ఎలా గడిచాయో తన కసలు గుర్తేలేదు. మెట్టుసాలాలమీది పసుపు మొక్కల్లో, నడుమెత్తున లేచిన చెరుకు తోటల్లో, దిబ్బల మీది కూరగాయల పందిళ్ల క్రింద, తోటల మీది నిమ్మవాసనల్లో, రోజులన్నీ పచ్చని అలలలో కరిగిపోయాయి. ఈ కొద్దిరోజులలోను నారయ్యతో గొడ్ల దగ్గర పనులు చూడటం, పాలు పితకటం, నిమ్మ తోటనుంచి పచ్చిగడ్డి కోసుకురావటం లాటి వన్నీ అలవాటు చేసుకుంది.

ఒకసారి ఎప్పుడో, ఆ రోజులలోనే నారయ్యతో కలిసి తనుకూడ గడ్డి కోస్తోంది. వున్నట్టుండి ఎక్కడి నుంచో, మామిడల్లం, మొగలి పూలవాసన గుప్పుమన్నాయి. ఆ వాసన లెక్కడినుంచి వస్తు న్నాయో దుగ్గమ్మ కర్థంకాలేదు. నారయ్యా నడి గింది. ''యాడ నుంచి మావా, ఆ వాసనలు? ఈ డేడా అల్లము, మొగిలీ లేవుగా?'' అతను కొడవలితో తోటమూల ఎత్తుగా వున్న పుట్టవైపు చూపుతూ, ''అదుగో, ఆడనుంచి..'' అన్నాడు. అప్పటికి తన కర్థంకాలేదు, ''ఏ వుందాడ? పుట్టేగెందా?''

''ఆఁ. పుట్టే. ఏవుందనుకున్నావు లోన? దేవతాపాముంది. అదెప్పుడు కదిలినా యిట్టా వాస నలు రావాల్సిందే. ఒక పట్టాన మడుసుల కళ్లబడదు. నాకు మాత్తరం యిన్ని సమచ్చరాలకి ఒకే ఒకసారి అగుపడినాది. పెద్దయ్య మాత్తరం శాన సార్లు సూసి నాడంట.'' తనకు ఆశ్చర్యంతోను, భయంతోను నోట మాట రాలేదు.

''మరి రాత్తిరింబవళ్లు యీడనే తిరుగుతుంటారు! మీకు బయ మేయదా మావా?''

''బయ మెందుకే ఎర్రిమొగమా. పండిపోయిన నాగుబాము మడిసిమొగం సూస్తదా, మడిసికి దాని మీద కర్రెత్తే దైర్యముంటదా? కళ్లబడితే రెండు చేతులెత్తి దణ్ణం పెట్టేయటమే. దాని దారిన అదే బోద్ది. ఇంకా బయ మెందు కుంటది!''

'బిక్కుబిక్కు' మనుకుంటూ ఈ తోటలో వుండేది. రాత్రిళ్లు బయమెయ్యదూ?'' నారయ్య తేలికగా నవ్వేసి, ''మాట మాటకీ బయ మంటావ్, మన మొక్కాళ్ళమేనంటే ఈ డుండేది? సుట్టూ తోటల్లో మాత్తరం కాపలావోళ్ళు లేరూ గుడిసె లేసుకుని? ఇంక పైగా పిల్లాజల్లాతో వుండారు. తెలిసిందా?''

దుగ్గమ్మ అప్పుడలా అందేకాని తర్వాత తనకే హాయనిపించింది. తాగి,రాత్రి తెల్లవార్లూ తందనా లాడే సోమయ్య, అయిన దానికి, కానిదానికి కొట్లాడు కునే వాడి సవతులు, రోజంతా ఆకలంటూ ఏడ్చే వెనకింటి నరసమ్మ పిల్లలు, పల్లెలో లాగ యిక్క డెవరూ లేరు. ఆ మరునాడంతా తనకు, నారయ్యకు తోటంతా నీళ్లు పెట్టడమే సరిపోయింది. మధ్యా హ్నమే పచ్చగడ్డి కూడ కోసి సావిడి దగ్గర పడేసి వచ్చాడు నారయ్య. అతడొచ్చే సరికి దుగ్గమ్మ స్నానం చేసి, బయట చాప వేసుకు కూర్చుని జడవేసు కుంటోంది. నారయ్య వచ్చి, ''హమ్మయ్య'' అంటూ ప్రక్కనే చాప మీద పడుకున్నాడు.

ఎదురు డొంకమీది చింతచెట్టు తొర్రలో నుంచి రెండు రామచిలుక పిల్లలు బయటికి వచ్చి నుంచున్నాయి. ''కిర్ కిర్'' మని అరుస్తుంటే అతను తలెత్తి చూశాడు. తల్లి చిలుక ఏదో తెచ్చి, ముక్కుతో పిల్లల నోట్లో పెడుతోంది. దాని జంట చిలక పై కొమ్మమీద నుంచుని చూస్తోంది. పిల్లలు రెండు రెక్కలు టపటపా కొట్టుకుంటూ అరుస్తున్నాయి.

నారయ్య అన్నాడు, ''దుగ్గమ్మా, రామసిలక పిల్లల్ని నీ జనమలో ఏనాడన్నా సూసినావంటే?అదుగో కావాలెసంటే అటు చూడు. సింతసెట్టు తొర్ర మీన....''

దుగ్గమ్మ అటువైపు చూసింది. పట్టు లాంటి లేత పచ్చరంగులో, కెంపుల వలె ఎర్రని ముక్కు లతో, తల్లి దగ్గర,''కిచకిచ'' మంటున్న ఆ పిల్లల్ని చూస్తుంటే, తన మనసులో ఏదో భావం మెదిలి, పెదవుల మీద చిరునవ్వయింది. అలాగే చిరునవ్వుతో గమనిస్తున్న దుగ్గమ్మను చూసి, ''అంతసేపు సూడ మాకే. దిష్టి తగులుద్ది పిల్లలికి.'' అన్నాడు నారయ్య.

దుగ్గమ్మకేమి సమాధానం చెప్పాలో తోచ లేదు. అలాగే నవ్వుతూ అతని వైపు చూసి, ''దిష్టి కాదు మావా....'' అనిపూర్తిచేయలేక, తలప్రక్కకు తిప్పుకుని చిలిపిగా నవ్వింది.

అతడు ఒక్కక్షణం తెల్లబోయాడు. తరు వాత ఏదో తట్టినట్లు ఒక్కసారి లేచి కూర్చుని, ఆమెకు దగ్గరగా జరిగి, ముఖం అతని వైపుకు త్రిప్పు కుంటూ, ''నిజంగానంటే దుగ్గమ్మా? నిజం....?'' అని అడుగుతుంటే తనకింకా సిగ్గు వేసింది. అలాగే నవ్వుతూ తలవూపి లేచిపోబోతుంటే, చేయి పట్టుకుని ఆపి మళ్లీ కూర్చోబెట్టాడు. ఆమె తలొంచుకుని కూర్చోసుంటే, గులాబి పువ్వొకటి తుంచుకువచ్చి తలలో, పెడుతూ, ''ఈ పువ్వులాటిపిల్ల కావాలమ్మాయ్ నాకు. మనసులోపెట్టుకునుండు జాగత్తగా.....'' అన్నాడు.

కొంచెంసేపు దుగ్గమ్మ నలాగే చూసి, ''నా అనేది నాకు సేరే నాటికి ఎవురూ లేకుండానే పోయే. అమ్మా, అయ్యా, ఏనాడో న న్నొక్కణ్ణే లోకంలో ఒగ్గేసి పోయారు. మంచీ, సెడ్డ సెప్పేవాళ్లు గూడ లేరు. నేనేం జేసేది దుగ్గమ్మా? ఏం కావాలునుంది నీకు?''

అతని కళ్లలో పలుచని నీటిపొర తిరిగింది. దానిని చూసి చలించిపోయింది దుగ్గమ్మ. అతని దగ్గరకు జరిగి, ''ఎందుకంత బాద పడతావు? ఇప్పు డేటి తక్కువైనాది మనకి.నువ్విట్టనేవుంటే యింకేటి కావాల నాకు? లేనిపోని దిగుళ్లన్నీ మనసులో పెట్టుకోమాకు'' అంటూ ఓదార్చింది.

బుుతుచక్రం తిరుగుతోంది. గుబుళ్లు చేసిన వరిచేలు యీని, కుంకులు పాలు పోసుకుని నెమ్మ

'బిక్కు బిక్కు' మనుకుంటూ ఈ తోటలో వుండేది. రాత్తిళ్ళు బయమెయ్యదూ?'' నారయ్య తేలికగా నవ్వేసి, ''మాట మాటకీ బయ మంటావ్, మన మొక్కళ్ళమేనంటే ఈ దుండేది? సుట్టూ తోటల్లో మాత్తరం కాపలావోళ్ళు లేరూ గుడిసె లేసుకుని? ఇంక పైగా పిల్లాజల్లాతో వుండారు. తెలిసిందా?''

దుగ్గమ్మ అప్పుడలా అందేకాని తర్వాత తనకే హాయనిపించింది. త్రాగి,రాత్రి తెల్లవార్లూ తందనా లాడే సోమయ్య, అయిన దానికి, కానిదానికి కొట్లాడు కునే వాడి సవతులు, రోజంతా ఆకలంటూ ఏడ్చే వెనకింటి నరసమ్మ పిల్లలు, పత్రెలో లాగ యిక్క ఊపిరూ లేదు. ఆ పొద్దుటంతా తనకు, నారయ్యకు తోటంతా నీళ్ళు పెట్టడమే సరిపోయింది. మధ్యాహ్నమే పచ్చగడ్డి కూడ కోసి సావిడి దగ్గర పడేసి వచ్చాడు నారయ్య. అతడొచ్చే సరికి దుగ్గమ్మ స్నానం చేసి, బయట చాప వేసుకు కూర్చుని జడవేసు కుంటోంది. నారయ్య వచ్చి, ''హమ్మయ్య'' అంటూ ప్రక్కనే చాప మీద పడుకున్నాడు.

ఎదురు డొంకమీది చింతచెట్టు తొర్రలో నుంచి రెండు రామచిలుక పిల్లలు బయటికి వచ్చి నుంచున్నాయి. ''కిర్ కిర్'' మని అరుస్తుంటే అతను తలెత్తి చూశాడు. తల్లి చిలుక ఏదో తెచ్చి, ముక్కుతో పిల్లల నోట్లో పెడుతోంది. దాని జంట చిలక పైకొమ్మమీద నుంచుని చూస్తోంది. పిల్లలు రెండు రెక్కలు టపటపా కొట్టుకుంటూ అరుస్తున్నాయి.

నారయ్య అన్నాడు, ''దుగ్గమ్మా, రామసిలక పిల్లల్ని నీ జనమలో ఏనాడన్నా సూసినావంటే?అదుగో కావాలెసింటే అటు చూడు. సింతసెట్టు తొర్ర మీన....''

దుగ్గమ్మ అటువైపు చూసింది. పట్టు లాంటి లేత పచ్చరంగులో, కెంపుల వలె ఎర్రని ముక్కు లతో, తల్లి దగ్గర,''కిచకిచ'' మంటున్న ఆ పిల్లల్ని చూస్తుంటే, తన మనసులో ఏదో భావం మెదిలి, పెదవుల మీద చిరునవ్వయింది. అలాగే చిరునవ్వుతో గమనిస్తున్న దుగ్గమ్మను చూసి, ''అంతసేపు సూడ మాకే. దిస్టి తగులుద్ది పిల్లలికి.'' అన్నాడు నారయ్య.

దుగ్గమ్మకేమి సమాధానం చెప్పాలో తోచ లేదు. అలాగే నవ్వుతూ అతని వైపు చూసి, ''దిష్టి కాదు మావా....'' అనిపూర్తిచేయలేక, తల ప్రక్కకు తిప్పుకుని చిలిపిగా నవ్వింది.

అతడు ఒక్కక్షణం తెల్లబోయాడు. తరు వాత ఏదో తట్టినట్లు ఒక్కసారి లేచి కూర్చుని, ఆమెకు దగ్గరగా జరిగి, ముఖం అతని వైపుకు త్రిప్పు కుంటూ, ''నిజంగానంటే దుగ్గమ్మా? నిజం....?'' అని అడుగుతుంటే తనకింకా సిగ్గు వేసింది. అలాగే నవ్వుతూ తలవూపి లేచిపోబోతుంటే, చేయి పట్టుకుని ఆపి మళ్ళీ కూర్చోబెట్టాడు. ఆమె తలొంచుకుని కూర్చోనుంటే, గులాబి పువ్వొకటి తుంచుకువచ్చి తలలో పెడుతూ, ''ఈ పువ్వులాటిపిల్ల కావాలమ్మాయ్ నాకు. మనసులోపెట్టుకునుండు జాగత్తగా.....'' అన్నాడు.

కొంచెంసేపు దుగ్గమ్మ నలాగే చూసి, ''నా అనేది నాకు సేరే నాటికి ఎవురూ లేకుండానే పోయే. అమ్మా, అయ్యా, ఏనాడో న న్నొక్కదాన్నే లోకంలో ఒగ్గేసి పోయారు. మంచీ, సెడ్డ సెప్పేవాళ్ళు గూడ లేరు. నేనేం జేసేది దుగ్గమ్మా? ఏం కావాలునుంది నీకు?''

అతని కళ్ళలో పలుచని నీటిపొర తిరిగింది. దానిని చూసి చలించిపోయింది దుగ్గమ్మ. అతని దగ్గరకు జరిగి, ''ఎందుకంత బాద పడతావు? ఇప్పు డేటి తక్కువైనాది మనకి.నువ్విట్టనేవుంటే యింకేటి కావాల నాకు? లేనిపోని దిగుళ్ళన్నీ మనసులో పెట్టుకోమాకు'' అంటూ ఓదార్చింది.

ఋతుచక్రం తిరుగుతోంది. గుబుళ్ళు చేసిన వరిచేలు యీని, కుంకులు పాలు పోసుకుని నెమ్మ

దిగా పండిపోతున్నాయి. ఆరోజు వుదయం దుగ్గమ్మ బియ్యం చెరుగుతూ కూర్చునుంది. నారయ్య నిమ్మ చెట్టు నీడలో చాప వేసుకుని, నిమ్మ పిందెలు చూస్తూ పడుకున్నాడు. తనకప్పుడే పనిపాటల్లో కొద్దికొద్దిగా ఆయాసం వస్తోంది. ఏదో ఆలోచిస్తూ వడ్లగింజలు ఏరుతుంటే కళ్లముందు నీడ కన్పించింది. ఎవరోనని తలెత్తి చూసేసరికి, పిల్లవాణ్ణెత్తుకుని మల్లి నవ్వుతూ నుంచునుంది. వెనక వీరన్న సంచిపట్టుకుని వస్తున్నాడు. తనకు ఆశ్చర్యంతో, ఆనందంతో మనసు గంతులు వేసింది. లేచి వదినను కావిలించుకుని, "ఎట్టొచ్చినా వొదినా? దారి తప్పలేదుగెందా? ఈ నాటికి నన్ను సూడొచ్చి నావు!" అంటుంటే, ఎందుకో తనకే తెలియకుండా కళ్లలో నీళ్లు తిరిగాయి. వదిన చేతుల్లోంచి పిల్లవాణ్ణి తను తీసుకుంటూ వుంటే, మల్లి అడిగింది, "ఒంటో ఎట్టుంది దుగ్గమ్మా? తేలిగ్గనే వుంటాదిలే, భారమైన పనేముంటాది గనుక. మేం వొస్తమని నారయ్యన్న సెప్పలేదా? సూడంగనే అంత ఎగిరి పడితివి?" దుగ్గమ్మ నారయ్య వైపు చూసింది. వీరన్న అతని ప్రక్కనే కూర్చుని నవ్వుతూ ఏదో చెప్తున్నాడు. నారయ్య ఆమె వైపొకసారి చూసి కనుబొమ్మ లెగరవేసి మళ్లీ అటువైపు తిరిగాడు.

"మొన్న ఉలవలకి పట్నంబోయి చే సొచ్చిన పని యిదన్నమాట. మరి 'మా అన్నకాడికి పోయొస్తివా మావా' అంటే, 'యాడ తీరనేలే' దన్నడు. నంగనాసిలాగ ఎలా దాసినాడో సూడు" అని దుగ్గమ్మ అంటూ వుంటే, మల్లి ముచ్చటపడింది.

ఆ రోజు సాయంత్రం వీరన్న, నారయ్యతో చెరుకు తోటలు చూడటానికి వెళ్లాడు. సాయంకాలపు నీరెండలో తామిద్దరూ కూర్చుని వున్నారు. మల్లి లోపలికి వెళ్లి తాను తెచ్చిన సంచీ తెచ్చి దానిలోనుంచి కుంకం తీసి తనకు బొట్టుపెట్టింది. తరువాత చీర, రవిక గుడ్డ, అరటిపళ్లు, మిఠాయిపొట్లాలు తన ఒళ్లోపెట్టి, తన బుగ్గలు స్పృశించి, "నెలలు తిరిగే సరికి పండంటి పిల్లని కనోపోతే నే నూరుకుండేదిలేదు దుగ్గమ్మా. మళ్లీ నేసెప్పలేదనుకునేవ్' అంటూ అరటి పండొకటి ఒలిచి తన చేతిలో పెట్టింది.

మల్లి చూపే ఆదరణకు, ఆప్యాయతకు దుగ్గమ్మ మనసు నిండిపోయింది. మల్లి చేతులు పట్టుకుని, "యిపుడింత కర్చు ఏటికి పెట్టినా వొదినా? అన్నతో నీ వొచ్చి, నా ముకాన బొట్టుపెట్టి పోతే సాలదా, ఏటికి తెచ్చినా వియన్నీ?" అంది.

"ఏటికి తెచ్చేదేందే పిచ్చిపిల్లా! అమ్మేపు, అబ్బేపు ఎవరూలేని నాలాటి దౌర్భాగ్యాలకి, అచ్చటా ముచ్చటా జరిగేదెటూలేదు. నీకేం తక్కువైనాది? ముసిలో, 'ముతకో అమ్మ, ఇద్దరన్నలు, వొదిన్ను నేను వుండంగా నీకెందుకు జర క్కుండాపోవాలి? తొలి సూలయినా, మలి సూలయినా, పది రూపాయలు అన్నా వొదినా పెట్టరనుకుంటివా?" అని మల్లి అంటూ వుంటే, దుగ్గమ్మ వదినముందు పసిపిల్లలా అయిపోయింది.

అప్పుడు లేచి పాకతలుపు దగ్గరకు లాగి, తాళం వేసి, నిమ్మతోటగుండ బయలుదేరారు. కూరల పాదులు, పసుపు చేలు, చెరుకుతోటలు, కంకుల బరువుతో వాలుతున్నవరిచేలు వదినకు చూపి తిరిగి వచ్చేసరికి మసకమసగ్గా చీకటి పడుతోంది. మల్లి పిల్లవాణ్ణి మంచంమీద పడుకోబెట్టి, మంచానికి జారగిలబడుతూ, "పచ్చగా సెట్లూ, సేల మద్దెలో పని సూసుకుంటూ, వున్నదేదో తింటూ, బాదా బలగమూ లేకుండ ఈడుంటమే సుక మమ్మాయ్. కిందో మీదో పడి ఒకటిరెండు కుంటలు సంపాదించుకున్నరంటే, యికమీకు దిగుల్లేకుండ జరిగిపోద్ది. మనసులో పెట్టుకో" అని తన అదృష్టాన్ని పొగడుతుంటే కొంచెం గర్వంకూడ కలిగింది దుగ్గమ్మకు.

దుగ్గమ్మ, నారయ్య ఎంత బతిమిలాడినా వినకుండ, మరునాడు చీకటితోనే మల్లి, వీరన్నలు బయలుదేరారు, ముసలి అత్త ఒకతే ఉందని. వెళ్తూ, వెళ్తూ మల్లి చెప్పింది, "నీ కెపుడు బరువుగా వుందను

కుంటే అప్పుడాడ కొచ్చేయి. లేపోతే కబురంపు, మేమొస్తాం. జాగర్తగుండు, బరువు పనులేమీ సేయమాక.''

శివరాత్రి దగ్గరకు వస్తోంది. చలి, మంచు నెమ్మది నెమ్మదిగా వెనక బడుతున్నాయి. వరిచేలన్నీ నూర్పులు గూడ అయిపోయి, పొలాలు బీళ్ళలాగ కన్పిస్తున్నాయి. కళ్లాల్లోని ఎండుగడ్డి తోలుకు వచ్చి, వాములు వేయటంతోనే నారయ్యకు వారం రోజులనుంచి సరిపోయింది. అది పూర్తవుతూనే చెరుకుతోట గానుగ ఆడించి, బెల్లం వండాలని, భూషయ్య తొందరపడ్డాడు. చెరుకు కొట్టి గానుగ దగ్గరకు చేర్పించటంతో నారయ్యకు క్షణంతీరటంలేదు.

ఆరోజు మధ్యాహ్నం నారయ్య అన్నానికి వచ్చినపుడు దుగ్గమ్మ చెప్పింది, ''నాకు కొంచెం అనుమానంగా వుండది మామా. నే నాడకు బోయేకంటె ఈడుంటేనే సుకం గుంటది. నీ స్నీడ పనిలో వొదిలి నే నేడ బోయేది? నువ్వెళ్లి మాపటేలకి వొదిన్నన్ను వెంటబెట్టుకరా. మా అమ్మ లేసి తిరుగుతందో, లేదో, వత్తానంటే తీసుకరా''

నారయ్య నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, భూషయ్యగారికి చెప్పి పట్నం పరుగెత్తాడు.

చీకటి పడేసరికి దుగ్గమ్మ పని ముగించుకుని, దీపం వెలిగించి పాకలో పెట్టి, బయట మంచం వాల్చుకుని వదిన, నారయ్యల కోసం ఎదురు చూస్తూ పడుకుంది.

పంచమిచంద్రుడి వెన్నెల తోటలో నిమ్మల మీద పలుచగా పరుచుకుంది. ఉండి ఉండి సన్నగా గాలి వీస్తోంది. ప్రక్క తోటలోని యానాది హనుమాయి పిల్లలు అన్నాలు తింటున్నారులా వుంది, పెద్దగా ఏడుస్తున్నారు. డొంక చివరి ముసలి రావిచెట్టుమీది కబోది పక్షులు పెద్దగా అరచి, రెక్కలు కొట్టుకుంటూ లేచి, ఆకాశంలో వలయాలుగా తిరిగి మళ్లీ చెట్టు దగ్గరకు చేరుతున్నాయి.

డొంకమీద అడగొంతుక వినిపించగానే లేచి కూర్చుంది దుగ్గమ్మ. నారయ్య, మల్లి తోటలోకి వస్తున్నారు. దగ్గరకు రాగానే మల్లి అడిగింది, ''ఎట్టాగుంది దుగ్గమ్మా. నారయ్యన్న శాన గాబరా పెట్టేసిం డనుకో. ప్రాపిరి సలుపుకోనీలేదు. పిల్లాణ్ణెత్తుకుని అట్టాగొచ్చేసినా.''

''సాయంత్రపేల నుండి తీపు లెక్కువవుతున్నట్టుండాది వొదినా. అన్న రాలేదేం?''

''అన్నచ్చేంజేస్తడు? రేపోమాపో వచ్చి చూసి పోతడులే. అత్తను సూడదద్దా''

నారయ్య లోపటికి పోయి మంచినీళ్ళుతాగి వచ్చాడు. ''నే పోయి మునెమ్మకు సెప్పొస్తానే. ఈ రేత్తిరి కీడనే తొంగోమని సెప్పనా?''

''అట్టాగే రమ్మని సెప్పు'' అంది మల్లి.

తలకు గుడ్డ చుట్టుకుని, కర్ర తీసుకొని పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వూరివైపు వెళ్లిపోయాడు నారయ్య.

* * * *

మల్లి ఆ రోజు ఉదయమే వెళ్లిపోయింది. వీరన్న వచ్చి మేనల్లుడినిచూసి, మల్లిని తీసుకువెళ్లాడు. ఆ సాయంత్రం పిల్లవాడు నిద్రపోతుంటే వూరికే కూర్చునుంది దుగ్గమ్మ. నారయ్య రాగానే,కొడుకును ముఖంలో ముఖంపెట్టి ఒకసారి చూసుకుని, ''ఇయ్యాలకూడ అడిగిందే పెద్దమ్మ.'నీ కొడుకుని తెచ్చిచూపవేరా' అని ; సూగుణమ్మగూడ అంది. మల్లీ యిగ తీరదు గెందా'' అన్నాడు.

''ఏంది! తీరక పోయేదేంది?''

''ఇగ మాకెట్ట తీరుద్దనుకున్నావే? రేపు నికరం జేసుకుని తాంబూలా లిచ్చేసుగోటం, మల్లా వారం తిరిగేసరికి లగ్గం......సుగుణమ్మకు పెళ్లి చేస్తన్నాంగదా!'' అంటూ ఎదురుగా కూర్చున్నాడు. దుగ్గమ్మ విప్పారిన మొహంతో అతన్ని చూస్తూ ఉండి పోయింది.

"సుగుణమ్మకి సమందం చూశారా! ఆ అబ్బాయి ఏం సేస్తన్నాడంట?"

"ఏంజేస్తన్నాడనుకున్నావ్? సిన్నమ్మకిఅట్టాంటి యిట్టాంటివాణ్ణి ఎట్టా తెస్తామే! మా సిన్నయ్య డాకటరు అవుతున్నాడు. ఇంటికొచ్చే అల్లుడు యింజనీరు కాపోతే ఎట్టా? అదేదో ఉత్తరదేశంలో రైలింజన్ల ఫ్యాక్టరీలో సేత్తన్నాడంట. పెద్ద ఓదావున్న ఉద్యోగంలే. మరి నీ సంగతేంది? రేపొద్దున తీసుకురమ్మని పెద్దమ్మ మరీ మరీ సెప్పింది....'' అంటూ ఉత్సాహంగా చెప్పుకొచ్చేడు నారయ్య.

మరునాడు పిల్లవాణ్ణెత్తుకుని భూషయ్యగారింటికి వెళ్లివస్తుంటే, దుగ్గమ్మకు సంవత్సరంక్రిందట తాను కాపరానికి వచ్చినరోజు గుర్తుకువచ్చింది. ఆరోజున గూడ నారయ్య ఇలాగే ముందు నడుస్తున్నాడు. అతని వెనుకనే నడుస్తూ, తనుండబోయే యిల్లు ఎలా ఉంటుందో, తనొక్కతే ఎలా ఉండాలో తలుచుకొని ఆందోళన, సిగ్గు పడింది. కాని సంవత్సరం తిరిగేసరికి, తన కిది చాల పాత పూరయినట్లు, ఏనాడో ఈ గడ్డమీదేపుట్టి, ఈ గడ్డమీదే పెరిగినట్లు, నారయ్యతో తన బంధం ఎంతో పురాతనమయినట్లు అనిపిస్తోంది. ఆరోజు యిక్కడికి తనెలా వచ్చిందో, ఈరోజు సుగుణమ్మ, ఎక్కడికో తనెన్నడూ చూడనిచోటికి ఎరుగని మనుష్యులమధ్యకు వెళ్తుంది.

"సల్లని మనసు, సల్లని సేతులున్న తల్లి సుకం గుండక ఏమవుద్ది? దేవుడు సల్లగ సూడకేంజేస్తడు'' అనుకుని నిట్టూర్చింది.

నారయ్య వెనుకకు తిరిగిచూసి, "ఏందే అంత పెద్ద ఆలోచనలో పడిపోతివి?'' అన్నాడు.

"ఏందోమావా! సుగుణమ్మ పెళ్లంటుంటే, ఎల్లిపోతది గెందా అని నాకు దిగులేస్తంది.''

"నీకు దిగులేస్తే ఏమే? ఇంకో అదురుష్టమంతుడి పేనం ఆయిన పడుద్ది. నువు రాంగనే నా బతుకు సుకాన పడలా! అంతే!'' అంటూ నవ్వాడు నారయ్య.

అలాగే పదిహేనురోజులు తిరిగేసరికి, పెళ్లికొడుకు సుగుణమ్మను తీసుకుని వెళ్లిపోయాడు. తరువాత తనూ, నారయ్య పిల్లవాణ్ణి చూసుకుంటూ తమ పనుల్లో పడిపోయారు.

మళ్లీ కాలం చక్రంలాగే తిరిగిపోయింది. ఎండిపోయి,నెర్రెలువిచ్చిన పొలాలమీద వాన జలజలా రాలింది. కాలువల గట్లు ఎగతన్నుకుంటూ క్రొత్త నీళ్ళు పరుగులెత్తాయి. ఇంకొకసారి పూరిచుట్టూ పొలాలన్నీ నీటిమయమై, గాలిని చల్లగాచేసి పూరిమీదకు పంపించాయి. మాగాణుల్లో వరిచేలు, మెట్టలమీది తోటలు, నీటితోపాటు పచ్చదనాన్నికూడ పుంజుకుని వనదేవత పట్టుచీరలా మెరిశాయి. యవ్వనాన్ని ధారవోసి మాతృత్వాన్ని పొందిన స్త్రీలా పసుపురంగుకు తిరిగిన వరిచేలు, కంకులబరువుతో తలలు వంచాయి. చిగురు మత్తుగా తిని, కోయిలలు చింతతోపులలోనుంచి కూశాయి.

వనలక్ష్మితోపాటు, కొడుకు ఆట పాటలు కూడ చూసుకుంటుంటే మళ్లీ సంవత్సరం ఎలా తిరిగిపోయిందో దుగ్గమ్మకు తెలియనేలేదు.

పది పదిహేను రోజులక్రిందటివరకు ఉరుకులు, పరుగులుగా సాగినకాలం, ఆరోజు స్తంభించిపోయినట్లుయింది. స్వేచ్ఛగా మైదానంలో ప్రవహిస్తున్న సెలయేరు, ఏ పర్వత పాదానికో తగిలి, బాధతో ఘోషించినట్లు, దుగ్గమ్మ కూడ ఆరోజు ఆక్రోశించింది. సెలయేరు ప్రవాహములో మలుపు తిరిగినట్లు, ఆమె జీవితంలోగూడ మరో అధ్యాయం మొదలయింది. ఆరోజు ఆరుబయట మంచంవేసుకుని పిల్లవాణ్ణి పక్కలో పడుకోబెట్టుకుని నారయ్యకోసం ఎదురు చూస్తోంది. అరటిచెట్ల దిబ్బమీద పచ్చిగడ్డికోసి, సావిట్లో పడేసివస్తానని వెళ్లిన నారయ్య యింకా రాలేదు. ఏదేదో ఆలోచించుకుంటూ పడుకునుంటే రెండోపాలేరు వేంకటాద్రిహడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చాడు. వచ్చీరాగానే, "నారయ్యను దిబ్బమీద పురుగు ముట్టింది. తెలివి ఆగి ఆగి వస్తుంది

నరసిమ్మయ్యగారింటికాడ మంత్రానికి దించొచ్చినాం. పోదాం పద'' అన్నాడు.

నారయ్యను పురుగు ముట్టిందా?

తను నిర్విణ్ణురాలయింది. కాళ్ళక్రింది నేల జరజర పాములాగ పరుగెత్తుతున్నట్లనిపించింది. వేంకటాద్రి చెబుతోంది కలలోనో, నిజంగా యిలలోనో అర్థం కాలేదు.

సుకరంగాచేసేయాత్రలో యిదొక కంటకావృత మైన ప్రదేశం కాకూడదూ!

ఆదమరిచి సుఖంగా నిదురించే రాత్రిలో యిదొక పీడకల కాకూడదూ!

కాని అదేదీ కాలేదు. వేంకటాద్రి ఎదురుగా చూస్తూ నిలుచున్నాడు. తాను యాంత్రికంగా లేచి పిల్లవాణ్ణి ఎత్తుకుని, అతనివెంట నడిచింది. నరసింహయ్యగారింటిముందు, తిరగవేసిన నులకమంచం మీద నారయ్యను పడుకోబెట్టారు. ఆమె అతని దగ్గరకు నడిచింది. అతని మెడలో గుడ్డ పీలిక దండ వేసివుంది. నోట్లోనుంచి చొంగ, నురుగు కారి మంచం తడిసింది. బిగతీసుకుపోయినట్లున్న నారయ్యను చూడ గానే తను వెర్రిగా కేకవేసి, అతనిమీద పడిపో యింది. ప్రక్కనేవున్న ఎవరో పిల్లవాణ్ణి తీసుకున్నారు. తరువాతంతా ఏమయిందో తనకు తెలియదుగాని, నరసింహయ్యగారు,''అంతా మించిపోయింది,భూషయ్యా, ఇక్కడకు తీసుకువచ్చేసరికి చాల ఆలస్యమయిపోయింది'' అంటుంటే తనకు తెలిసింది. తాను భూషయ్యగారి కాళ్లు కావిలించుకుని ''ఎట్టాగైనా నావోణ్ణి బతికించండయ్యగారూ'' అని రోదిస్తుంటే, ఉత్త రీయంతో కన్ను లొత్తుకోవటం తప్ప, ఏమీ చేయలేక పోయా డాయన. తరువాత నరసమ్మ, వేంకటాద్రి భార్య తన పిల్లవాణ్ణి ఎత్తుకుని, తనను నడిపించు కుంటూ యింటికి తీసుకువచ్చారు.

మరునా డుదయం తనకు మెలకువ వచ్చేసరికి వీరన్న, తల్లి, మల్లొదిన అందరూ కన్పించారు. పది రోజులుండి సామానంతా తీసుకుని పట్నం వెళ్లిపో యారు. తను, అన్నమాత్రం ఈరోజువరకు మిగిలి పోయారు.

క్రిందటిరోజు సాయంత్రం భూషయ్యగారు, చిన్నయ్యకలిసి తోటలోకి వచ్చారు. చాపమీద పడు కున్న తను లేచి నిలబడబోయింది. భూషయ్య,''లేవకు, కూర్చో దుగ్గమ్మా. మరీ నీరసంగా ఉన్నావ్?'' అంటూ ఎదురుగా నిమ్మపాదు కట్టమీద కూర్చున్నాడు. ప్రక్కనే చిన్నయ్యగూడ కూర్చున్నాడు.

''అయితే దుగ్గమ్మా. రేపు' వెళ్లిపోదామను కుంటున్నారుటగా. యిందాక వీరన్న వచ్చిచెప్పాడు.''

తన కళ్లు నీళ్లతో నిండి, ఏమీ మాట్లాడలేక అవునన్నట్లు తలవూపింది.

''నీ కయినవాళ్లంతా అక్కడున్నారుకాబట్టి వెళ్తా వనుకో. కాని నువ్విక్కడే వుండదలుచుకుంటేమాత్రం నాకేమి అభ్యంతరంలేదు. వేంకటాద్రికి రామాయికి కూడ యిక్కడే యిళ్ళేయిస్తాను. వాళ్ళూ తోడుం టారు. పనీ పాట చూసుకుంటూ ఉండిపోవచ్చు. నారయ్యనంటే తీసుకురాలేముగాని, నీకు నీ పిల్లవాడికి ఏ లోపము లేకుండ చూడగలం. ఇంకో విషయం...... వాడు నీ కెపుడైన చెప్పాడో లేదోగాని, వాడి సాలు జీతాలు నా దగ్గిరే ఉంచుతూ వచ్చాడు. కావలసి వచ్చి నపుడు తీసుకుని వాడుకున్నా, యింకా పదిహేను వందల రూపాయలవరకువుంది. నేను మిగతా అయిదువందల కలిపి యిస్తున్నాను. ఇదుగో, తీసుకోరా వీరన్నా'' అని చేతి సంచీలో వున్న పొట్లాం తీసి యివ్వబోయాడు. వీరన్న దుగ్గమ్మను చూస్తు వూరుకున్నాడు. దుగ్గమ్మ అంది, ''యిప్పు డా పైకమంతా పట్టుకపోయి యాడ పెట్టుకుంటా మయ్యగారూ. కర్చులకి ఓ వంద రూపాయ లీయండి. అవసర మొచ్చినపుడు వచ్చి తీసుక పోతాము.''

"అదే బాగుంటుందయ్యా. మీ కాడే ఉండ నీండి. ఏం సేత్తే బాగుంటుందో తేల్చుకున్నపుడు, అపుడే తీసుకోవచ్చు" అన్నాడు వీరయ్య.

భూషయ్య వంద రూపాయలు విడిగా తీసి వీరన్న కిచ్చి, "ఆలోచించుకో అమ్మాయ్. నువ్వెపుడు యిక్కడికి రావాలనుకుంటే అపుడే వచ్చేయి. వారే మంటారో అనిమాత్రం పెట్టుకోకు. సరే.....మే మొస్తాం......రేపేగా వెళ్తోంది.......?" అని లేచి నెమ్మదిగా వెళ్లిపోయారు.

*　　　　*　　　　*

ఉదయపు ఎండ చిటచిటలాడుతోంది. భుజం మీది పిల్లవాడు లేచి ఏడుస్తున్నాడు. వాణ్ణి జో కొడుతూ తలెత్తి ముందుకు చూసింది. నగరం పొలి మేరలు దగ్గరకువచ్చాయి. సిమెంటు ఫ్యాక్టరీ పొగ గొట్టాలు ఆకాశంలోకి లేచి, పచ్చని పొగతో, ఆకాశాన్ని మలినం చేస్తున్నాయి. మైకుల్లో పాటలు గజిబిజిగా వినిపిస్తున్నాయి. కార్లరొద, హారన్లమోతలు ఆగి ఆగి చెవులకు సోకుతున్నాయి. మళ్లీ అదే జీవితం......

బిలబిలలాడుతూ పరుగులెత్తే మనుషులమధ్యలో, పురుగులను, పశువులను సేదదీర్చే మురుగునీటి ప్రక్కన, చెట్లు చోట్లులేని గుడిసెల్లోకి మళ్లీపోవాలి... మళ్లీ బ్రతకాలి.

దుగ్గమ్మ "సేసే దేవుంది, ఎటో అటు సాగి పోవాలి గెందా?" అనుకుంటూ ముందుకు నడిచింది.

---



# సెక్యులరిజం - 1

## శ్రీ ఎం. సి. సెటల్వాడ్

భారతదేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ నిలకడగా ఉనికిగొని ఉండటానికేమి, భారతజాతి యొక్క మనికికి యేమి, ''సెక్యులరిజం''ను ఆమోదించడమే గాక, ఆచరించడము కూడా అవసర మన్నమాట తరచు వినవస్తూ ఉంటుంది. ఈ మాటకు అర్థం ఏమిటి ? భారతదేశానికి సంబంధించి ''సెక్యులరిజం'' అంటే ఏమిటో వివక్ష చేసినప్పుడు ఈ సంగతిని మనం విశదంగా అర్థం చేసుకోగల్గుతాము.

'సెక్యులరిజం' అంటే ఒక విధమైన జీవిత మార్గం. నడవడిక. ఐహికములైన విషయాలకే గాని, మతానికి యిచ్చట ప్రాధాన్యం లేదు. తరచు యీ మాటకు ఈవిధమైన అర్థం ప్రతీతం అవుతూ ఉంటుంది. ఐహికమైన సాధనోపాయాలు మాత్రమే మానవ జాతియొక్క అభ్యున్నతికి ప్రాతిపదికమైనవని, మతం అన్నది మానవమాత్రుడి పురోభివృద్ధి ప్రతిబంధకం అవుతూ ఉంటుందని ఈ సిద్ధాంతంలో ఒక అర్థం నిబిడమై ఉంది. బహుశా మార్క్సిజంకు యీ పద్ధతిని అర్థము చేసుకొనబడిన 'సెక్యులరిజ' మే ప్రాతిపదికమై ఉంటుంది. ఈ సిద్ధాంతజాలంలో ''పరలోకం' అనే దానికి ఎక్కడా స్థానంలేదు. పైగా అది అక్కడ విప్రతిపత్తిగాకూడా గణింపబడుతున్నది. ఈ రకమైన సిద్ధాంతాలు ఇటీవలనే పుట్టాయి. అంతకుముందే ఎప్పుడో పాశ్చాత్య దేశాలలో 'సెక్యులరిజం' అన్న భావన పాతుకుపోయి ఉంది. దీనికి, మార్క్సిజం అనుకున్న 'సెక్యులరిజం'కు ఎక్కడా సంబంధం లేదు.

జీవితము పట్ల ''సెక్యులర్ వైఖరి'' ని కల్గి ఉండటము అన్నప్పుడు మతాన్ని గురించిన వేరే వైఖరి ఈ 'సెక్యులరిజం' అన్న దానికి ప్రాతిపదికం అవుతున్నది. సాధారణంగా సమాజానికి, ఆ సమాజము నందలి జనులకు క్రమక్రమంగా సామాన్య జీవన క్షేత్రాల నుండి మతాన్ని పృథక్కరణం చేయడం లక్షణం అవుతుంది. ఇక్కడ హిందువులము, మహమ్మదీయులము, ఇంకా ఇతరులము, ఉన్నామంటే, చాలామందిమి మన జీవిత పద్ధతిలోను, దృక్పథంలోను మతంతో సంబంధం కల, మతమునందు పాతుకొనివున్న భావాలచేత, ఆచారాలచేత పాలింపబడుతూ ఉంటాము.ఇప్పుడు సెక్యులర్ పద్ధతి అనగానే, అది మనల్ని యీ రకమైన మార్గం నుంచి విముఖులను చేస్తుంది. అప్పుడు సమాజంలోని ఇతర వర్గాలతో, మన సంబంధాలలో నేమి,నడవడికలో నేమి మతానికి, తత్సంబంధమైన ఆచార వ్యవహారాలపట్ల మనకు ఉన్న ప్రత్యయం సడలి సడలి, మన జీవితాలకు రాను రాను ఐహికసంబంధమైన ప్రయోజనాలు మాత్రమే ఆధారం అయి అయి మన క్రియలు గూడా అట్లా మారి మారి, ఆఖరికి మతమునకు ఆ మతముయొక్క ప్రాబల్యము, ప్రతిష్టలకు వాని 'స్థానాలు ఏమో'' వానికి చూపింబచబడి, అవి మనుష్యునియొక్క ఆధ్యాత్మిక జీవన, ఆధ్యాత్మిక సంక్షేమాల వరకు

మాత్రం పరిమితం అయిపోతాయి. మానవ మాత్రులుగా మన అందరియొక్క అభ్యున్నతికి ఈ రకమైన 'సెక్యులరిజ' మే సారభూతమైనదని చెప్పబడుతున్నది. జాతియొక్క అభ్యున్నతికి కూడ ఇదే అవసరం అంటున్నారు. దీనిని నమ్ముకుంటే, సంకుచితమైన దృక్పథాలను, ప్రతిబంధకమైన దృక్పథాలను దులిపివేసుకొనడం తేలిక అయిపోతుందని ఇక్కడ భావం. కుల తత్వము, మత సంబంధమైన అభినివేశము, ఇటువంటివే అయినా మరికొన్ని భావనలు, లేక సిద్ధాంతాలు సంకుచిత తత్వాల క్రింద, ప్రతిబంధకాల క్రింద పరిగణనం అవుతున్నాయి. ఇవి మనయొక్క అభ్యుదయ రూపమైన మార్గానికి అడ్డం వస్తున్నా యన్నది ఆలోచన.

ఇంతవరకు 'సెక్యులరిజం' ను గురించి ఏమి అనుకున్నామో, అది తాత్విక రంగానికి, జనము యొక్క జీవిత మార్గానికి సంబంధించింది మాత్రమే అని గ్రహించాలి. అంతేగాని దీనికి, రాజ్యానికి ప్రజకు, లేక రాజ్యానికి మతానికి ఉండే సంబంధాల సంగతి ఇచ్చట ప్రసక్తం కాలేదు. ఇప్పుడు చెప్పిన పద్ధతులలో ఉన్న 'సెక్యులరిజము' లకు, 'సెక్యులర్ రాజ్యము'నకు ఏమీ సంబంధం లేదు. ఇవి వేరు వేరు భావనలు. భారతదేశంలోమాత్రం తరచు'సెక్యులరిజం'కు, 'సెక్యులర్ రాజ్యా' నికి అభేదాధ్యవసాయం కల్పన చేయబడుతున్నది. ఈ రెండు భావసలు ఒకటే పద్ధతిలో వ్యవహరించడం జరుగుతున్నది. ఈ రెండు భావనలు ఆధార ఆధేయ స్థితి కలవి అనడంలో సందేహంలేదు. అనగా యిక్కడ అర్థం ఇది. సెక్యులర్ పద్ధతి రాజ్యం అంటూ లేకుండా సమాజాన్నిగాని లేక వ్యక్తుల సమాజాలను గాని సెక్యులర్ తత్వాన్ని, సెక్యులర్ వైఖరిని అవలంబించేట్లు చెయ్యలేము. చెయ్యగలము అనుకోవడము ఊహించరాని విషయము.

సెక్యులర్ రాజ్యం అంటే ఏమిటో చెప్పమంటే, ఆ చెప్పడం తేలిక కాదు. పాశ్చాత్య దేశస్థులలో లిబరల్ ప్రజాస్వామ్య దృక్పథం కల వారు పెట్టిన అనూచాన సంప్రదాయంప్రకారం, సెక్యులర్ రాజ్యానికి, మతానికి మధ్య విరోధం ఏమీ లేదు. కాని మత విషయాలు అనేసరికి ఆ రాజ్యం తటస్థంగా ఉంటుంది. ఇటువంటి రాజ్యం మతం మీద కత్తి కట్టదు. కమ్యూనిష్టు సంప్రదాయంలో ఈ కత్తి కట్టటం ఉంది. సెక్యులర్ రాజ్యం అన్న దానికి అమెరికాను ఒక ఉదాహరణంగా తీసుకోవచ్చు. ఆ దేశంలో మత స్వాతంత్ర్యానికి సంబంధించిన రక్షణలు ఉన్నాయి. "వ్యక్తులకు, సమాజాలకు మత సంబంధంగా స్వాతంత్ర్యం ఉంది. ప్రభుత్వం యిచ్చట ప్రజలను, వారు ఏ మతం వారైనా సరే పౌరులనుగానే చూస్తుంది. రాజ్యానికి రాజ్యాంగ విషయకంగా మతంతో యద్విధమైన సంబంధము లేదు. ఇచ్చట ప్రభుత్వం మతాన్ని ప్రోత్సహించడం అని గాని, లేక మతంలో ప్రమేయం పెట్టుకొనడం గాని చేయదు."[1] ఇచ్చట మూలభూతమైన భావన ఏమిగా తోస్తున్నదంటే వ్యక్తికి మత స్వాతంత్ర్యం ఉంది. పౌరులతో వ్యవహారం చేసేప్పుడు ప్రభుత్వము లేక రాజ్యము మతాన్ని ప్రధానం చేసుకొని వ్యవహరించదు. ఏ ప్రత్యేకమతాన్నిరాజ్యం గుర్తించదు. ఈరాజ్యం మతం ఇది అని అనదు. వీనిలో చివరి భావనను రాజ్యాన్ని, మతాన్ని వేరు చేయడం అని చెబుతూ ఉంటారు.

ఇప్పుడు పైన చెప్పిన ప్రమాణాలనుపట్టించి పరిశీలన చేస్తే బ్రిటన్‌ను సెక్యులర్ రాజ్యం అనలేము. ఎందుచేతనంటే, అక్కడ రాజ్యానికి ఒక చర్చి ఉంది. అనగా మతం ఉంది. అది

1. "India as a Secular State"—Donald Eugene Smith, పుట 4.

ఆంగ్లికన్ చర్చి. అయినా బ్రిటన్‌లో ప్రతి ఒక్క పౌరుడు మత సంబంధమైన స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నాడు. ఏవో కొన్ని సందర్భాలలో తప్ప, రాజ్యము లేక ప్రభుత్వము కూడా ప్రజలతో వ్యవహారంలో మతాన్ని ఆధారం చేసుకొని వ్యవహరించదు. అమెరికాను పూర్తి సెక్యులర్ రాజ్యం అనవచ్చు. అక్కడ యీ ప్రమాణాలన్నీ పడతాయి. అక్కడ చర్చి, రాజ్యము ఒక దాని నుండి ఒకటి పూర్తిగా పృథక్కరింపబడినాయి.

ఇప్పుడు మన రాజ్యం ఉన్నదంటే ఇక్కడ ప్రామాణికమైన చర్చి అంటూ ఏమీలేదు. రాజ్యానికి ఒక ప్రత్యేక మతం లేదు. అన్ని మతాలను సమానంగా చూస్తుంది. ఏవో కొన్ని నిర్బంధాలు ఉన్నా, ప్రజలకు ఎవరి మతాన్ని వారు నమ్మి, ఆచరించగల, ప్రచారం చేసుకోగల హక్కు ఉంది. ఆ హక్కును రాజ్యం వారికి ఇచ్చింది. ఇటువంటి రాజ్యాన్ని సెక్యులర్ రాజ్యం అనవచ్చునా ? ఈ రాజ్యాన్ని నిర్మించడానికి కారకులైనవారు కూడా మన రాజ్యాన్ని తరచు 'సెక్యులర్' రాజ్యం అంటూ ఉంటారు. ఇట్లా అనే ఇతరులు కూడా ఉన్నారు—రచయితలు. అయితే మన రాజ్యంలో ఒక్క విషయం తక్కువై పోయింది. ఇక్కడ రాజ్యం మతం నుంచి పూర్తిగా పృథక్కరణం చెందలేదు. కొంతమంది రచయితలు సెక్యులర్ రాజ్యానికి ఈ పృథక్కరణమే అతి ముఖ్యమైన విషయంగా చెబుతున్నారు. గ్రేట్ బ్రిటన్ 'శుద్ధమైన సెక్యులర్' రాజ్యం కాదు అని అనడానికి ఈ అభిప్రాయమే దారితీసింది. అయితే మతం విషయంలో తటస్థంగా ఉంటూ, అన్ని మతాలను సమాన ఛాయలో చూస్తూ ఉన్న రాజ్యానికి యీ ప్రమాణాన్ని పట్టించి చూడరాని కారణం ఏమో కన్పించదు. మరి ఆ రాజ్యంలో మతాన్ని రాజ్యం నుంచి పూర్తిగా పృథక్కరణం చేయనప్పుడు, స్థూలంగా నైనా యీ అభిప్రాయం ఆ రాజ్యం పట్ల కూడా అనువర్తిస్తుంది.

పశ్చిమ రాజ్యాలలో సెక్యులర్ రాజ్యం ఎట్లా పైకి వచ్చిందో పరిశీలన చేస్తేనేగాని, ఇప్పుడు మనము చెప్పుకుంటున్న విషయము యొక్క మూల భూతమైన భావాలు అవగతం కావు.

పాశ్చాత్య ప్రపంచంలో మతము, రాజ్యము సంబంధమైన సమస్యలు యిప్పటివి కావు. క్రైస్తవ మతం పుట్టుక, అభివృద్ధులకు దీనికి సంబంధం ఉంది.'' సీజరుదే ఏమో సీజరుకు అర్పించు; భగవంతునివి ఏమో భగవంతునికి అర్పించు'' అని బైబిలు చెబుతున్నది.[2] మతము పట్ల క్రైస్తవుల విధేయత, రాజ్యము పట్ల క్రైస్తవుల విధేయత మధ్య తరచు సంఘర్షణలు జరుగుతూ వచ్చాయి. మతానికి వ్యతిరేకము, విరుద్ధము అని భావించిన రాజ్య ధర్మాలను క్రైస్తవులు ఆచరించలేకపోయినారు. రాజ్యం వారిని బాధించింది. తర్వాత క్రైస్తవం అచ్చట రాజ్యాలకు ప్రామాణికమైన మతం అయిపోయింది. అప్పుడు క్రైస్తవులు, ప్రత్యర్థి మతాలకు చెందిన వారిని బాధించారు. క్రైస్తవేతరములైన దైవాయతనాలు మూత పడినాయి. కొంతకాలంపాటు క్రైస్తవ రాజ్యము, క్రైస్తవ మతము పరస్పరం సహకరించుకుంటూ పని చేశాయి. ఆ పిమ్మట పోపుకు, చక్రవర్తికి తగూలు ఏర్పడ్డాయి. ''మధ్య యుగపు కాలం అంతటా క్రైస్తవ విశ్వ సమాజాన్ని గురించిన భావన ప్రాబల్యం వహించి ఉంది. చర్చికి ప్రాధాన్యము హెచ్చింది. క్రైస్తవ మతంలో విశ్వాసం గల వారి యొక్క స్వచ్ఛందమైనసమాజం అన్న అర్థంకన్నా అధికతరమైన అర్థంతో యీ చర్చి

---

2. లూకా 20: 25; మార్కు 13:17

భావింపబడుతూ వచ్చింది. క్రీ. శ. మొదటి శతాబ్దంలో చర్చి అంటే అర్థం ఏమో అది ఇప్పుడు మారిపోయింది. సామ్రాజ్యం అన్నది ఎట్లా విశ్వవ్యాప్తమో, అదేవిధంగా చర్చి కూడా అన్న భావం ఏర్పడింది. ఎందుచేతనంటే ఇటు చర్చి, అటు సామ్రాజ్యము ఇంతగా పర్యాప్తమైన అర్థము కలవి, సర్వ జనులను తమలో కలుపుకొన్నవి అన్న అర్థం కుదర్చబడింది. ఇచ్చట భావన ఇది. ఇచ్చట రెండు ప్రభుత్వాలు ఉన్నాయి. ప్రతి ఒక్క ప్రభుత్వానికి దేని అధికారవర్గం దానికి, దేని ధర్మానుశాసనాలు దానికి, దేని అధికార వ్యాప్తి దానికి, ఉన్నాయి. ఈ రెండు ప్రభుత్వాలు క్రైస్తవ సమాజాన్నేపాలిస్తూఉన్నాయి.'' పోతే సెక్యులర్ రాజ్యం అన్న భావన ఒకటి ఈ కాలంలో ఆవిర్భవించింది. పెడ్యువాకు చెందిన మార్సిగ్లో అనే అతడు 14వ శతాబ్దంలో ఈ భావనను మొట్టమొదటిసారిగా వ్యక్తీకరించినట్లు చెబుతారు. ఆయన ''డిఫెన్సర్ పాసిస్'' (Defensor pacis) అనే గ్రంథాన్ని వ్రాశారు. అందులో ఆయన దైవశాసనానికి, మానవ శాసనాలకు ఉన్న అంతరం ఏమిటో చూపించారు. ''జనం ఉన్నారంటే వారియొక్క హక్కులు, వారు అనుసరించే మతం కన్నా వేరైనవి; స్వతంత్రమైనవి. ఏ మతాన్నిబట్టి ఏ ఒక్కరిని శిక్షించడం ధర్మంకాదు'' అని ఆయన వ్రాశారు.3 అయితే ఇది ఒక భావన యొక్క కలిల స్వరూపం మాత్రమే. ఇది అభివృద్ధి పొంది, పాదు త్రొక్కుకునేందుకు కొన్ని శతాబ్దాలు పట్టింది.

క్రైస్తవ మతధర్మ వ్యతిరిక్తాలయిన అభిప్రాయ వ్యక్తీకరణం పాపం క్రింద భావింపబడుతూనే వచ్చింది. ఇది పెద్ద నేరం. ఇందుకు మరణమే శిక్ష. చర్చితాలూకు అధికార వర్గానికి సంబంధించినవారు నలుమూలలా క్రుమ్మరిల్లుతూ మత ధర్మాలను శంకించినవారిని వేటాడుతూవచ్చారు. ఆశంకించినవారిని సెక్యులర్ అధికారులు శిక్షిస్తూ వచ్చారు. వారికి ఎటువంటి శిక్ష విధించాలని చర్చి నిర్ణయించి ఉన్నదో అటువంటి శిక్షలు వారియందు పాలింపబడుతూ వచ్చాయి. పదునారవ శతాబ్దంలో ప్రొటెస్టెంట్ సంస్కారోద్యమం విజృంభణం మూలంగా కూడా చర్చి, రాజ్యముల మధ్య ఉన్న వివాదం పరిష్కారం కాకపోయింది. ఒకే మతానికి చెందిన వారితో రాజ్యం అంటు నెలకొని ఉన్నప్పుడే ఆ రాజ్యానికి స్థితిగాని, లేకపోతే లేదు అని, కేథలిక్కులకు వలెనే యీ ప్రొటెస్టెంటులు కూడా భావిస్తూవచ్చారు. ఇచ్చట యీ విషయంలో కేథలిక్కులకు, ప్రొటెస్టెంటులకు తేడా లేకపోయింది. 1555 లో ఆగ్స్‌బర్గ్ శాంతి అంటూ కుదిరి నప్పుడు ఈ సిద్ధాంతం అందులో స్పష్టంగా ఉదహరింపబడింది. "ejus rejio, ejus religio" అన్న సిద్ధాంతమే ఇందుకు ప్రాతిపదికమైంది. రాజు ఏమతంవాడో, రాజ్యంమతం గూడా అదే అయిపోయి, ఇతర మతాలకు చెందిన అల్ప సంఖ్యాకులు, తాము అనుసరించే మతాన్ని విశ్వసిస్తున్న రాజులు గల రాజ్యాలకు వలసపోతూ వచ్చారు. శాబైన్ యిలా వ్రాశాడు: ''మత సంబంధమైన సహనం క్రమంగా మాత్రమే సంభవం అయింది. ఇందుకు మరో రకం పరిష్కారానికి గత్యంతరంలేని పరిస్థితులు అంటూ ఏర్పడి, వాని ఒత్తిడివలన కూడా, ఇది, యీ సహనం ఏర్పడింది. ఎందుచేతనంటే, వేరు వేరు మతాలుగలవారుఉన్నా రాజకీయమైన విధేయతను కల్గిఉండడానికి మతాలు ప్రతిబంధకాలు కావని గ్రహించబడింది.''4 ఐరోపాలో

3. డొనాల్డ్ ఇయజిన్ స్మిత్ గ్రంథం నుంచి ఉద్ధృతము.

4. George H. Sabine-A History of Political Theory-P. P. 357, quoted by Donald Eugene Smith.

రిఫర్మేషన్‌కు లేక సాంఘిక విప్లవానికి ఏరకమైన భావప్రపంచం ప్రోది చేసిందో ఆ రకమైన భావ ప్రపంచమే, మతానికి విధే యంగా ఉండటము వేరు, రాజ్యానికి విధేయంగా ఉండటం వేరు అన్న పద్ధతి అభివృద్ధిచెంద డానికి దోహదకారి అయింది. బ్రిటన్‌లో ఎలిజ బెత్ రాణి పరిపాలన ప్రారంభం అయ్యే అంత వరకు మతసహనం సంగతి అస్తినాస్తివిచికిత్సా హేతువుగానే ఉంటూ వచ్చింది. మతం అన్నది రాజ్యం యొక్క విధుల పరిధికి ఆవలను ఉన్న విషయంగా జాన్ లాక్ పేర్కొనిఉన్నాడు. కాని ఆయన కూడా కేథలిక్కులను, నిరీశ్వర వాదులను సహించలేకపోయినాడు. చివరికి ఒక విధమైనసమన్వయంకుదిరింది.దీనిని టోయన్‌బీ "20 వ శతాబ్దపు పాశ్చాత్య ప్రపంచపు సెక్యులర్ జీవితం" అన్నాడు. "ఇచ్చట, యీ సెక్యులర్‌జీవితంలోవిజ్ఞానశాస్త్రంమతంయొక్క స్థానాన్ని ఆక్రమించుకున్నది. పాశ్చాత్య సమా జంలో సారథులైన ఉన్నతాత్ములకు ఈ విజ్ఞాన శాస్త్రం పరమము, ప్రామాణికము అయి పోయింది."[5]

ఇక్కడ మనంగ్రహించవలసిన విషయం ఇది. ఒకసమాజంలో మతం యొక్క ప్రాబల్యం తగ్గి పోతూ వచ్చిందంటే, అందుకు జనుల ఆలోచన లలో జీవితపంథాలో బలంగా ఊదుకున్న సెక్యులర్ లక్షణమే కారణంగాని, మరి ఇంకొకటి ఏదీ ఇంత ప్రబలమైన కారణం కాదు.

అమెరికా వంటి దేశంలో అచ్చమైన అర్థంలోసెక్యులర్ రాజ్యం ఏర్పడటము, అభి వృద్ధి చెందడమునకు అయిన కారణాన్ని గూర్చి ఇప్పుడు పరిశీలన చేయవలసి ఉంది. మొదట దేశం ఇంకా వలసలు మాత్రంగా ఉన్న తొలి రోజుల్లో, ఆ ప్రజలు తాము ఐరోపానుంచి వెంటపెట్టుకు వచ్చిన పద్ధతులనేఅనుసరించారు. వారు తాము తాము నమ్మిన మత విశ్వా సాలను బట్టి 'చర్చి' లను నిర్మించుకున్నారు. వీరిలో కొందరు కాల్విన్ పద్ధతి క్రైస్తవ మతాన్ని అనుసరించారు. కొందరు ఆంగ్లికన్ చర్చి పద్ధతులను అనుసరించారు. కొన్ని వలసలలో ప్రామాణికమైన చర్చి గాని, రాష్ట్ర మతం అని గాని లేవు. పదమూడు వలసలు కలిసి సంయుక్త రాష్ట్రాలుగా ఏర్పడినప్పుడు అక్కడ ఆ ప్రాంతాలలో వివిధ మతాలకు చెందిన ప్రజలు, ఆ రాష్ట్రాలయందంతటా విస్తరించి ఉన్నారు. అప్పుడు ఆ దేశం అధి కారమతం లేక చర్చి ఎట్టిదై ఉండవలసి ఉంటుంది? దేశంలో జనాభా వివిధమైనదై ఉన్న కారణంచేత అందరికి ఒకటిగా ఉండే చర్చిని స్థాపించడం అసాధ్యమై పోయింది. కొన్నికొన్ని రాష్ట్రాలు ప్రామాణికమైన 'చర్చి' లు అంటూ లేకుండా జయప్రదంగా నడిచినందువల్ల చర్చిని, రాజ్యాన్ని పృథక్కరించి నడపడం అనే భావానికి బలం చేకూరింది. పైగా ఆ రోజుల్లో అది మోజు కూడాను. చివ రకు యీ పద్ధతినే అమెరికా రాజ్యాంగం ఆమోదించింది. ఈ రాజ్యాంగంలో దేవుణ్ణి గూర్చిన ప్రసక్తే లేదు. అందులోని ఆరవ అధికరణంలో "అమెరికాలో ఏ రకమైన ఉద్యోగానికిగాని, పబ్లిక్ ట్రస్ట్‌కు గాని మత సంబంధమైన ప్రమాణాలతో సంబంధంలేదు. అటువంటి ప్రమాణాల అవసరం యిక్కడ లేదు" అని స్పష్టంగా పేర్కొనబడి ఉంది. 1781 లో ఈ రాజ్యాంగం తొలిసారిగా సవ రింపబడినప్పుడు, ఆ మొదటి సవరణలో "మత స్థాపన విషయంలో కాంగ్రెస్ ఎటువంటి

5. Donald Eugene Smith గ్రంథం నుంచి ఉద్ధృతము.

శాసనము చేయరాదు. మత స్వాతంత్ర్యాన్ని నిషేధించరాదు'' అని విశదం చేయబడింది.

అమెరికా రాజ్యాంగం నిర్మాతలు జేమ్సు మేడిసన్, థామస్ జఫర్‌సన్‌లు—రాజ్యము, మతము వేరు వేరుగా ఉండాలన్న సిద్ధాంతాన్ని గట్టిగా విశ్వసించినవాళ్ళు. తను దేశం రాజ్యాంగాన్ని ప్రథమ పర్యాయం సవరించవలసి వచ్చినప్పుడు అధ్యక్షుడు జఫర్‌సన్ ఇట్లా అన్నారు:

''మతాన్ని స్థాపించాలని, లేక మతస్వాతంత్ర్యాన్ని నిషేధించాలని తమ చట్ట నిర్మాణ సభ ఏ రకమైన శాసనాన్ని చేయరాదని అమెరికా ప్రజలు చేసుకున్న నిర్ణయాన్ని నేను పరమమైన భక్తితో సమాలోచన చేస్తాను. ఈ నిర్ణయంవలన అమెరికా ప్రజలు మతాన్ని, రాజ్యాన్ని పృథక్కరణచేస్తూ, ఒక గోడను నిర్మాణం చేసుకోగల్గారు.''6

మతాన్ని, రాజ్యాన్ని పృథక్కరణం చేస్తూవున్న గోడను గురించి జఫర్‌సన్ చెప్పిన మాటలను రాజ్యాంగ ధర్మవేత్తలు 'సెక్యులర్ రాజ్యం' యొక్క ప్రధానమైనసూత్రంగాభావిస్తూ వచ్చారు. చర్చిని, రాజ్యాన్ని ఇట్లా దూర దూరంగావుంచే పద్ధతిని అమెరికన్ జాతి ధృతితో అవలంబించుకుంటూవచ్చింది. ఈ జాతి చరిత్ర రెండువందల సంవత్సరాల పైచిలుకు వయస్సు గల్గినది. ఈ రెండువందల సంవత్సరాలపాటూ ఈ అవలంబనానికి విచ్ఛిత్తి అంటూ లేదు.

అయితే చర్చిని, రాజ్యాన్ని ఇట్లా పృథక్కరణం చేసినంతమాత్రంచేతనే, మత స్వాతంత్ర్యం ఏర్పడిపోయిందని అర్థంకాదు. సోవియట్ రష్యాలో రాజ్యానికి చర్చిలేదు. అట్లా అని అక్కడ మత స్వాతంత్ర్యం ఉన్నదని ఎవ్వరూ అనరు. బ్రిటన్‌వంటి రాజ్యాలు—ప్రామాణికమైన 'చర్చి'లు గలవిఉన్నాయి. ఆ దేశాలలో. రాజ్యంనుండి మతం పృథక్కరింపబడ లేదు. అయినా ఆ దేశాలలో సంపూర్ణమైన మత స్వాతంత్ర్యంవుంది. ఒకదేశంలో లిబరల్ ప్రజాస్వామ్యరాజ్యం చెల్లుతూ వున్నప్పుడు, రాజ్యానికి, చర్చికి జరిగిన పృథక్కరణంవలన మత స్వాతంత్ర్యం అన్నది సంపూర్ణంగా వున్నదని, మత సంబంధమైన విషయాలలో రాజ్యం తటస్థంగా వుంటుందని —చెప్పబడేవాదం పూర్వపక్షం చేయరానిది.

'సెక్యులర్ రాజ్యం' అన్న భావన పాశ్చాత భావప్రపంచ సముద్భవం. అందులో అనుమానం ఏమీలేదు. అంతమాత్రంచేత మత సహనము, మత స్వాతంత్ర్యము ప్రాచ్యదేశాలకు విజాతీయమైనవిషయాలనిఅర్థంచెయ్యకూడదు. మతం విషయంలో వ్యక్తికి సర్వ స్వాతంత్ర్యము ఉండాలన్నది, సెక్యులర్ రాజ్యానికి ప్రాతిపదికమైన ధర్మాలలో ఒకటి. ఈ ధర్మం ఆసియా దేశాలలో, హిందూమతాన్ని, బౌద్ధాన్ని అవలంబించి అనుసరిస్తున్న దేశాలలో అనాది సిద్ధంగా శతాబ్దాలు కాలంగా ఉంటూనేవుంది.

ఇప్పుడు భారతదేశం సంగతి ఏమిటో చూద్దాము. హిందూతత్వములో, పద్ధతిలో, ఈ మత సహనము, స్వాతంత్ర్యము, ఎట్లా రూపుగొనివున్నదీ పరిశీలిద్దాము. హిందూతత్వంలో మనుష్యుని భావిపరిణామాన్నిగూర్చిన చింతనము ఎక్కువ. పరతత్వభావన అధికము. అనగా, మానవ వ్యక్తిత్వము కేవల పరతత్త్వమునందు లీనమైపోతుందన్న భావనకు ఈ తత్వంలో

---

6. డోనాల్డ్ ఇయుజిన్ స్మిత్ గ్రంథం నుంచి ఉధృతము.

ప్రాధాన్య మధికం. ఇచ్చట ఏ వ్యక్తిమతము ఏమి టనిన దానికి పెద్ద ప్రాధాన్యములేదు. ఆ కారణం చేత సహనముఎక్కువ. మానవుడైనవానికి ముక్తి బహుమార్గాలద్వారా లభ్యం అవుతుందని హిందువులు విశ్వసిస్తారు. హిందూతత్వంయొక్క ప్రధానమైన ప్రాతిపదిక ఇదే. కాబట్టే వివిధములైన, విరుద్ధములైన, పరస్పరము సరిపడని నమ్మకములకు, ఆచారములకు ఆ తత్వంలోస్థానం ఉన్నది. ఈ నమ్మకములయొక్క ఫలితాలు ఏమిటో భారతదేశం చరిత్రలో కన్పిస్తూనేఉన్నాయి. భారతదేశంలో శతాబ్దాల తరబడిగా జైనులు ఉన్నారు; బౌద్ధులు ఉన్నారు; క్రైస్తవులువున్నారు; జొరాష్ట్రియనులుఉన్నారు. వీరంతా నిక్షేపంలాగా ఉంటున్నారు. వారికి ఎట్టి అపచారము జరగలేదు. పదకొండవ శతాబ్దంలో ముస్లింలు భారతదేశంపై దండయాత్రలు ప్రారంభం చేశారు. అంతకుముందునుండియు కూడా అనేకమంది ముస్లిములు భారతదేశంలో జీవిస్తూనే ఉన్నారు. వారికి ఎటువంటి అపచారము జరగలేదు. హిందూమతము జైనమతమువలె, బౌద్ధమతమువలె 'మిషనరీ'మతం కాదు. హిందూ సంస్కర్తలు ఇటీవలనే కొన్ని సంస్కరణ ప్రయత్నాలు మొదలుపెట్టారు. కాని అవి జయప్రదం అవుతున్నట్లు తోచదు.

హిందూరాజ్యం ఎప్పుడుగాని, ఒక ప్రత్యేకమైన మతాన్ని తన ప్రజమీద విధించాలని చూడలేదు. అనేక రకాల మతాలకు ఆ మతం స్థానం ఇచ్చింది. ఆ మతాలను ప్రచారం చేసుకోడానికి వీలులను కల్పించింది. దేవాలయాలను, దేవాయతనాలను కట్టుకోనిచ్చింది. ఎవరి బ్రతుకు వారిని బ్రతకనిచ్చింది. ఒకరు నమ్మిన సిద్ధాంతంకోసం భారతదేశంలో పోరాటాలు జరిగినజాడ చరిత్రలో ఎచ్చటా కన్పించదు. ఐరోపాలో ఇటువంటి యుద్ధాలు చాలా జరిగాయి.

"భారతదేశంలో మతాన్ని గురించి, తత్వాన్ని గురించి ఆలోచనలు చేసినవారు దీర్ఘకాలం సంపూర్ణమైన స్వాతంత్ర్యాన్ని అనుభవించినట్లు చెప్పవలసివుంది. ఇది యదార్థం. పురా భారత దేశంలో ఆలోచనా స్వాతంత్ర్యం అధికంగా ఉండేది. అటువంటి లక్షణం పాశ్చాత్య దేశాలలో చూద్దామన్నా కన్పించదు.ఇటీవలమాత్రమే ఇది కొంతకు కొంత సాధ్యం అవుతూ వస్తున్నది.7" ఈవిధంగా పురాతన భారతదేశంలో 'సెక్యురిలిజం' అనూచానంగా, సంప్రదాయకంగా చెల్లుతూ వచ్చిందని చెప్పడానికి అవకాశం కన్పిస్తున్నది.

మత విషయంలోవున్న, ఆలోచనా సంబంధంగావున్న యీ స్వాతంత్ర్యం హిందువుల సంఘ జీవన సంబంధి వివిధ రంగాలలోను కన్పించదు. హిందూ సమాజంలో సువ్యవస్థితమైన కేంద్ర వ్యవస్థ అంటూ ఏమీలేదు. అనగా పాశ్చాత్య దేశాలలోవలె చర్చి మొదలైనటువంటివిలేవు. అయినా హిందూ తత్వము హిందువుల సామాజిక జీవనాన్ని ఎంతగానో ప్రభావితం చేసింది. హిందూ ధర్మాన్ని ఉపయోగించడము ద్వారా, వర్ణ ధర్మముద్వారా యీ ప్రభావము చెల్లింపబడింది. హిందువుల జీవనంలో కులము అన్నది శక్తివంతము, సర్వవ్యాపకము అయిన

---

7. మేక్స్ వెబ్బర్— డొనాల్డ్ స్మిత్ గ్రంథంలో ఉదహరించబడింది.

విషయం అయిపోయింది. ఇప్పుడు గూడా దాని ప్రాభవం తగ్గలేదు. ఈ కులముల పద్ధతి ఆధారంగా ఏర్పడిన సాంఘిక నిబంధనములు, మతమునుండి సముపార్జితములైన ఇతర ఆచార వ్యవహారములు హిందూ సమాజాన్ని పట్టు విడుపులేని దానినిగా ఘనీభవింపజేశాయి. ఈ విభజనలో పరస్పరము వైరభావములు గల జనసంఘములు తలలెత్తాయి. ఇందువల్ల 'సెక్యులర్' వైఖరిని అబ్బించుకొనడము ఇచ్చట కష్టం అయిపోతున్నది.

భారతదేశంలో ఇస్లాము మతము గూడా వుంది. ఈమతాన్ని అనుసరించే ప్రజలు మొత్తం జనాభాలో 10 శాతముదాకా ఉన్నారు. వీరి మత తత్వము వేరు. భగవద్దత్తములైన మతాన్ని సమాజ ధర్మాన్ని స్థాపించాలన్నది యీ తత్వంలో ప్రధాన విషయం. ఆ స్థాపించడము దైవకార్యంగా భావించడముకాక, ఇతర మతముల పొడకూడా నిల్వ నీయడము ఇందలిలక్షణముకాదువలె గోచరిస్తుంది. (పశేషం)

(ఆకాశవాణి సౌజన్యంతో)



# జనాభా సమస్యలు-2

'ఆంగీరస్'

[ఫిబ్రవరినెల సంచిక తరువాయి]

ప్రపంచంలో అన్ని దేశాలలోను జనాభా ఒకే విధంగా ఉండదు. ఒకేవిధంగా అభివృద్ధి చెందదు. ఈ విషయంలో ఏదేశం లక్షణాలు ఆదేశానికి, లేక కొన్ని రకాల దేశాల లక్షణాలు కొన్ని దేశాలకు ఉంటాయి. ఇది ప్రత్యేకం ఆ యా దేశాలు సాధించిన అభివృద్ధి దశా విశేషాన్నిబట్టి, పద్ధతినిబట్టీఉంటుంది. అందువల్లనే కొన్ని దేశాలలో జనాభా పెరుగుదల ఒక విధంగాను, మరికొన్ని దేశాలలో ఇంకోవిధంగాను ఉండటం. అయితే చరిత్రలో జనాభా పెరగడమేగాని, తరగడం అంటూ ఉండదు. ఈ పెరుగుదల ఏ ''రేటు'' ప్రకారం ఉంటుందన్నదే ఇక్కడ తేడా. ఒకప్పుడు మనదేశంలో జనాభా 33 కోట్లు; ఇప్పుడు 45 కోట్లకు మించిపోయింది. ఏ దేశాన్ని తీసుకొని చూచినా, ఏదో ఒక విధంగా యీ పెరుగుదల కన్పిస్తూనే ఉంటుంది. ప్రపంచంలో యీ జనాభా పెరుగుదల ఎట్లా ఉన్నది, ఎట్లా ఉంటూ వచ్చింది మొదలైన విషయాలను తేల్చి చెప్పే శాస్త్రం ఒకటివుంది. దాన్ని ''డెమోగ్రాఫీ'' అంటున్నారు.

ఈ డెమాగ్రాఫర్లు చెప్పేదాన్నిబట్టి ప్రపంచంలో ఆట్టే దేశాలలో మొదట జనాభా లెక్కలు ఉన్నట్లు కన్పించదు. అట్లా అని పూర్తి అటువంటి దేశాలు లేవనికాదు. చైనాను తీసుకు చూస్తే, ఆదేశం జనాభాను గురించిన వివరాలు ఎప్పటినుంచో నమోదు చేయబడి ఉన్నట్లు తేలుతుంది. ఆబిట్ పేసన్ ఉషర్ (Abbot payson Usher) అనే ఆయన ''ది హిష్టరీ ఆఫ్ ది పాప్యులేషన్, అండ్ సెటిల్‌మెంటు ఇన్ యురేషియా''అన్న ఒక వ్యాసంలో ఇట్లా వ్రాశారు : ''జనాభాను గురించి పరిశీలన చేయడానికి చైనాకు సంబంధించినంతవరకు ఎంతోకాలం నుంచి లెక్కలు లభిస్తున్నాయి. ఐరోపా విషయంలో గాని, ఐరోపాకు చెందిన మరి ఇంకో దేశానికి దేనికి సంబంధించిగాని ఇట్లా అని చెప్పలేము.'' ఇక భారత దేశం ఉన్నదంటే, అది ఒక పెద్ద సమస్య; కాని మొగలుల కాలంనుంచీ కొంచెం నయం. డబ్ల్యు. హెచ్. మూర్‌లాండ్ 1920 లో ఒక పుస్తకం ప్రకటించారు. ''అక్బరు మరణించిన నాటి భారతదేశము—ఆర్థిక పరిస్థితుల పరిశీలనము'' అని. అందులో ఆయన చెప్పిన కొన్ని కొన్ని విషయాలనుబట్టి అప్పుడు, అనగా 16 వ శతాబ్దంలో భారతదేశం జనాభా ఎంతగా ఉన్నది కొంతకు కొంతగా తెలుస్తుంది. అందులోను ముఖ్యంగా దక్షిణ ప్రాంతపు జనాభా సంగతే తెలుస్తుందిగాని, గంగా మైదానంలో ఏవిధంగావున్నదీ తెలియదు. అయినా మూర్‌లాండు ఒక పద్ధతిని అనుసరించి 16 వ శతాబ్దంలో భారత దేశం జనాభా 10 కోట్లుదాకా ఉండవచ్చునని తేల్చారు. ఇదేవిధంగా చరిత్రకు సంబంధించి పత్రాలను, పూర్వకాలపు వృత్తులను, వ్యవసాయాన్ని ఆధారంగా తీసుకొని ఆ యా దేశాలలో జనాభా ఇంత ఇంతగా ఉండవచ్చునని డెమోగ్రాఫర్లు అంచనాలు వేశారు.

శాస్త్రయుక్తంగా జనాభా పరిగణనం అనంతమైన ప్రపంచ చరిత్రలతో పోల్చుకుచూస్తే, ఇటీవలనే ప్రారంభమైనదని చెప్పాలి. 18, 19 శతాబ్దాలలో కూడా కొన్ని కొన్ని దేశాలలో జనాభాకు సంబంధించిన లెక్కలు సరిగ్గాలేవు. ప్రతి విషయాన్ని ఎంతో శాస్త్రయుక్తంగా ఆలోచించే ఐరోపా దేశాలలో కూడా ''ఆగస్టస్ మృతి మొదలు పదునాల్గవ శతాబ్ది తొలి అర్థం వరకు జనాభాకు సంబంధించిన వివరాలను పరిశీలించాలంటే తగిన ఉపపత్తులు ఏమీ లభించడంలేదు'' అని ఒక జనాభా శాస్త్రవేత్త వ్రాశారు. అందువల్ల పూర్వకాలంలో

ప్రపంచంలో జనాభా పెరుగుదలయొక్క పద్ధతి ఎట్లా ఉండేదో తగిన అవకాశం లేకపోయింది.

## 2

కాని ఇటీవల ఒకటి రెండు శతాబ్దలుగా సర్వ దేశాలలో ఏదోవిధంగా యీ జనాభాకు సంబంధించిన లెక్కలు తయారు చేయబడుతున్నాయి. ఐరోపా దేశాలలో తక్కిన దేశాలలోకంటే ముందే యీ పరిగణనం ప్రారంభం అయింది. ఆ పదునారవ శతాబ్దం నుంచి ఐరోపా జాతులవారు నూతన ప్రపంచాలను సందర్శించడము, ఆ ప్రపంచాలలో వలసలు ఏర్పాటు చేసుకొనడము ప్రారంభం అయిన దగ్గరనుంచి, ఆ యా దేశాలలో కూడా వారు తాము తమ దేశాలలో అనుసరిస్తున్న పద్ధతులను చాలావరకు ప్రవేశపెట్టారు. అందువల్ల దాదాపు అప్పటినుంచి యీ వివరాలు పూర్తిగా కాకపోయినా, కొంతవరకైనా తెలియడానికి అవకాశం ఏర్పడింది. అయినా కొంతమంది శాస్త్రజ్ఞులు 1650 నుంచి 1900 దాకా జనాభా పెరుగుదల పద్ధతి ఎట్లా ఉండి ఉంటుందో అంచనాలు వేశారు. ఇటువంటి వారిలో వాల్టర్ విల్‌కాక్స్ ఒకరు. "స్టడీస్ ఇన్ అమెరికన్ డెమోగ్రఫీ" అనే తమ గ్రంథంలో ఇందుకు సంబంధించిన కొన్ని వివరాలు ఇచ్చారు. వానిలో 1650 మొదలు 1900 దాకా ప్రపంచం జనాభా ఏవిధంగా ఉంటూవచ్చింది తెలిపే పట్టీ ఆ వివరాలు ఆధారంగా తయారు చేయబడింది.[1] అది ఇది .

(జనాభా అంచనా లక్షలలో)

| ఖండం | 1650 | 1750 | 1850 | 1900 | 1950 |
|---|---|---|---|---|---|
| 1. మొత్తం ప్రపంచ జనాభా | 4700 | 6940 | 10940 | 15500 | 24540 |
| 2. ఆఫ్రికా | 1000 | 1000 | 1000 | 1200 | 1980 |
| 3. అమెరికా | 86 | 110 | 590 | 1440 | 3300 |
| 4. ఆసియా | 2570 | 4370 | 6560 | 8570 | 13200 |
| 5. ఐరోపా | 1030 | 1440 | 2740 | 4230 | 5930 |

ఇప్పుడు పైన ఇచ్చిన పట్టీలో అమెరికా అన్నప్పుడు ఉత్తర దక్షిణ అమెరికాలు రెండూ అని అర్థం. ఆసియా తాలూకుగా ఇచ్చిన జనాభా అంచనాలలో సోవియట్ యూనియన్‌లోని ఆసియా ప్రాంతాల లెక్కలు చేర్చలేదు. ఆ అంకెలు ఐరోపా దేశాలకు సంబంధించి ఇచ్చిన జనాభా అంచనాలలో చేర్చబడినాయి. అంతేగాక ఈ అంకెలను బట్టి చూస్తే ప్రపంచ జనాభా, అంచనాలను బట్టే అనుకున్నా, ఏవిధంగా పెరుగుతూ వచ్చింది తెలుస్తున్నది. క్రీ. శ. 1650 లో ప్రపంచం జనాభా దాదాపు 47 కోట్లు మాత్రమే. 1950 నాటికి అది 245 కోట్ల 40 లక్షలు అయిపోయింది. అనగా మూడు వందల సంవత్సరాలలో దాదాపు ఐదు రెట్లయిపోయింది.

"The past and future population of the world and its continents" అన్న ఒక పత్రంలో ఈ పట్టీని ఇట్లా వ్యాఖ్యానించారు: "క్రీ.శ.1650 మొదలు 1950 వరకు ప్రపంచం జనాభా ఐదు రెట్లకుపైగా పెరిగింది. ఇంకా పెరుగుతోంది. 1650—1850 సంవత్సరాల మధ్య నడిచిన 200 ఏండ్లలోను ప్రపంచ జనాభా రెట్టింపునకుపైగా పెరిగింది. ఆ తర్వాత అనగా 1850—1950 సంవత్సరాల మధ్య నడిచిన 100 ఏళ్లలోను అది అంతగాను పెరిగింది. అంటే రెట్టింపు అయింది. 1900 మొదలు 1950 వరకు జనాభా పెరిగిన పద్ధతిచూస్తే, ఆక్రితం అర్థం శతాబ్ది కాలంలోనాటికన్నా ఈ పెరుగుదల అధిక తరంగా ఉన్నట్లు గోచరిస్తుంది." అంతేగాక ఇక్కడ ఇంకో విషయం కూడా ఉంది. ఆ విషయం గూడా ఈ పత్రంలోనే ఇట్లా వివరించబడిఉంది. "ప్రపంచంలో అన్ని ప్రాంతాలలోను యీ జనాభా పెరుగుదల తీరు ఒకవిధంగాలేదు. ఆసియాఖండంలో యీ జనాభా పెరుగుదల అవికలంగా కొనసాగుతున్నట్లు తోస్తుంది. అయితే ఈ పెరుగుదల రేటు మాత్రం పెద్దగా గొప్పగా ఉన్నట్లు కన్పించకపోవచ్చు. ఐరోపాలో మాత్రం 19 వ శతాబ్దం ద్వితీయార్థంలో జనాభా అధికతరంగా పెరుగుతూ వచ్చింది. అయితే ఇటీవల ఆ ఉమ్మస్సు కొంతవరకు తగ్గింది. 1850 కి ముందు ఆఫ్రికాలో యీ జనాభా ఏవిధంగా పెరుగుతూ వచ్చింది చెప్పడం కష్టం. ఉత్తర దక్షిణ

1. ఈ పట్టీని సమితి తాలూకు జనాభా విభాగంవారు ఒక పత్రంలో ఉదహరించారు. విల్‌కాక్స్ ఇచ్చిన వివరాలను, తరువాత లభ్యమైన వివరాలనుబట్టి సంస్కరించారు. 1950 లెక్కలు సమితి విభాగంవారు వివిధ దేశాల జనాభా మదింపులను బట్టి తయారు చేశారు.

అమెరికాలలో జరిగిన 200 ఏండ్లలోను జనాభా పెరుగుదల అధికంగా వుంది. 1750--1900 సంవత్సరాల మధ్య ఉత్తర అమెరికా జనాభా అధికంగా పెరిగింది.''

జరిగిన 300 ఏళ్లమీద ప్రపంచ జనాభా పెరిగిన తీరు ఈవిధంగావుంది. ఈ పెరుగుదల ఆగే లక్షణం ఎక్కడా కన్పించడంలేదు. 1920 మొదలుకొని 1950 వరకు నడిచిన 30 సంవత్సరాలలోను ప్రపంచం జనాభా పెరిగిన తీరునుచూస్తే ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండాలలో జనాభా పెరుగుదల అధికంగా కొనసాగుతున్నట్లు విదితం అవుతుంది. 1920లో ప్రపంచ జనాభా 183కోట్లు; 1950 లో 254 కోట్ల 57 లక్షలు; 1920 లో ఆసియా జనాభా 99 కోట్లు; 1950 లో 132 కోట్లు; 1920 లో ఆఫ్రికా జనాభా 13 కోట్ల 90 లక్షలు; 1950లో 33 కోట్లు; 1920 లో దక్షిణ అమెరికా జనాభా 9 కోట్లు; 1950 లో 16 కోట్ల 20 లక్షలు. ఈ 30 సంవత్సరాలమధ్యను ఒక ఆర్థిక సంక్షోభం, ఒక ప్రపంచయుద్ధం నడిచాయి. అయినా ప్రపంచ జనాభా, సమితి జనాభా విభాగంవారు పేర్కొన్నట్లు ప్రతిదశాబ్దంలోను సాలుకు ఒక్క శాతం చొప్పున పెరుగుతూ వచ్చింది. అనగా ''ఇప్పటికి మూడు వందల సంవత్సరాల క్రిందట ఆరంభ మైన జనాభా పెరుగుదల అన్న అపూర్వ విషయం ఏది ఉన్నదో, అది ఇంకా కాష్టకు రాలేదు. పెరుగుతూనే ఉంది''అని అర్థం.[2]

ఈ జనాభా పెరుగుదల పద్ధతులను పరిశీలించి డెమాగ్రాఫర్లు ఇది ఏ ప్రాంతాలలో ఎట్లా పెరుగుతున్నదీ మదింపుచేసి, ప్రపంచాన్ని ఆ యా విభాగాలుగా మనసా విభాగం చేశారు. ఇందులో ఒక విచిత్రంకూడా వుంది. ప్రపంచం అన్ని ప్రాంతాలలోనూ జనాభా పెరుగుతున్నా, అట్లా పెరుగుదలలేని ప్రాంతాలు కొన్ని ఉన్నాయి. ఆ ప్రాంతాలు ఈ విభజన క్రిందికి రావడంలేదు. అవి పసిఫిక్ మహా సముద్రంలో వున్న కొన్ని ప్రాంతాలు· ప్రస్తుతం ప్రపంచ జనాభా వివిధ ప్రాంతాలలోను 1 శాతం రేటు మొదలు 1.8 శాతం రేటు పద్ధతిలో పెరుగుతున్నది. రష్యాలోని ఆసియా ప్రాంతాలను వదిలి తక్కిన సర్వమైన ఆసియాఖండంలో ఇప్పుడు జనాభా పెరుగుదల రేటు సగటున ఒక్క శాతంగావుంది. ప్రపంచం జనాభా అంతనూ లెక్కకట్టి ఈ పెరుగుదల రేటును కడితే, అది సగటున 1.2 శాతంగా ఉంటున్నది. ఐరోపాలో యీ రేటు 1.1 శాతం; అమెరికాలో ఒక్కచోట 1.8 శాతంగా ఉంది. కాని పైన పేర్కొన్న పసిఫిక్ ద్వీపాలలో మాత్రం ఈ పెరుగుదల ఒక్క శాతానికి మించిపోవడంలేదు.

సోతే ఈ జనాభా పెరుగుదల పద్ధతులు ఆధారంగా చేసుకొని వారెన్ ఎస్.థాంప్సన్ అనే ఆయన ప్రపంచాన్ని ఈ దృష్ట్యా మూడు భాగాలు చేశారు. కాని ఇటీవల సమితి తాలూకు జనాభా విభాగంవారు ప్రపంచాన్ని ఐదు భాగాలుచేసి ఈ జనాభా పెరుగుదల రేటు పరిశీలనం జరపడం బాగుంటుందని తేల్చారు. సమితి జనాభా విభాగంవారు చెప్పిన విభాగం ఈవిధంగా వుంది. 1. జననపు రేటు, మరణంరేటు అధికంగా ఉన్న ప్రదేశాలు. 2. జననం రేట్లు అధికంగాఉండి, మరణంరేట్లు తగ్గుముఖం పట్టిన ప్రాంతాలు, 3. జననంరేట్లు అధికంగా ఉండి మరణం రేట్లు బాగా తగ్గిన చోట్లు 4. జననంరేటు తగ్గుతూ, మరణంరేట్లు బాగా తగ్గిఉన్నచోట్లు 5. జననంరేట్లు, మరణం రేట్లుబాగా తగ్గిఉంటున్నదేశాలు. అయితే వారెన్ థాంప్సన్ విభాగం ఇందుకు కొంత భిన్నంగావుంది. ఆయన ఈ జనాభా అభివృద్ధికి సంబంధించిన వ్యవహారాన్ని మూడు విభాగాలుగా చేశారు. అసలు ఈ పద్ధతి ప్రకారం ఆలోచించిన ప్రథముడు ఆయనే. ఈ విషయాన్ని ఫ్రాంక్ నోటెన్‌స్టీన్ ''The population of the world in the year 2000'' అన్న పత్రంలో వివరించారు. ఇప్పుడు నోటెన్‌స్టీన్ పెట్టిన పేర్లతో థాంప్సన్ ఈ విభాగాలను వివరించలేదు. ఈ విష యాన్నిగూర్చి నోటెన్‌స్టీన్ తమ పత్రం అధోజ్ఞాపికలో ఇట్లా వ్రాశారు. ''థాంప్సన్ యీమూడు విభాగాలను గూర్చిన్నీ వేరు వేరు నామధేయాలు వాటికివుంచి వ్యాఖ్యానించారు. Plenty of People అన్న గ్రంథంలో ఈ మూడు విభాగాలను గురించిన చర్చా వుంది. ఈ

2. The past and future population of the world.

పుస్తకాన్ని థాంప్సన్ 1944 లో ప్రకటించారు. అంతకుముందు 1929 లో శ్రీ థాంప్సన్ ఒకపత్రాన్ని ప్రకటించారు. అది "అమెరికన్ జర్నల్ ఆఫ్ సోషియాలజీ" లో ప్రచురితమైంది. నేను దాన్ని చూడలేదు. అందులో కూడా థాంప్సన్ తాను తన "ప్లెంటీ ఆఫ్ పీపుల్"లో వాడిన పేర్లనే ఆ తన జనాభా మదింపు విభాగాలకు వాడారు."

నోటెస్‌స్టీన్ చేసిన విభాగ పద్ధతి ప్రకారం జనాభా అభివృద్ధికి సంబంధించి ప్రపంచంలోని రాజ్యాలు మూడు విధాలుగా చెప్పబడినాయి. ఒక విధం ప్రాంతాలను ఆయన The regions of incipient Population decline అని, రెండో విధం రాజ్యాలను The regions of transitional growth అని, మూడో విధం దేశాలను The regions of high growth potential అని అన్నారు. ఇప్పుడు క్రమంగా ఆ ప్రాంతాల లక్షణాలు ఏమిటో వివరించవలసిన అవసరంవుంది. వీనిలో మొదటివిధం ప్రాంతాలలో జనాభా పెరుగుదల ఇప్పు డిప్పుడే తగ్గడం ప్రారంభం అవుతున్నది. ఒకప్పుడు అధిక ప్రజనన పద్ధతికల్గి, మరణసంఖ్య తక్కువగావుండి, ఇప్పుడు అల్ప ప్రజనన పద్ధతితోపాటు మరణసంఖ్య కూడా అల్పమైన స్థితిలోవున్న ప్రాంతాలను ఈ పారిభాషిక పదంతో నోటెస్‌స్టీన్ నిర్దేశించారు. ఇప్పుడు ఈరకం దేశాలలో ప్రవర్తిల్లుతున్న ప్రజనన సంఖ్యను అదే రేటులో వుంచుకోగల్గితే, లేక ఆ రేటును దాటిపోకుండా చూచుకోగల్గితే, అప్పుడు ఆ ప్రాంతాల జనసంఖ్య హెచ్చుతగ్గులులేక, వున్నది వున్నట్లుగావుండే స్థితి ఏర్పడుతుంది. దీనికితోడు ఇట్టి ప్రాంతాలు అన్ని విధాలుగా అభివృద్ధి చెందినవి కావడం మూలంగా ప్రజనన వ్యాపారాన్ని నియమించుకొనడం మొదలైన అధునాతన ప్రక్రియలు గూడా అధికంగా ప్రచారంలో ఉంటాయి. జనాభా పెరుగుదల, మరణముల క్రమము కూడా ఇచ్చట క్రమబద్ధం అవుతున్నది. మరణ సంఖ్య, జననసంఖ్య కూడా తగ్గిపోయి వుంటున్న పరిస్థితి ఏర్పడినప్పుడు అక్కడ సగటునవయః ప్రమాణం అధికంగావున్న జనం అధికులు వుంటారు. ప్రపంచంలో ఇటువంటి ప్రాంతాలు ఉత్తర ఐరోపాలో, పశ్చిమ ఐరోపాలో, అమెరికాలో వున్నాయని, ఆస్ట్రేలియా, న్యూజిలాండు కూడా ఇటువంటివేనని దక్షిణ ఐరోపా దేశాలను కూడా ఈ రకం ప్రాంతాల క్రింద చేర్చవచ్చునుగాని, అందుకు ఇది ప్రశస్తమైన ఉదాహరణం కాజాలవని నోటెస్‌స్టీన్ వ్రాశాడు.

నోటెస్‌స్టీన్ Transitional growth గల ప్రాంతాలుగా విభాగించిన వానిని మనం పరివర్తన దశలోవున్న వానినిగా చెప్పుకోవచ్చు. ఈ ప్రాంతాలు ఎటువంటివంటే, ఇవి తమ పూర్వపు వెనుకబాటును త్రోసి, అధునాతనము, శాస్త్ర యుక్తము అయిన అభివృద్ధిని సాధించుకుంటున్నాయి. ఆ అభివృద్ధివలన మొత్తం సమాజం పరివర్తనం చెందుతున్నది. ఆ పరిస్థితి కొనసాగుతూ ఉన్నప్పుడు శిశు జనన సంఖ్య తగ్గుతూ వస్తుంది. అదేవిధంగా మరణాల సంఖ్య కూడా తగ్గుముఖం పడుతుంది. ఈరేట్లు ఏవిధంగా తగ్గుతూ ఉంటాయి అంటే, జనాభా పెరుగుదల ఉన్నమితంగా కొనసాగడానికి వీలులేనివిధంగా వుంటాయి. తూర్పు ఐరోపా, రష్యా, జపాను, దక్షిణ అమెరికాలో కొన్ని భాగాలు ఇటువంటి పరివర్తన దశలో ఉన్నట్లు నోటెస్‌స్టీన్ అంటాడు.

ఇటువంటి పరివర్తన దశాంతస్థితాలైన ప్రాంతాలలో కొన్ని ప్రత్యేకమైన లక్షణాలు గోచరం అవుతున్నాయి. నోటెస్‌స్టీన్ వానిని తన పత్రంలో వివరించిఉన్నాడు. దాని ప్రకారం యీరకం ప్రాంతాలలో జనాభా ఇంకా వ్యవసాయంమీదనే ఆధారపడివుంటూవుంటుంది. కాని పరిశ్రమలు పెరుగుతూ వుంటాయి. పట్టణాలు అభివృద్ధిచెందుతూవుంటాయి. పట్టణ సంబంధమైన, నగర సంబంధమైన అధునాతనమైన నాగరికత వ్యాప్తిలోకి వస్తూవుంటుంది. విద్య, సాంకేతికప్రజ్ఞ చెప్పుకోతగినంతగా ఉండకపోయినా, నాటి నాటికి అభివృద్ధి చెందుతూ వుంటాయి. ప్రజల స్థితి మరీ అధ్వాన్నంగానూ ఉండదు; మరీ ఉన్నతం

గానూ ఉండదు. ఇటువంటి దేశాలలో అధిక సంఖ్యాక మైన కుటుంబాలలో వ్యావసాయక జీవనము, వ్యావసాయక సభ్యత ఇంకా పూర్తిగా తగ్గుముఖం పట్టని కారణంచేత ప్రజనన వ్యవహారం మామూలు సంప్రదాయపు టాలోచనలకు ఇంకా పూర్తిగా దూరంకాదు.కాని పరిసరాల ప్రభావంవలన, పెరుగుతూ వస్తున్న పట్టణ నాగరికతవలన, మతంయొక్క ప్రాబల్యం తగ్గుతూ ఐహిక సుఖభావ సంపత్తి అధికం అవుతూ ఉన్నందువలన జనంలో సంతాన నిరోధవాంఛ అధికం అవుతూ వస్తుంది. మరణసంఖ్య తగ్గుతూ ఉంటుంది. అయితే మరణసంఖ్యకంటే, జననసంఖ్య ఇంకా అధికంగానే వుంటుంది. ఇటువంటి పరిస్థితి ఉన్నచోట ప్రభుత్వం తన విధానాలద్వారా యీ పరివర్తన వ్యవధిని పొడిగించి, ఈ జనన మరణాల రేట్లను మార్చగల స్థితిలో వుంటుంది. ఇక్కడ యీ పరివర్తన దశలో కూడా రాజకీయ సంబంధమైన వ్యవస్థలు తీవ్రమైన పద్ధతులను అనుసరిస్తేనేగాని, జనాభా పెరుగుదలను అనుకున్నట్లు అరికట్టడం సాధ్యంకాదు.

పోతే ఇప్పటికి, క్రీ. శ. 2000 వచ్చేనాటికి ఇటువంటి ప్రాంతాలలో జనాభా పెరుగుదల రేటు ఒక శాతం చొప్పున కన్నను అధికంకాక పోవచ్చునని నోటెన్‌స్టీన్ అంటారు.

నోటెన్‌స్టీన్ పేర్కొన్న మూడో ప్రాంతం అతి విశాలమైంది. జనాభా పెరుగుదల విషయంలో గూడా ఈ ప్రాంతం విశిష్టమైంది. విచిత్రమైంది. ఈ ప్రాంతాలన్నీ ఒక పద్ధతి కలవికావు. జననముల సంఖ్య తగ్గుముఖంపట్టే లక్షణాలేమీ ఇచ్చట, యీ ప్రాంతాలలో ఇంతవరకు గోచరం కావడంలేదు. అందుకే నోటెన్‌స్టీన్ యీ ప్రాంతాలను Regions of high growth potential అన్నాడు. ఇటువంటి ప్రాంతాలలో జననసంఖ్య అధికంగా ఉంటున్న విధంగానే మరణసంఖ్య గూడా అధికంగా ఉంటుంది. అయితే పైన పేర్కొన్నట్లు ఈ నిర్వచనం క్రిందకువచ్చే దేశాలన్నీ ఏకాకారంకలవికావు. అనగా యీ దేశాల అభివృద్ధి దశా విశేషము, సభ్యత, ఆర్థికమైన స్థితిగతులు, సమాజధర్మము, రాజ్యాంగపద్ధతి ఒక్కతీరుగావుండవు. ఈ దేశాలలో కొన్నింటి జనాభా అధికంగా ఆకలేకుండా పెరిగిపోతూ వుంటుంది. మరి కొన్ని దేశాలలో అంత ఇదిగా ఉండదు. ఇంకా కొన్ని దేశాలలో ప్రజననసంఖ్య తగ్గుతూ కూడా ఉండవచ్చు. ఏమైనా జననసంఖ్యమాత్రం అధికంగానే వుంటుంది. మార్పులకు ఒక పట్టున భాజనంకాదు. ప్రపంచంలో సగానికిపైగా దేశాలు యీజాబితాక్రిందకే వస్తాయి.

నోటెన్‌స్టీన్ తన పత్రంలో యీ దేశాలు ఏవో కూడా పేర్కొన్నాడు. ఒక్క జపాను మినహా తక్కిన ఆసియా అంతా ఈ తరగతిలోకే వస్తుంది. దక్షిణ ఆఫ్రికాను మినహాయించి తక్కిన ఆఫ్రికా దేశాలన్నింటికి యీ నిర్వచనమే పడుతుంది. దక్షిణ అమెరికా దేశాలు, మధ్య ప్రాచ్య దేశాలు కూడా ఇటువంటివే. ఈ దేశాలలో కొన్నింటి జనాభా అంత సాంద్రంగా ఉండదు. ఇట్టివి దక్షిణ అమెరికా దేశాలు, బోర్నియో, సుమత్రా, న్యూగినీ, ఆఫ్రికా, మధ్య ప్రాచ్యం అని నోటెన్‌స్టీన్ పేర్కొన్నాడు. ఇటువంటి దేశాలలో కూడా అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతూ ఆర్థికాభివృద్ధి త్వరితగతిని కొనసాగుతున్నప్పుడు, జనాభా కూడా త్వరితగతినే పెరుగుతూ వుంటుంది. ఇందుకు దక్షిణ అమెరికా దేశాలను ఉదాహరణగా తీసుకోవచ్చు. ఈ విషయాన్ని ప్రపంచ ఆహారసంస్థవారు కూడా చెబుతున్నారు. ఇందుకు కారణాలు ఉన్నాయి. అభివృద్ధి అంటూ జరుగుతున్నప్పుడు, ఆరోగ్య కార్యక్రమాలు విధిగా అమలు జరుపబడతాయి. అంటు వ్యాధులు నివారింపబడటము జరుగుతుంది. అంతకుముందు ప్రజలను పట్టి పల్లార్చుస్తున్న జాడ్యాలు ఎన్నో అదుపులోనికి తీసుకొని రాబడటము, సమూలము నివారింపబడటము జరుగుతుంది. ఈ కారణంచేత మరణసంఖ్యలు తగ్గడము, జనాభా పెరుగడము సంభవం అవుతుంది. అనగా

ఇక్కడ జరిగే పని ఇది. మరణముల సంఖ్య తగ్గుతున్నట్టుగా జననముల సంఖ్య తగ్గదు. ఇందుకు ఆర్థికాలైన కారణాలేగాక, సామాజికములైన రాజకీయమైన కారణాలుకూడా తోడవుతూవుంటాయి. అభివృద్ధి వలన ఏ మార్పువస్తుందో, ఆ మార్పు త్వరిత గతిని తన ప్రభావాన్ని ప్రజనన సమస్యలపై చూపలేకపోతుంది. ఇందుకు మతము, ఆచారాలు కూడా ఆ యా దేశాలలో కారణాలు కావడంవుంది. కేథలిక్కులు అధికంగావున్నచోట కుటుంబ నియంత్రణం పెద్ద సమస్య అయిపోతున్నది. ఇటువంటి అనేక కారణాలవలన మరణసంఖ్య తరిగినట్లు, ఈరకం దేశాలలో జననాల సంఖ్యతగ్గదు. అందుకు కాలం పడుతుంది.

ఇప్పుడు దక్షిణ అమెరికాఖండంలోని దేశాలు ఉన్నాయంటే, ఆ దేశాల జనాభా సమస్యకు భారత దేశం, చైనాలవంటి దేశాల జనాభా సమస్యలకు కొంత తేడావుంది. దక్షిణ అమెరికా ఖండపు దేశాలలో జనాభా పెరుగుదల అధికంగావున్నా, ఆ జనాభా పెరుగుదలను తట్టుకోగలవిధంగా సహజ సంపదలు ఉన్నాయి. ఈ దేశాలలో ప్రధానమైన సమస్య పెట్టుబడులకు సంబంధించింది. ఒకవేళ పెట్టుబడివున్నా, దాన్ని అభివృద్ధి పనులకుగాను వినియోగించి నిర్వహించగల సాంకేతిక నైపుణ్యం లేకపోవడంవల్ల కూడా జనాభా సమస్య ఒక్క పఠాన తేలక బాధపెడుతూ ఉంటుంది. రష్యా వంటి అభివృద్ధి చెందిన దేశానికే యీ బాధ తప్పలేదు. ఆ దేశంలో జనాభా పెరుగుదలకు, జనానికి కావలసిన ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరుగుదలకు ఆట్టే తేడా లేదు. అందువల్ల సాధించిన అభివృద్ధి ఎందునా కొరగానట్లయి, ఆ దేశం ఇతర దేశాలనుంచి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవలసిన పరిస్థితిలో పడిపోయింది.

ఇట్లా అభివృద్ధి చెందివున్న దేశాలలో యీ సంగతి యీవిధంగాఉంటున్నప్పుడు,అభివృద్ధి చెందుతూ వున్న దేశాల సంగతి వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఈ దేశాలలో నూతన భావాలు తొందరగా ప్రజలలోకి ఎక్కవు. విద్యావ్యాప్తి జరిగి వారిలో పరిస్థితులను గురించిన ఆకళింపు కల్గేనాటికి చాలాకాలం పడుతుంది. భారతదేశంవంటి దేశాన్ని తీసుకుచూస్తే, ఇచ్చట ఆదికాలంనుంచీ కూడా ప్రజనన కార్యం ఒక పుణ్యంగా భావించబడుతూ వచ్చింది. "ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" ధర్మం విధించబడివుంది. ఒక మనిషి గృహమేధి ఎందుకుకావడంఅంటే సంతానం కోసమేనన్న భావాన్ని ఎప్పటినుంచో ప్రచారంలో పెట్టి ఉంచారు. ఇటువంటి భావజాలంలో సంలగ్నమైపోయిన మనస్సులు ఆ వలలను వదల్చుకొని బయట పడలేవు. దీనికితోడు దేశం ఇంకా వ్యావసాయికమైనదైనందువల్ల, సన్నకారు రైతులు, అసలు భూములు లేనివారు అధికులుగా ఉన్నందువల్ల, సంతానాభివృద్ధి, అన్నది ఈ రకం జనానికి ఆర్థిక సంబంధమైన విషయం కూడా అయిపోతుంది. ఒక్క చేతిమీద సంసారాన్ని నడపడం అన్నచోట ఇంకో చేయివచ్చి ఆదుకుంటే బాగుంటుందన్నది ఇక్కడ సిద్ధాంతం. పిల్లలు చేతికి అందడం అంటే, సంపాయించిపెట్టే స్థితిలో ఆ పిల్లలు పడినారని అర్థం. భారత దేశంవంటి దేశాలలో జనాభా పెరుగుదలను నిరోధించడానికి ఇట్లా కొన్ని అవరోధాలు ప్రతిబంధకాలు ఉన్నాయి.

ఇక్కడ ఇంకో విషయం కూడా వుంది. యిరోపాలోని కొన్ని దేశాలు యుద్ధాలకు గురియైనట్లు భారతదేశం ఎప్పుడూ యుద్ధాలకు గురికాలేదు. యిరోపాలో ఈ శతాబ్దంలో ఇంతవరకు రెండు ప్రపంచ యుద్ధాలు నడిచాయి. అందువల్ల ఆ దేశాలలో జనాభా చాలా నష్టమైంది. భారతదేశం అటువంటి అవస్థను ఎదుర్కోవలసిన స్థితి అప్పుడు లేకపోయింది. రెండో ప్రపంచయుద్ధం తర్వాత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. స్థిరమైన ప్రభుత్వం ఏర్పడింది. దేశంలో అభివృద్ధి నిమిత్తం ఏవో పనులు జరుగుతూనే ఉన్నాయి. పూర్వంకన్నా వైద్య సౌకర్యాలు మొదలైనవి అధిక

మైనాయి. అంటువ్యాధుల నిర్మూలనకు పెద్దఎత్తున కృషి జరిగింది. పరిస్థితులు ఇట్లా ఉన్నప్పుడు, జనాభా పెరుగుదలను అరికట్టేందుకు శక్తివంతమైన మార్గాలు లేనప్పుడు జనాభా పెరుగుదల విధిగా అధికంగా ఉంటుంది.

భారతదేశం జనాభా (పాకిస్తాన్‌తో) సహా క్రీ. శ. 1600 లో 10 కోట్లు మాత్రంగా ఉన్నట్లు అంచనా. ఆ తర్వాత 1800 లోగాని తిరిగి ఆరా లభించలేదు. 1850 లో ఈ జనాభా 20 కోట్లుగా ఉన్నట్లు డెమోగ్రాఫర్లు అంచనాలు వేస్తున్నారు.అంటే దాదాపు 250 సంవత్సరాలలో భారతదేశం జనాభా (పాకిస్తాన్‌తో సహా) రెట్టింపు అయింది. ఆ తర్వాత నడిచిన 50 సంవత్సరాలలోను ఈ జనాభా 8 కోట్లు పెరిగింది. ఇక్కడ గ్రహించవలసిన విషయం ఒకటి వుంది. క్రీ. శ. 1600 నుంచి క్రీ. శ. 1850 దాకా జనాభా 10 కోట్లనుంచి 20 కోట్లకు పెరిగితే, క్రీ. శ. 1850 నుంచి 1900 దాకా నడిచిన 50 సంవత్సరాలలోను 8 కోట్లు పెరిగింది. 16 వ శతాబ్దం అంతనుంచి, 19 శతాబ్దం సగంభాగం నడిచేలోగా భారత ఉపఖండంలో 10 కోట్లు పెరిగిన జనాభా, 1850 నుంచి 1900 మధ్య నడిచిన కాలంలో 8 కోట్లు పెరిగింది. అదేవిధంగా 1900 తర్వాత నడిచిన 20 సంవత్సరాలలోను తిరిగి జనాభా 28 కోట్లనుంచి 30 కోట్ల 50 లక్షల దాకా వెళ్లింది. ఇక్కడ యీ 20 సంవత్సరాలలోను జనాభా పెరుగుదల 2 కోట్ల 50 లక్షలు మాత్రమే. 1940 లో తిరిగి భారత ఉపఖండం జనాభా ఏవిధంగా ఉన్నదీ చూస్తే తెలిసే విషయం ఇది. 1940 లో ఈ ఉపఖండం జనాభా మొత్తం 38 కోట్లు 50 లక్షలు.అంటే 1920—1940 సంవత్సరాలమధ్య నడిచిన 20 సంవత్సరాల లోను ఈ ఉపఖండం జనాభా 30 కోట్ల 50 లక్షలు నుండి 38 కోట్ల 50 లక్షలకు పెరిగింది. ఈ 20 సంవత్సరాలమీదను జనాభా పెరుగుదల 8 కోట్ల 50 లక్షలు. అంటే సంవత్సరానికి 40 లక్షల చొప్పున ఈ జనాభా ఆ రెండు సంవత్సరాల నడుమునే పెరుగుతూ వచ్చింది.

ఇంతవరకు భారతదేశం విభక్తంలేదు. కాబట్టి ఈ జనాభా పెరుగుదల ఇంతవరకు భారతదేశం పాకిస్తాన్‌లకు సంబంధించింది. తర్వాత 1950 లో జనాభా లెక్కలు తయారైనాయి. ఈ లెక్కలు ఒక్క భారతదేశానికి మాత్రమే సంబంధించినవి వాని ప్రకారం భారతదేశం జనాభా 42 కోట్లు. ఈ కాలంలో జనాభా పెరుగుదల పద్ధతి వేరుగామదింపు చేయవలసి వుంటుంది. ఏమైనా 1940—1950ల మధ్యజనాభాపెరుగుదల 4, 5 కోట్లకుమించి ఉండక పోవచ్చు.

ఇట్లా 1600 నుంచి చూచుకుంటూవస్తే భారత ఉపఖండమూ, లేక భారతదేశము జనాభా ఒక పద్ధతిలో పెరిగినట్లు కన్పించదు. కొంతకాలం ఒక రేటు చొప్పున, మరికొంతకాలం ఇంకో రేటు చొప్పున పెరుగుతూ వచ్చింది. ఇచ్చట జనాభా పెరుగుదల నిలకడగా ఉండటం అన్నదిలేదు. ఇంకా పెరుగుతూనేవుంది. ఇప్పుడు మనదేశంలో 1000 కి 40 చొప్పున జనాభా పెరుగుతున్నదని కొందరు అంటున్నారు. కాని ప్రపంచంలో ప్రసిద్ధులైన డెమోగ్రాఫర్లు యీ లెక్కను అంతగా విశ్వసించడంలేదు. ఈ పెరుగుదల ఇంకా ఎక్కువగా ఉండి ఉంటుం దని వారి భావన.

కొంతమంది ఈ జనాభా పెరుగుదలనుగురించి ఇట్లా వాదిస్తూవుంటారు. మన దేశంలో జనాభా పెరుగుదల రేటుతో దీటైన పెరుగుదల రేటు గల దేశాలు ఇంకా ఉన్నాయి. అందువల్ల ఈ జనాభా పెరుగుదల అన్నది మన దేశం ఒక్కదేశం ముఖానే వ్రాసిలేదు. కాబట్టి దీనినిగూర్చి చింత ఎందుకు? అన్న ధోరణిలో ఈ వాదం నడుస్తుంది.

ఇటువంటివాదం ఇప్పుడేకాదు; పూర్వం కూడా ఇదేవిధంగా విన్పిస్తూ వుండేది. కాని యీరకం

వాదంలో సారంలేదు. ఎందుచేతనంటే మనం ఏ దేశాలతో మన దేశాన్ని యీ విషయంలో పోల్చి చెప్పుకుంటూవుంటామో, ఆ దేశాలు మనకన్నా ఎక్కువ సహజ సంపదలు కలవి, పారిశ్రామికంగా అభివృద్ధి చెందినవీ అయివుండటమే ఇందుకు కారణం. ప్రపంచంలో మనతో యీ జనాభా పెరుగుదల విషయంలో పోల్చదగిన రాజ్యాలు ప్రధానంగా కొన్నే ఉన్నాయి. వానిలో చైనా, కొరియా, ఫార్మోజా మొదలైన వాటిని ముఖ్యంగా పేర్కొనవచ్చు. ఈ దేశాలలో చైనా మనం ఎదుర్కొంటున్నటువంటి సమస్యలనే ఎదుర్కొంటున్నా, ఆ దేశం ఎక్కువ వైశాల్యం కల్గింది, ఎక్కువ సహజసంపదలు కల్గింది అన్న విషయం ఒకటి వుంది.

పరిశ్రమలు అభివృద్ధిచెందుతూవున్న కొద్దీ జనాభా సమస్య తేలిక పడుతుందన్న వాదం ఇంకొకటివుంది. జనాభా తక్కువగావున్న దేశాలలో ఈ వాదం కొంత వరకు చెల్లవచ్చు. కాని అక్కడకూడా చెల్లుతున్నట్లు కన్పించదు. రష్యా ఒక ఉదాహరణం. అమెరికాకు కూడా యీ జనాభా సమస్య లేకపోలేదని డా|| చంద్రశేఖర్ ఇటీవల అమెరికాలో ఒకచోట మాట్లాడుతూ అన్నారు.

జనాభా పెరుగుదలకు దేశంలో జననపురేటు, మరణపు రేట్లకు సన్నిహిత సంబంధంవుంది. జననాలు అధికము, మరణాలు తక్కువ అయితే జనాభా పెరుగుతుంది. ఏ దేశంలోనైనాసరే పరిస్థితులు మామూలుగా ఉన్నప్పుడు 1000 కి 40 జననాలు పెద్ద విషయం కాదని, అది మామూలు విషయమని ప్రొఫెసర్ టాసిగ్ ఎప్పుడో అన్నారు. ఆయన వాడిన మాట—Normally constituted population—అని. ఆ జనాభా అట్లా వున్నప్పుడు 1000 కి 40 జననాలు అయితే ఇబ్బందిలేదు. మరి ఆ జనాభా—Normally constituted—కానప్పుడు 40 చొప్పున పెరుగుదల కూడా అధికమే అవుతుంది. ఇప్పుడు భారతదేశం జనాభా పెరుగుదల విషయంలో ఎదుర్కొంటున్న ప్రధానమైన సమస్యే ఇది.

ఒకప్పుడు మన ఆర్థికవేత్తలు జనాభా సమస్యలను గూర్చి ఆలోచన చేసినప్పుడు భారతదేశంలో జననాలు ఎట్లాఎక్కువో, మరణాలు అట్లానే ఎక్కువ గనుక, మొత్తంజనాభా లెక్కకువచ్చేజనంతక్కువగానే ఉంటుందని అంటూ ఉండేవారు. వారు అట్లా అనిన రోజుల్లో పరిస్థితికూడా అట్లాగే ఉండేది. కాని ఇప్పుడు ఆ పరిస్థితులలో ఎంతో మార్పు వచ్చింది. ఈ విషయం పైన పేర్కొనడం జరిగేవుంది. దేశం అభివృద్ధి చెందుతూ ఉండగా, ప్రజలకు సౌకర్యాలు కల్పన అవుతూవుండగా, ప్రజల ఆరోగ్యాదికమైన విషయాలలో శ్రద్ధ అధికం అవుతూవుండగా, మరణముల సంఖ్య పూర్వంకన్నా తగ్గుతున్నది. జననముల సంఖ్య పెరుగుతున్నది. ఇతర దేశాలతో పోల్చి చూచుకుంటే, ఈ మరణములసంఖ్య అధికమే కావచ్చు. కాని మన దేశంలో పరిస్థితులతో పోల్చుకుచూచుకుంటే తక్కువే. ఆ కారణంచేత, ఇప్పటి పరిస్థితిమారి, మొత్తం జనాభాలో కొత్తగా లెక్కకు వచ్చే జనం సంఖ్య అధికం అవుతున్నది. అందుచేతనే దేశంలో కుటుంబ నియంత్రణం మొదలైన సిద్ధాంతాలు ప్రచారంలోకి వస్తున్నాయి. జననముల సంఖ్య హెచ్చుగా ఉండటానికి ఏవి, ఈ దేశంలో ఉదాహరణకు, 1920 ప్రాంతాలలో చెప్పబడినవో, ఇప్పుడుగూడా దాదాపు అవే కారణాలుగా ఉన్నాయి. అప్పుడు మరణము సంఖ్య అధికంగా ఉండటానికి ఏవి కారణాలు చెప్పబడివున్నవో అవి ఇప్పుడు కొంతకు కొంత సర్దుకుంటున్నాయి. కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొంది ఆర్థికమైన అభివృద్ధిని సాధించడానికి పూనుకున్న దేశాలు అన్నింటిలోను దాదాపు పరిస్థితులు ఇదేవిధంగా ఉన్నాయి. అయితే భారతదేశం, చైనాలవంటి దేశాల విశిష్టత ఏమంటే, ఈ రెండు దేశాలున్నూ, జనాభా అధికంగా పెరిగే లక్షణంగల ప్రాంతాలుగా ఉన్నాయి.

## లేఖలు :

# సమగ్ర ఆంధ్ర సాహిత్యము

ఆర్యా !

భారతి పాఠకులలో నేనొకడను. ఇంతకాలానికి 66 ఫిబ్రవరినెల భారతిలో 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'' అనే శీర్షికతో శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు వ్రాస్తున్న వ్యాసమందలి ఒక పద్యం నన్నెంతో ఆకర్షించింది. అదేమిటన శేషనాథుడు తెలుగుసంస్కృత భాషావిశిష్టతలనుగూర్చి చెప్పిన పూర్తిపద్యాన్ని యిందులో వుదహరించారు. ఆ పద్యాన్ని చదివినప్పుడు నేనెంతో ఆనందించి వారికి నా హృదయ పూర్వక నమస్కృతుల నందించదలచితిని. ఆపద్యం క్రింద నుదహరిస్తాను.

''జనని సమస్త భాషలకు
సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థ గౌరవ వికాసి
తెనుంగభిరమ్యమంతకున్
గనుంగొనఁ జాత బీజమునకం టెను
కోమల పత్ర పుష్ప శో
భన మృదు పల్లవాభినవరమ్య
రసాలము సొంపు నింపదే.

ఇందులో నాల్గవపాదం యతి తప్పని తలంచు చుంటిని. అసలు పాఠాంతరం అదేనా? లేక ''శోభనమృదు పల్లవాభినవ భవ్య రసాలము సొంపు నింపదే'' అనియా; ఒకవేళ 'అభినవ భవ్య' అయితే ''అభినవ రమ్య రసాలము'' అన్నంత నిండుతనం లేదను కుంటాను.

ఏది ఎలాగున్నా అసలు పాఠాంతరం తప్పక తెలియజేస్తారని ఆశిస్తాను. ఇంతగా ఎందుకు కోరవలసివచ్చినదంటే అది కంఠస్తం చేయదగిన పద్యం. అందుకని మిమ్ముల నింతగా ప్రార్థిస్తున్నాను.

— ఉల్లి రామసుబ్బయ్య.

## ఓడ్యాణ దేశము

ఆర్యా !

మార్చినెల (1966) భారతిలో కలగూరగంప శీర్షికక్రింద 'నాంధ్రదేశమునకు ఓడ్యాణ దేశమని పేరున్నదా?' యను విషయముపై శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి వ్యాసమును చూచితిని. బౌద్ధ యాత్రికుడు ఫాహియాన్ వ్రాతల ప్రకారము భారతదేశములో ధాన్య కటక సమీపప్రాంతమునకు 'ఉడ్డియాన దేశము' అని పేరున్నట్లు 1956 డిశంబరు భారతిలో శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసినట్లు ఆ వ్యాసములో నుదహరించి నారు. శ్రీకాకుళముజిల్లాలో సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాల పొడవునగల సముద్రతీరప్రాంత జనపద ముల నన్నిటిని ప్రజలు నేడును 'ఉద్దాన'మనిపిలుచు చుంటారు. ఓడ్యాణమన్నపేరు జన సామాన్యమునోట నానాటికి 'ఉద్దాన'ముగ మారియుండవచ్చునని నా యనుమానము. కొన్నాళ్ళక్రిందట భారతిలో పుస్తక సమీక్షలో శ్రీకాకుళముజిల్లాకు చెందిన కవిగారొకరు ఆ 'ఉద్దాన' ప్రాంతమునే 'ఉద్యానము'గా సంస్కరించి కావ్యమునుగూడ వ్రాసినట్లు చదివితిని. ధాన్య కటక మనగా ఒరిస్సాలోనున్న 'కటక్' అగునెడల నిప్పటి 'ఉద్దాన' ప్రాంతమే యప్పటి ఓడ్యాణదేశమని చెప్పుటకు వీలున్నదికదా. ఈ యుత్తరమును వ్రాయుటలో నా యుద్దేశము శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

గారి వ్యాసమును పూర్వపక్షముచేయుట మాత్రము గాదు. నేను చారిత్రిక విషయములను పరిశోధించువాడనుగాను. శ్రీకాకుళముజిల్లా మా స్వంతజిల్లా యగుటచే ప్రస్తుతము ఆ ప్రాంతము 'ఉద్దాన'మని వ్యవహరింపబడుచుండుటచే నీ విషయమును జిజ్ఞాసుల దృష్టికి తీసికొనివచ్చిన యెడల 'ఓడ్యాణదేశ'పు టునికిని గురించి వారు చేయు ప్రయత్నమునకు ఇది సహాయకారి కాగలదను తలంపుతో మాత్రమే.

—పుట్టా మురళీరావు.

## ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్ధత

ఆర్యా!

మార్చి 1966 భారతిలో శ్రీ పరిగి రాధాకృష్ణగారు ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్దత అన్న విషయంపైన వ్రాసిన లేఖ చూచాను.

నేను 1965 డిశంబరు భారతిలో ఇదే విషయంపై వ్రాస్తూ శాస్త్రకారులమీద ఏవేవో అయోగ్యమైన ఆరోపణలు చేశాననీ, గుండెలు బాదుకున్నాననీ శ్రీ పరిగి రాధాకృష్ణగారు వ్రాశారు. సామరస్య వైఖరి ఉండాలనీ—సహనం ఉండాలనీ వారు వ్రాయడం బాగానే ఉన్నది. కాని ఈ రెండు గుణాలే శ్రీ రాధాకృష్ణగారి లేఖలో లోపించాయి. ఆయన దృష్టిలో నచ్చని అభిప్రాయాలు విమర్శించవచ్చు—కాని ''గుండెలు బాదుకోవడం''—''సంకుచితమనోభావాలు'' ఎందుకు? ఈ మాటలను బట్టేఅసహనం—సామరస్య వైఖరి లేకపోవడం శ్రీ రాధాకృష్ణగారి స్వార్జితాలని తేలిపోతున్నది. అసలు గుండెలు బాదుకున్నదీ వారే కాని నేను కాదు. నాకది చేతకాదు. ''కీర్తి కండూతి'' కూడా వారికి జాస్తిగా ఉన్నదన్నమాట. గుప్తనామంతో వ్రాస్తున్నవాళ్లకు 'కండూతి' ఉన్నదని భావించడం అసందర్భంగావుంది. కీర్తి కావాలంటే అసలు పేరు పెట్టుకోవాలి! మారుపేరుతో రాదు. అసలు కీర్తి కావాలనుకుంటేమాత్రం తప్పేమున్నది!

రచనల్ని విమర్శించనక్కరలేదనీ, కాలమే తేలుస్తుందని శ్రీ రాధాకృష్ణగారు అన్నమాట లోకానుకూలంగాలేవు. రచన అంటూ ఉన్నప్పుడు విమర్శవుంది. రచనే ఒక విమర్శ. విమర్శే అక్కరలేదనే సాహసానికి ఎవ్వరూ ఒడికట్టలేదు. శ్రీ రాధాకృష్ణగారి అభిప్రాయాన్ని మన్నిస్తే—ఆయన వ్రాసిన విమర్శలేఖ కూడా అనుచితమే అవుతుంది. నా విమర్శనను కూడా కాలానికే వదలివేయవచ్చుగా! అయినా అసలు కాలానికి వదలివేయటం అంటే ఏమిటి! కాలం వచ్చి చెబుతుందా! ఈ సందర్భంలో ఇంకా ఏమి వ్రాసినా పునరుక్తిగాను అధికప్రసంగంగాను ఉంటుంది.

ఈ చర్చ జరిగిన ధోరణిని శ్రీ రాధాకృష్ణగారు సరిగా గ్రహించిఉంటే, ఈ అసహనమైన సాహసానికి వచ్చివుండేవారుకాదు. అక్టోబరు 1965 భారతిలో హ. శి. గారు మన రచయితలలో స్తబ్ధతను గురించి వ్రాశారు. అందులో ఆయన తెలుగుదేశంలో ఒక్క మేధావివర్గంలోనేగాక, తక్కిన అన్ని వర్గాలలోను ప్రాదుర్భవించిన చైతన్యముయొక్క దారిద్ర్యానికి గుర్తులుకనపడుతున్నాయనీ,రచయితలు ప్రతిభను చంపుకొని వైక్లబ్యానికి గురిఅయ్యారనీ, ఒక విధమైన జాడ్యస్థితిని భజిస్తున్నారనీ, స్తబ్ధతలో వున్నారనీ—అసలు ఆదినుంచీ తెలుగుభాషకు తర్కమాల గతి పట్టిందని, స్వోపజ్ఞమైన పూహాశాలిత్వం లేకపోయిందనీ వ్రాస్తూ—మొత్తం యావత్తు వాఙ్మయంమీదా, అందరు రచయితలమీద అభియోగం తెచ్చారు. ఈ అభియోగం అంగీకరిస్తే—తెలుగు వాఙ్మయమంతా నాసిరకందేనని ఒప్పుకుంటున్నామన్న మాట. ఈ అభియోగం సరికాదని ప్రథమంగా నేను వ్రాశాను.

అటువంటప్పుడు శాస్త్రకారులమీద అన్న నాలుగు ప్రాసంగిక వచనాలకు బాధ ఎందుకూ? పైగా శాస్త్ర

కారులమీద నాకు ద్వేషంలేదు. ఈమాట నేను చెప్పేవున్నాను. తాము అభ్యసించి పరిశ్రమించిన శాస్త్ర విద్యలను వదిలి సాహిత్యరంగంలో ప్రవేశించడంవల్ల ఈ శాస్త్రకారులు అటు ఆ శాస్త్రానికి, ఇటు సాహిత్యానికీ న్యాయం చేకూర్చలేక పోతున్నారు. ఇదే నేను చెప్పింది—చెప్పదలచింది.

సదుద్దేశాలతో వ్రాసిన వాక్యాలకు కూడా దురభిప్రాయాలు అంటగట్టవచ్చును. వ్రాసినవాళ్ళు ఆ అర్థాలతో వ్రాయలేదని చెప్పినతర్వాత కూడా— ఇంకా వాటినే పట్టుకు వేలాడటం సహృదయత కాదు. సహనమూకాదు. సరసత్వముకాదు. అది యేమో వేరే చెప్పనక్కరలేదు.

తు. రా. (శ్రీ పాదుక.)

# సమాధానము

ఆర్యా!

అక్టోబరు 1965 భారతిలో నేను వ్రాసిన ఒక లేఖాంశాన్ని పురస్కరించుకొని కొంత చర్చ జరిగింది. ఆ చర్చను చూచాను. జవాబు వ్రాస్తున్నాను.

నేను వ్రాసిన లేఖ ఆంధ్ర వాఙ్మయంలో స్తబ్దతను గురించింది. ఇప్పుడు ఈ చర్చ నడిచిన తీరులో కూడా ఆ స్తబ్దతే గోచరించింది. నాలేఖలోని అసలు విషయమైన 'స్తబ్దత' అనే అంశాన్ని వదిలి, ఈ చర్చలో పాల్గొన్నవారు ఇతర విషయాలను గురించి తగాదాలు పడ్డారు. నేను వేసిన ప్రశ్న— ఇప్పుడు తెలుగు వాఙ్మయం స్తబ్దతను భజిస్తున్నదా, లేదా—అన్నది. సమాధానం కూడా ఆ లేఖలోనే వ్రాశాను. స్తబ్దత వుంది. అది వట్టి స్తబ్దతకాదు. పదహారణాల స్తబ్దత.

ఆ లేఖలో నేను సార్ర్త్, యుజెన్‌స్కీ, స్ట్రాచీ మొదలైనవాళ్ళు వ్రాసిన వ్రాతలను గురించి ప్రస్తావించాను. తెలుగు భాషలో అటువంటి విషయాలపై, ఆవిధంగా రచనలు ఎందుకు జరగడంలేదు? అని అడిగాను. అందుకు సమాధానంలేదు. అటువంటి రచనలే మన భాషలో జరిగివుంటే, ఈ చర్చలో పాల్గొన్నవారు—ఇవిగో, అటువంటి రచనలు ఇన్ని ఉన్నాయి— అని చెప్పవచ్చుగదా! ఆ మాట ఎవ్వరూ చెప్పలేదు. దీనిని ఏమంటాము? ఇది మన వాఙ్మయంలో ఏర్పడిన స్తబ్దతకు గుర్తు, అవునా, కాదా? నేను గుర్తుగానే భావిస్తున్నాను.

ఇక అనుసరణ అనువాదాలగురించి ప్రఖ్యాత చారిత్రకులు, పరిశోధకులుఅయిన ప్రొఫెసర్ కోశాంబి గారు తను ఒక గ్రంథంలో ఈ మాటలు వ్రాశారు.

"The intelluctnal apes the latest British fashions in clothing but even more in literature and the arts. The Indian novel, and short story, even in Indian languages, are modern creations based upon foreign models or foreign inspiration.' The Indian Drama is more than thousand years old, but the literate Indian stage today, and over whelmingly the Indian cinima, is patterned after theatre and movies in other Conutries. Indian poetry has however, resisted the change somewhat better, though foreign influence is demonstratable in choice of themes andfreer metres. The magnificient treasure of European (contimental) literary and cultural tradition is generally ignored by this intelligentia, except at third hand through badly chosen English book."

దీనినిబట్టి నాబోటివారు మరికొందరు మన దేశంలోవున్నారని అర్థం అవుతున్నది. నేను కోరేది ఇదే. ఈ మానసిక వైక్లబ్యంనుంచి, ఈ మేధో దారిద్ర్యంనుంచి, వట్టి అనుకరణనుంచి, ఎప్పుడు బయటపడి ప్రతిభావంతమైన రచనలకు తెలుగు మేధావులు పూనుకుంటారు?—అని. —హో. శి.

[ఈ చర్చను ఇంతటితో ముగిస్తున్నాము. —సం[

కలగూరగంప:

# నిఘంటు రచనా పద్ధతి: బ్రౌనుదొర భావాలు

[బ్రౌనుదొరవారు తమ ఇంగ్లీషు—తెలుగు నిఘంటువులో వ్రాసిన పీఠిక ఇది. అందరి విషయ గౌరవమును పురస్కరించుకొని దాని అనువాదమును ఇచ్చట ప్రకటించుచున్నాము. ఇందు వారు చెప్పినవిషయములు వర్తమానకాలమువారు కూడా తెలియవలసి యుండుట ఇక్కడ ప్రయోజనము.]

తమల్ని పాలిస్తున్న బ్రిటిషు పాలకులతో సంపర్కముగల హిందువులకు ఇంగ్లీషు భాషా జ్ఞానము అత్యంతము ఆవశ్యకమైన విషయమైనది. అయితే ఇంగ్లీషులో హిందువులకు తెలిసిన యే యితరమైన భాషలలోగాని వాటి అర్థమును వ్యంజింపజేయుటకు వీలులేని పలుకుబళ్లు అనేకము వున్నవి. మన ఇంగ్లీషు—గ్రీక్ నిఘంటువులలో కొన్ని అద్యతన భావములు సరిగా అర్థవ్యక్తిని పొందలేదు. కొన్ని కొన్ని శబ్దముల (ఉదాహరణకు Instinct, Liberty) అర్థములు తెలుగువారికి, తమిళులకు, కన్నడులకు విశదముగా అవగతమగుటకు కొన్ని సంవత్సరములు గడవవలసి వున్నది.

ఇంగ్లీషు శబ్దముల అర్థములు ఎక్కువ మారుతూ వుండటమే ఇందుకు ప్రధానమైన కారణమై వుండవచ్చును. అర్థములు పరిస్థితులనుబట్టి మారుట జరుగుచున్నది. పదముల ప్రయోగములను ప్రోగు చేయుటయందలి ప్రయోజనమును ఇది ప్రదర్శించుచున్నది. ఇటువంటి అల్పవిషయమునకు ఎక్కువ మంది వినియోగించు దానికన్న, నెక్కువ కాలమును, కృషిని వాంఛించు కార్యమిది.

ఈ పద్ధతిలో నొక యిబ్బంది వున్నది. అందువలన గ్రంథముయొక్క ప్రమాణము పెరుగును. కవులు వాడిన విచిత్రములైన శబ్దములను, అర్థములను వదిలిపెట్టి తెలుగు—ఇంగ్లీషు సంపుటమును కుదించవచ్చును. అయితే ఇప్పటి ఈ సంపుటమును అట్లా కుదించడము వివేకము కాజాలదు. ఇప్పటికే పాత ఇంగ్లీషుమాటలు, వాటి అర్థములు వదిలిపెట్టబడినవి. మత గ్రంథ సంబంధమైన పదములు మాత్రము వుంచబడినవి. అవి కూడా అల్పము. అడిసన్, పోపుగారలకు పూర్వము నాటివి అట్టి పదములు కొన్ని వున్నవి. జాన్‌సన్‌కు, షెరిడన్‌కు తెలియని కొన్ని అధునాతనమైన శబ్దములకు వివరణము ఈయబడినది. అందువలన నేను భారత దేశములో వాడుకలోవున్న godown, Compound, To day, Bearer, Muster మొదలైన పదజాలమును, Zamindar, Ryot, Lota, Ayah, Munshi మొదలైన హిందూస్తానీ మాటలను చూచి యుంటిని. అదేవిధముగా Mango, Watermelon, Custard apple, Cobra de capello మొదలైన మాటలను పరికించితిని. ఇంగ్లీషులో సర్వసాధారణముగా వాడుకలోవున్న లాటిను, ఫ్రెంచి పదములను గూడ తిలకించియుంటిని.

చాలా వృక్షముల పేర్లు ఇచ్చుట వృక్ష శాస్త్రమునందు ఉపయోగించు లాటిను పదజాలములో నిచ్చుట జరిగినది. Asclepias lotus, Melia Azadiracta, Asoca ఈ విధముగా. ఈ పదములు మన ఇంగ్లీషు నిఘంటువులలో కనుపించవు. అయితే వానిని వదిలిపెట్టడము అవివేకము. భారత దేశములో తెలిసిన అనేకమైన ఔషధ సంబంధమైన వృక్షములకు ఇంగ్లీషులో మాటలేలేవు.

ఇంగ్లీషులో క్రియాపదములకు అనేకమైన అర్థము లున్నవి. అయితే ఆ క్రియా పదములనుండి కల్పించబడిన నామవాచకములు వేరు అర్థములు కలవగుచున్నవి. ఉదాహరణకు To Break అను

క్రియాపదము, సకర్మక క్రియాపదముగాను నపుంసక క్రియాపదముగాను అనేక అర్థములను కల్గి వున్నది. అందులోనుంచి పుట్టిన Breaking (fracture) Breaker, Breaking అన్న వానికి నూతన అర్థములను చెప్పవలసి వున్నది. క్రియాపదము లనేకము చక్కగా తెలుగు చేయబడినవి. కాని Ingతో వున్న క్రియా శబ్ద భవములు Writing (scrip-tura), reading (lectio), going (departure), coming (approach) మొదలైనవి సంస్కృత నామ వాచకములవలన తరచు అనూదితములైనవి.

కొన్ని ధర్మవాచక శబ్దములను వివరణము లేకుండా అనువదించడము వలనుకాదు. "Trans-parency" అన్న పదమునకు సరియైన పర్యాయ పద మీయబడలేదు. కాని From the transparency of a glass అన్నది తేలికగా "Because glass can be seen through"అన్న వివరణముతో చేయబడినది.

De Finibus అన్న తన గ్రంథములో Amor, philosophia, Natura అన్న పదములను దిట్ట ముగా వివరించడము కష్టమని సిసిరో (Cicero) పేర్కొనివున్నాడు. Smith గాని, Malthus గాని Rent value అన్న గురుతు పదములను సంతృప్తి కరముగా నిర్వచింపలేకపోయినారు.

Prerogative, Political, Prejudice, Lu-xury, Sex యీ మాటలకు సరియైన పర్యాయ పదములులేవుకాని అర్థముచెప్పి తేలికగావివరించవచ్చును. కొన్ని నిఘంటవులలో వివరించుటకు కష్టములైన మాటలు, అర్థములు వదిలివేయబడుచున్నవి. కాని ఉప యోగకరములైన మాటల అర్థములను గురించి అజ్ఞానమును దాచుకొనుట పాఠకుడైనవానిని అన్యాయము చేయుట యగును.

Lovell Edgeworth తన Memoirs లో వంటఇంటిభాష కచ్చేరిగదికి ఎక్కుటను తాను తన జీవిత కాలమున చూచియుంటిననిచెప్పియున్నాడు.అరిష్టాటిలు గారి Poetic styles (XXV.15) మీద భాష్య మును వ్రాసిన ఒకానొక అద్యతన వ్యాఖ్యాత ఆ తాత్వికుని మాటను "Consummate twaddle" అన్నాడు. ఇటువంటిభాషతో వేగడమే కష్టము. వివరణముచేస్తే, ఆ గ్రంథము పనికిరానిదని అర్థము. అయితే ఇక్కడ ఈ తక్కువ రకపు ఇంగ్లీషును వదిలి పెడితే, అది సమగ్రముగా లేదన్న అర్థమును కుదుర్చు కొనవచ్చును.

రంగులను, వానియొక్క వివిధములైన ఛాయ లను నిర్వచించడము కష్టము. అందువలన ప్రతి ఛాయను నేను ఎరిగిన వస్తుజాతమును దృష్టాంత ముగా చూపి వివరించియున్నాను. ఉదాహరణకు "Chocolate colour" అన్నదానికి "The colour of the Mango blossom" అని అర్థము చెప్పినాను.

ఈ గ్రంథములో ఒక తెలుగుననే ఇంగ్లీషు వివరించుట జరిగినట్లున్నను, ఇందు సంస్కృత శబ్దములు విస్తారముగా నున్నవి. ఆ భాషలలోని కిది అనువదింపబడువరకు కన్నడులు తమిళులు కూడా దీనిని ఉపయోగింప వీలున్నది.

అనేక సందర్భములలో (ఉ దా హ ర ణ కు— Neighbour, craniology అను మాటల క్రింద) సంస్కృ త శబ్ద ము లీయబడినవి. ఇంగ్లీషు నిఘంటువులను బెంగాలీలోనికి, తమిళములోనికి, తె కన్నడములోనికి అనువదించునప్పుడా మాటలు సహా కారులు కాగలవు.

, ఖగోళశాస్త్రము, గణితశాస్త్రము, ధర్మ శాస్త్రము, తర్కము, మరియు ఇతర శాస్త్రములకు సంబంధించిన శబ్దములను వివరించుటలో నేను కోల్ బ్రూక్, విల్సన్, ప్రభృతి సంస్కృత భాషావేత్తల గ్రంథములను, అనుసరించితిని. అంతేగాక ఇంగ్లీషు నందును, బెంగాలీయందును అచ్చొత్తబడిన నిఘం టువులను పరిశీలించితిని. ఎందుచేతననగా, గ్రీకు,లాటిను భాషలు ఇంగ్లీషున కెట్లో, హిందువుల భాషలకు సంస్కృతమట్లు. ఆ సంస్కృతము, పాండిత్యము నకు తత్వశాస్త్రములకు సంబంధించిన శబ్దముల వ్యుత్పత్తిని తెలియుటకు ఆకరము.

అయితే మామూలు ఇంగ్లీషు భాషలోకన్పించు నామవాచకములను, క్రియలను వివరించుట కీ గ్రంథ ములయొక్క ఉపయోగము అల్పము. అవి అందుకు చాలవు. ఇక్కడ నాకు ఇతరమైన సహాయమేమియు లభ్యము కాలేదు. అయినప్పటికి అప్పుడప్పుడు, అక్క డక్కడ తమిళమునందును, కన్నడము (Canarese) నందును ఇంగ్లీషు భాషను వివరించు గ్రంథముల

వలసనే కొన్ని నికరములైన యర్థములు తట్టినవి. కుదిరినవి.

ప్రభుత్వమునకు, రివిన్యూ, దండు వ్యవహారములకు సంబంధించిన మాటలకు హిందూస్తానీ పర్యాయము లీయబడినవి. తెలుగులలో అవి బాగుగా వాడుకలో నున్నవి. అన్యత్రా హిందూస్తానీ పర్యాయముల నీయ లేదు. ఆ భాష తెలుగుకు కళంకము వంటిది. గ్రామ్యమైన తెలుగుభాషలో హిందూస్తానీ శబ్దములు, డ్రైడను, ఎడిసన్‌ల కాలములో మనలో ఫ్రెంచి శబ్దముల వుండినంత విరివిగా వుండినవి. అయితే ఈ అపశబ్దములలో బహుశబ్దములు కలుపువలె నశించును.

ఏ నిఘంటువునైననుసరే మొట్టమొదటిసారిగా అచ్చువేసినప్పుడు అందులో తప్పులు, లోపములు వుండటము సహజము. అందువలన నేను సవరణము లతో అనుబంధము వేర ఇచ్చియుంటిని.

క్రైస్తవ విజ్ఞానమును ప్రోత్సహించుటకునై యున్న సంఘము ప్రార్థనమును పురస్కరించుకొని నే నీ నిఘంటువును రచించితిని. వారే దీని నచ్చు వేయుటకైన ఖర్చును భరించిరి. పవిత్రమైన ఆ 'సంఘము'నకు అందుకు నేను హృదయపూర్వకమైన కృతజ్ఞతలను తెల్పుకొనుచున్నాను. వారి సహాయమే లేనిచో ఈ గ్రంథము బహుశా అచ్చయి వుండేడిది కాదేమో.

పత్రగ్రంథములను అనువాదము చేయువారికి సహాయముగా నుండుట కొరకు, యీ గ్రంథము అచ్చగుచున్నప్పుడు ఒక్కపని చేసినాను. దృష్టాంత పూర్వకముగా శబ్దముయొక్క అర్థమును స్పష్టము చేయవలసిన పట్టులలో (ఉదాహరణకు God, Lord, Heaven, Holy, Salvation మొదలైన మాటలు) ఆ పదములకు ఆ యా చోట్ల సంస్కృతములో, బెంగాలీలో, కన్నడములో, తమిళములో, తెలుగులో ఏమి యేమి పదములు వాడి యున్నారో అవి ఇచ్చినాను. ఈ శబ్దములు బహుళముగా సంస్కృత శబ్దములు. అయినను అచ్చటనున్న భేదములను చూచిన నాశ్చర్యము కల్గును. Vanity అన్న పదము వేరు వేరుగా పది సంస్కృత శబ్దములతో అనూదితమైనది.

మతమునకు సంబంధించినట్టి శబ్దముల కర్థము వ్రాయుటలో నేను డాక్టరు జాన్సనుగారిచ్చిన నిర్వచనములనుబట్టిపోతిని.

తెలుగునందును, తమిళమునందును, గ్రీకు నందును, లాటినునందును క్రైస్తవ మతము క్రమముగా కొత్త పలుకుబడులను సృష్టిచేయును. తమిళమునందిది ఇప్పుడే గోచరించుచున్నది.

కృత్రిమ శబ్దములను, అర్థములను నేనువదిలి పెట్టినాను. పాఠకునికి తగు హెచ్చరిక నీయకుండా నేను కొత్త తెలుగు పదమును దేనిని గ్రహించలేదు. కొత్త పదము సృష్టించడము తేలికే. కాని విదేశీయుడైన వాని కెవ్వనికి దానికి ప్రసిద్ధిని కల్పించు నధికారములేదు. భారతదేశమునందున్న భాషలను మార్చగలనని లేక మెరుగులు దిద్దగలనని పిచ్చి వూహాలు నేను కలవాడిని కాను.

పవిత్రమైన బైబిలునకు తెలుగు పాఠమును తయారు చేయడములో (ఈ పనిని నేను ఇరువది సంవత్సరముల క్రిందట ప్రారంభముచేసి వున్నాను) కొన్ని మాటలను అనువాదము చేయక అలాగుననే వుంచి వేసినాను. ఉదాహరణకు : wine అన్న పదము వున్నది. దీనిని గ్రీకు, లాటిను భాషలవారే హీబ్రూ భాషనుండి తెచ్చుకొని వున్నారు. బైబిలునకువున్న తక్కిన పాఠములలో 'దాక్షరసము' (ద్రాక్షపండ్ల రసము) అని వున్నది. ఇది సరియైన అనువాదముకాదు. shawl కు wool అని, బలూన్‌కు బదులు Silk అని వాడినా వాడవచ్చును. మరియు circumcesion అన్నమాట యున్నది. "సున్నత్" అని వున్న పదము అందరికిని బాగుగా తెలిసినదే. కొత్త పదములను సృష్టి చేయుటవలన నెట్టి ప్రయోజనమునులేదు. "Baptism" మొదలైన కొన్ని శబ్దములు వున్నవి. వానిని అనువదించక అట్లు వుంచుటయే లెస్స. హీబ్రూనూతననిబంధనములోకూడ అది అట్లే వున్నది. అనువదింపబడలేదు.

ముస్లిముల యేలుబడిలో తెలుగు, కన్నడము, తమిళములు అరబ్బీ మాటలతో నింపబడినవి. ప్రస్తుతము అవి అట్లే వుంచబడినవి. ఇంగ్లీషు పదములు అనేకము చేర్చబడినవి. Governor, Commondant Hospital, Captain, College, School, Court,

Police, Judge, Lawyer, Doctor,—యీ పదములను నేను అనువదించియున్నప్పటికి, హిందువులు ఆ మాటలకు అనువాదము లేకుండ ఇంగ్లీషు మాటను ఉపయోగించడమునే మన్నన చేతురన్న విషయము నాకు తెలియును. ఇటీవల వీరు సంస్కృతమును ఉపయోగించి కొన్ని మాటలను నిర్మించుకున్నారు. President ను 'అగ్రాసనాధిపతి' యని, Secretary ని 'కార్యదర్శి' యని అనుచున్నారు. ఇప్పుడిప్పుడు వ్యవహారమునందును, వ్యాపారమునందును వాడు తెలుగు భాషయందు అధికముగా నింగ్లీషు పదములు చేరుచున్నవి.

హిందువులకు ఉపయోగపడువిధముగా వ్రాయడము జరుగుచున్నది గనుక, ఇంగ్లీషువారికి అనవసరమనిపించు సూక్ష్మములైన వివరణములను కొన్ని ఇందులో ఇచ్చియున్నాను. కాని హిందువులకు అవి ఉపయోగపడును. ఇతరత్రా (Humour అన్న పదము క్రిందవలె) నేను కొంతమంది తెలుగు కవులను, పదములను ఉదహరించి వున్నాను. తగు ప్రయోజనమున్నదని భావించి అట్లు చేసినాను. ఇంగ్లీషు భాషను అభ్యసించడము హిందువుల మనస్సులను విప్పుటకు మార్గము కాగలదని నా అభిప్రాయము.

ఈ నిఘంటువువలన ఇంగ్లీషులోని పెద్ద రచయితల గ్రంథములను తెలుగునందు విప్పి చెప్పుటకు పాఠకునకు వీలగునని నేను అనుకొనడములేదు. ఇంగ్లీషుతో సమానమని చెప్పదగిన భాష ఒక్కటే వున్నది. అది ఫ్రెంచి భాష. అయినప్పటికి నూతననిబంధనము మీద స్కాట్ వ్రాసిన వ్యాఖ్యానమును పదబంధములను మార్చక ఫ్రెంచిచేయుట కష్టమైపోయినది. ఇంగ్లీషు—తెలుగు నిఘంటువును వ్రాయడములోఉద్దేశముఒక్కటే తెలుగు భాషలోనికి సంతృప్తికరముగా అనూదితములగుటకు వీలుకాని ఇంగ్లీషు పుస్తకములను అర్థము చేసికొనగల్గుటకు మార్గమును చూపించడమే.

---



# గ్రంథ విమర్శలు

## శ్రీ వీరేశలింగ యుగము

(కర్త: కవిత్వవేది కల్లూరు వేంకట నారాయణ రావు. ఎమ్. ఏ; మూల్యము:—4.00 ప్రాప్తి స్థానము:—సి. వి. రామారావు, కోన్నూరునగర్, అనంతపురము.)

వీరేశలింగయుగమను ఈ గ్రంథము పందొమ్మిదవ శతాబ్దమునందలి యాంధ్ర వాఙ్మయ స్వరూప స్వభావములను వెల్లడించునట్టిది. ఈ గ్రంథకర్త యిదివఱకే పేరుపొందినట్టివారు. వారు వ్రాసిన "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము" తెలుగునేల నాలుగు చెఱగుల కలయ ప్రాకినది. అది ప్రాచీనాంధ్రవాఙ్మయము లక్షణములను ముచ్చటగా చెప్పునట్టిది. పందొమ్మిదవ శతాబ్దమునందలి యాంధ్రవాఙ్మయమును గూర్చి రచింపబడిన గ్రంథము వేఱొకటి యిదివఱకే వెలువడినది.

పందొమ్మిదవ శతాబ్దమునందలి యాంధ్ర వాఙ్మయము విశాలమయినట్టిది, పలుపోకడలుపోయినట్టిది. ఐనను దానినిగూర్చి విద్వాంసులయందుఏకాభిప్రాయము లేదు. ఆంధ్ర సాహిత్య పరిణామము నందు పందొమ్మిదవ శతాబ్దమును క్షీణయుగము క్రింద జమ కట్టినవారున్నారు. సంధియుగమన్నవారున్నారు. ఈ విధముగా ననుటకు హేతువు లొండు రెండు గలవు. ప్రాయికముగా ప్రాచీన సాహిత్యము పద్య కవిత్వము. పద్య కవిత్వమును పరిశీలించునపుడు ఈశతాబ్దమందలి కావ్యములు శబ్దార్థములరెంటనువనుచరిత్రనులనుసరించినవి. ఆ కావ్యకర్తలు గంటమును పట్టిన వెంటనే రామరాజ భూషణుడు ప్రత్యక్షమయ్యేడివాడు. ఆనందముకాక చమత్కారమే సాహిత్య ప్రయోజనమయినది. అనర్థకమయిన భాషాడంబరము కవితాశక్తిని మించిపోయినది. అట్టిచో దీనిని క్షీణ యుగముగా నెంచుటలో వింతలేదు.

మరి సాహిత్యమనగనే పద్య కవిత్వ మనియే యర్థమా? కాదు. వాఙ్మయము, సారస్వతము, సాహిత్యము ఈ మూడు పదములు సమానార్థకములుగావు. వాగ్రూపమున నున్నదంతయు వాఙ్మయమే. సంస్కృతి పోషకములగు వేదాంత గ్రంథములు మున్నగునవన్నియు సారస్వతమగును. రసప్రధానమై యానందమును కలిగించునది సాహిత్యము. సాహిత్యమన్నపు డది మార్గ సాహిత్యము కావచ్చును. దేశి సాహిత్యము కావచ్చును. పందొమ్మిదవ శతాబ్దమునందలి యాంధ్రవాఙ్మయమునకు విలువ కట్టునపుడు మన మీ వింగడింపును విస్మరింపరాదు. ఈ కాలమునందు కోశములు వెలువడినవి. గ్రంథ పరిష్కారము ప్రారంభమయినది. గద్యము గజ్జె కట్టి ప్రధాన భాగమై రంగమున నిలిచినది. కథా సారస్వతము పెంపొందినది. కీర్తన వాఙ్మయము పెరిగినది. ఇంతకుముందు కని విని ఎఱుగని నాటకములు, ప్రహసనములు స్వతంత్రములయినవో యనువాదములయినవో వెలువడినవి. నవల మొదలయినది. ఆ యాశాస్త్ర గ్రంథము లావిర్భవించినవి. వివిధ మతముల ముఖ్యగ్రంథము లనువదింపబడినవి. ఇంతయేల? వివిధములయిన సాహిత్య ప్రక్రియలు వెలుగు చూచినవి. ఈ యుజ్జీవనమునకు, ఈ వికాసమునకు మూలకారణము ఆంగ్లభాష. తెలుగువాడు దానికెంతయో ఋణపడియున్నాడు. ఈ యన్నిటిని మించినది మఱొకటి యున్నది. సాహిత్యమునకెన్ని యానుషంగిక ప్రయోజనములను జెప్పినను, ప్రాచీనులు ప్రధానముగా ఆనందమునకే పట్టముకట్టిరి. కాలప్రభావముకానిండు, ఆంగ్లభాషా ప్రభావము గానిండు సాహిత్యము సంఘ సంస్కార సాధనముగావలెనను సిద్ధాంతము ఈ

పందొమ్మిదవ శతాబ్దములోనే బయలుదేరి బలపడినది. రానురాను ఆ సిద్ధాంత మీ ఇరువదవ శతాబ్దములో వెఱ్ఱితలలు వేసినది. పండితుల పరమయిన సారస్వతము ప్రజాపరమయినది యీ పందొమ్మిదవ శతాబ్దమునందే. దేశీయులు, విదేశీయులు రచనలు చేసినది యీ శతకమునందే. ఇన్ని విచిత్ర లక్షణములతో కూడిన యీ శతాబ్దమును క్షీణయుగమనుటకు నోరాడదు. ఈ శతాబ్దమున బీజరూపముననున్న యా యా సాహిత్య ప్రక్రియలు ఇరువదవ శతాబ్దములో పరిపూర్ణ వికాసముపొందినవి. అందుచేతనే తన గ్రంథమునకు శ్రీ వాత్సవ 'ఉష్ణ కిరణాలు' అని పేరుపెట్టెను.

కవిత్వవేది పందొమ్మిదవ శతాబ్ద వాఙ్మయమును సమీక్షించెను. సారస్వత సాహిత్య భేదములను లెస్సగా గుర్తించెను. పందొమ్మిదవ శతాబ్దమందలి వాఙ్మయము మూడు దశలుగా పెంపొందినదని భావించుటయందే ఈ గ్రంథకర్త చేసిన సూక్ష్మ విచారము తెలియును. మొదట ప్రాచీనాంధ్ర సాహిత్య స్వరూపమును స్థూలముగా సమీక్షించిరి. పిదప పందొమ్మిదవ శతాబ్దమునాటి దేశకాల పరిస్థితులు పేర్కొనిరి. ఈ యధ్యాయమున కెంత ప్రాముఖ్య మీవలయునో యంతే యిచ్చిరి. ఇక నక్కడనుండి వాఙ్మయకారయితల జీవిత కృతులను విపులముగా వర్ణించిరి. సారస్వతోద్దీపకుల సేవను వెల్లడించిరి. నాటక సాహిత్యము, మార్గ కవిత, దేశికవిత, గద్యసాహిత్యము తడవిరి. పందొమ్మిదవశతాబ్దసాహిత్యపరిణామమును విశదపఱచిరి. సింహావలోకనముతో ఈ గ్రంథమునకు స్వస్తి చెప్పిరి. ఆ యా కవుల పద్య భాగముల నుదాహరించిన యొక యనుబంధము గ్రంథాంతమున గలదు. అందు పద్యములు సమగ్రముగాలేవు. ఈ యనుబంధము వికృతముగా తయారయినది. ఈ గ్రంథము మొత్తము చదివిన తరువాత పందొమ్మిదవ శతాబ్ద వాఙ్మయమును గూర్చియు, దానిని పెంచి పెద్దజేసినవారినిగూర్చియు స్థూలముగా తెలియును. సంగ్రహముగా, సుందరముగానున్న రచన యిది. ప్రాచీనాంధ్ర సాహిత్యమునకు వీరేశలింగముగారి యాంధ్రకవుల చరిత్ర యెట్టిదో, పందొమ్మిదవ శతాబ్దమునాటి యాంధ్ర సాహిత్యమునకీ గ్రంథమట్టిది.

కవిత్వవేది యీ గ్రంథమునకు వీరేశలింగయుగమని పేరు పెట్టిరి. కాని యట్లు పేరుపెట్టుటకుగల కారణములు పూర్తిగా చెప్పలేదు. పందొమ్మిదవ శతాబ్దమునందలి విద్వాంసులు సామాన్యులుగారు. ఆ శతాబ్దము తన పేరుతో చెల్లదగిన ప్రజ్ఞాపాటవము ప్రతి విద్వాంసునియందున్నది. అట్టిచో వీరేశలింగముగారు మాత్రమే యీ యుగమునకు నాయకుడు గానేల? ఆ పారుపత్యమును పంచుకొనుటకు ఇతరులకును యోగ్యతయున్నది. వీరేశలింగముగారు నూతనసాహిత్య ప్రక్రియలకు మొట్టమొదట శ్రీకారము చుట్టినమాట నిజమే. వారికి గద్యతిక్కనయను బిరుదముకూడ కలదు. కాని "ఇతని (కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారి) గ్రాంథిక ధారా సౌలభ్యము వీరేశలింగముగారి రచనలోను పూర్తిగా నిరసుకొనలేదనవచ్చును" అని కవిత్వవేదియే పేర్కొనిరి. అంతేకాదు. "భావ విప్లవముతో పాటు శాంత్యాద్యున్నత లక్ష్యములనుగూడ బాదుకొల్పు సాహిత్యమే ప్రజాసాహిత్యము, అభ్యుదయ సాహిత్యము కాగలదు. అట్టి సాహిత్యమును 19 వ శతాబ్దమున వీరేశలింగముగారు సాధించిరనుటకు వారి జీవితమును గద్యలును తార్కాణములై యున్నవా? లేవా? కాలమే చెప్పగలదు" అని కూడ వారే యన్నారు. సాహిత్యమును సంఘసంస్కార ప్రబల సాధనముగా వీరేశలింగముగారు గణించిరి. వారి సృష్టిలో రసమయమై యానందదాయకమగు "సాహిత్యము" తక్కువ. మంచి సెబ్బరలను ఎంచు భాగ మెక్కువ. అట్లెంచుటయే సాహిత్య ప్రయోజనమా? కాదని యందఱును మాటయే. సాహిత్య లక్షణములను వీరేశలింగముగారి సృష్టి కన్వయించినచో నిజముతేలును. అదియును గాక యొకశతాబ్దమునకునాయకుడయినవాడు తరువాతి శతాబ్దములయందు సైతము తన బలిమిని చూపును, చూపవలయును. వీరేశలింగముగారి యుద్యమము

వారితోపాటు కనుమఱుగయినది. అసలు వీరేశలింగము గారిని యుగ నాయకునిగా గుర్తించుటయందు వారి సంఘసంస్కారోద్యమనుకూడ నొక ప్రధానహేతు వయినది. ప్రౌఢ్ దొరగారు, చిన్నయసూరి, తిరుపతి వేంకటేశ్వరకవులు, గురజాడ అప్పారావు మున్నగువారు కూడనుండగా పందొమ్మిదవ శతాబ్దము నాయంకర మును ఒక్క వీరేశలింగముగారికే కవిత్వవేదియేల కట్టబెట్టిరో యర్థము కావుటలేదు. ఇట్లనుట వీరేశ లింగముగారిని తక్కువచేయుటకాదు.

ఆంధ్ర సాహిత్యమునందు యుగవిభజనము ఒక తీరుగాలేదు. ఆ యా యుగవిభజనములు చేసిన వారి ప్రమాణములు విమర్శను తప్పించుకొనలేకపోయి నవి. ఒకచోట కవి, కథానాయకుడైన, మఱొకచోట కవి, కవి పోషకుడయిన ప్రభువు కథానాయకుడయ్యెను. కాలమును, దేశమును, సాహితీ ప్రక్రియా భేదమును ప్రమాణములుగా స్వీకరించి యుగవిభజనము చేయుట కూడ నున్నది. నూతన భావములను వెదజల్లి, వానికి త్రికాలాబాధితరూపము కల్పించి, రాబోవు తరముల వారికిని మాననీయుడై, రసానందమును కల్గించు వాడే సాహితీప్రపంచమున నొక యుగమునకు నాయకు డగును. వీరేశలింగముగారట్టి నాయకుడగునో కాదో యింకను సందేహాస్పదమే. పందొమ్మిదవ, యిరువదవ శతాబ్దములలో సాహితీ ప్రపంచమున నాయకులెవరు? అను సమస్య యొకపట్టాన తేలునదిగాదు. దీనినిగూర్చి యెంతో ప్రకుమ్ములాట జరిగినది. జరుగుచున్నది. బహు నాయకత్వమును, ద్వంద్వప్రభుత్వమును ఒప్పుకొనుట కెవ్వరు తలపడుటలేదు. పందొమ్మిదవ శతాబ్దమును కూడ కలిపి, భారత దేశము స్వాతంత్ర్యము పొందు వఱకు "ఆంగ్లరాజయుగము" అనియో, "ఆంగ్లపరి పాలనాయుగము" అనియో సంభావించుట లెస్స యగునో కాదో విమర్శకు లాలోచింపవలయును.

గ్రంథాంతమున కవిత్వవేది కురుంగంటి సీతా రామ భట్టాచార్యులవారి వాక్కులను, నచ్చినవికాబోలు, ఉదాహరించిరి. "కన్యాశుల్కములోని పేలవత్వము ప్రతాపరుద్రీయములోలేద"ని యాచార్యులవారితీర్పు. కవిత్వవేది యిట్టి వాక్యములను పరిహరించినచో బాగుగా నుండెడిది. కన్యాశుల్కమునకు, ప్రతాపరుద్రీయము నకు పోలికయేమి? సంధి బంధమునుబట్టి యాచా ర్యులవారట్లన్నారా? పేలవత్వమును నిర్వచించుట యెట్లు? "నాటకములేని లోటును బళ్లారిలో రెండు వ్యక్తులు తీర్చిరన్నారు". ఇట్టి వాక్యముల నిర్మా ణము సొగసుగా నుండదు. శ్రీ వీరేశలింగ యుగము సాహితీప్రియులు పరిశీలింపదగినది.

## కవిరాజు

((త్రిపురనేని—జీవిత చిత్రణము)

(కర్త: పండిత—కొత్త సత్యనారాయణచౌదరి. వెల: 3.00. ప్రాప్తిస్థానము : పండిత కొత్త సత్యనారాయణచౌదరి, లెక్చరర్—పి.బి. యన్. కాలేజి, నిడుబ్రోలు, గుంటూరుజిల్లా.)

ఇప్పటి వారికి రామస్వామిచౌదరినిగారినిగూర్చి యంతగా తెలియదు. తెలియజేయుటకు దీక్షాకంకణము ధరించినవారు చాలమందియున్నారు. కాని వారి మాటలను విన్నపిదప ప్రత్యక్షమగు రామస్వామి చౌదరిగారు వేఱు. అందుచే నెవరైన రామస్వామి చౌదరిగారినిగూర్చి యొక గ్రంథము రచించినచో, పరమాసక్తితో ముందు దానిని పఠింపవలసియున్నది. పిదప సూతపురాణాదులలో సాక్షాత్కరించు రామస్వామి చౌదరి, వారి గ్రంథములకు భాష్యములువ్రాయువారు చూపించిన చూపించుచున్న కవిరాజు భిన్నులో, యభిన్నులో ఎవరికి వారు తేల్చుకొనవలయును. ఆర్య గ్రంథములలో, ఆర్యసంతతివారు ప్రచారముచేయు సిద్ధాంతములలో గూడుగట్టిన యధర్మమును ఛేదింప బాటువడిన విమర్శకుడు, కవి రామస్వామిచౌదరి. వారు సత్యపరాయణులు. ధర్మప్రీతి గలవారు. నిశ్శంకసాహ సులు. వీరేశలింగముగారు హైందవసంఘ దురాచారము లను దుయ్యబట్టిరి. సంఘ సంస్కారముకొఱకు పాటు వడిరి. రామస్వామిచౌదరిగారు హైందవ దురాచారము

లకు మూలకందములనదగు గ్రంథములు లోగుట్టును చరిత్రపరముగా వెల్లడించిరి. ఇతిహాసములనుస్థితము చరిత్రపరముగా సమీక్షించిరి. అట్టి రామస్వామిగారి జీవిత చరిత్రను పండిత కొత్త సత్యనారాయణచౌదరి గారు రచించిరి. ఇదివఱకొకరిట్టి గ్రంథమును చేసిరి.

ఈ గ్రంథమును చదివిన పిదప కవిరాజు నాత్మీయతయేగాక సత్యనారాయణచౌదరిగారి యాత్మీయతయు గోచరించును. వారువర్ణాశ్రమవ్యవస్థయందలి మంచి సెబ్బఱలను ప్రామాణికముగా వివరించిరి. రామస్వామి చౌదరిగారి జన్మవృత్తాంతాదులను వర్ణించిరి. కవిరాజు రచించినయొక్కొక్క కబ్బమును స్థూలముగా సమీక్షించిరి. రామస్వామిచౌదరిగారి కవితా వైశిష్ట్యమును వెల్లడించిరి. వారి గద్యపీఠికల సౌందర్యమును తడవిరి. కవిరాజు జీవనమునందలియొక కొన్ని సన్నివేశములను తార్కాణించి, వారి వ్యక్తిత్వ శోభను వెలికిదీసిరి. ఈ గ్రంథమాద్యంతము సరళ సుందరమయిన గద్యలో నడచినది.

ఈ గ్రంథము పఠించిన పిదప రామస్వామి చౌదరిగారి నేయే శక్తులు నడిపించినవో తేటతెల్లమగును. గ్రంథమునందంతటరామస్వామిగారినిగూర్చియే యున్నదని చెప్పజాలము. ప్రకరణోచితములుగాని యధిక ప్రసంగములు కలవు. "ఆంధ్ర మహాకవులలో నన్నిచోడ మహాకవికున్న స్థానమే కవిరాజున కున్నదని విమర్శకులూహింతురు.......తెలుగు కవిత్వములోని మర్మములు, ధర్మములు సూటిగాఁజెప్పినవారిలో నన్నిచోడుడు మొదటివాడు. వాని సరసకు రాఁదగిన మహాకవులు తిక్కన సోమయాజులు—నాచన సోమన. వారికిఁ బిదప నవీనులలో 'కవిరాజు' లెక్కకు రావచ్చును....." ఇట్టి పలుకులవంటివి యీ గ్రంథమున నెడనెడ గలవు. వీనినెట్లు వ్యాఖ్యానింపవలయును? తెలుగువారికి చక్కని చిక్కని హాస్యమందించిన గురజాడ అప్పారావుగారిని చౌదరిగారు మఱచినట్లున్నది. ఇట్టి గ్రంథములలో వాక్పారుష్య మెంత తక్కువగానున్న అంతమంచిది.

—"తారానాథ్".

# స్ఫూర్తిశ్రీ వ్యాసావళి

[రచన : స్ఫూర్తిశ్రీ; ప్రతులకు : టి. భాస్కరరావు, బి. ఏ. (ఆనర్సు), ఏ. సి. కాలేజి గుంటూరు; వెల రు. 2 లు.]

రచయితగా ఇప్పటికే ప్రతిష్ఠ నార్జించుకొన్న స్ఫూర్తిశ్రీ వివిధ సమయాలలో చాల తేటగా సులభ గ్రాంథిక శైలిలో రచించిన సారస్వత వ్యాసాల సంకలనమిది. మొత్తం పది వ్యాసాలున్నాయి. 'సాహిత్య సౌహిత్యము', 'అనుభూతి—అభివ్యక్తి' అనే వ్యాసాలలో ప్రాచ్య పాశ్చాత్య కావ్యవిద్వాంసుల అభిప్రాయాలను పేర్కొంటూ ముఖ్యంగా ఆలంకారిక దృక్పథంనుండి సాహిత్యపు మూలవిషయాలను స్పృశిస్తూ సరసంగానూ ప్రసంగ పద్ధతితోటి ఆకర్షవంతంగానూ రచించారు. గహనంవంటి విషయమే అయినా తాము లోతులకు చొచ్చుకొనిపోయిగూడా పఠితలను ఒడ్డున నిలిపి సుబోధకంగా, అధ్యాపకుడుగా చెప్పవలసిన విధంగా (స్ఫూర్తిశ్రీ అధ్యాపకవృత్తి చేస్తున్నారు కూడాను.) చెప్పారు.

తేలికగా కష్టమైన విషయాన్ని చెప్పడమంటే మాటలుకాదు. కొందరు తేలికగా చెప్పినట్లునటిస్తూ, గజిబిజి పెడుతారు. నిజమైన తేలికదనమంటే బరువెక్కిగూడా మనస్సుకు పట్టేతేలిక దనమేగాని మరొక అర్థంలోవాడే 'తేలిక (Light)దనం'కాదు. ప్రతిపంక్తి పాండిత్యభారంతో క్రుంగిపోకుండానే పాండిత్యాన్ని ప్రదర్శించే నేర్పు స్ఫూర్తిశ్రీగారికున్నట్లు అనేకులైన ఇతరులకుండివుంటే, నేటి తెలుగువిద్యార్థికి మాతృభాష—వచనంకూడా— ప్రాణ్యంగా మరింత సంతోషాన్ని కలిగించేది. ఉన్న పరిస్థితి ఉండవలసినదానికి వికృతి. అందుకే ఇంగ్లీషుకన్నా తెలుగుపాఠం కొరకరాని కొయ్య అవుతున్నది. సులభ గ్రాంథికంలో నైనప్పటికీ స్ఫూర్తిశ్రీవలె చదువరులకు సంతాపం కలిగించని రచయితలు బహుకొద్దిమంది. తెచ్చిపెట్టుకోలు డాంబికత్వం కొన్నిపట్ల పాండిత్యంగా చలామణి కాగలుగు

తున్నది. తెలుగు వచనశైలి నేటికీ ఒకదారిని పడలేదు. స్ఫూర్తిశ్రీవంటి ఆధునికులు ఆంగ్లవచనంగురించి కొద్దో గొప్పో తెలిసినవారు కూడా పానుగంటి వచన శైలి ("వచన రచనానుకూల నిర్వహణ శక్తి") మేలు బంతిగా రచింపబూనితే, మరి ఇంకెన్నటికి వర్తమాన కాలానుసారమై జీవవంతమైన వచనశైలి మనకు ఏర్పడేటట్లు? చెళ్లపిళ్లవారి 'కథలు—గాథలు', శ్రీపాదవారి 'అనుభవాలు—జ్ఞాపకాలూను'' నస్మరంతి అయ్యాయికదా, ఇక గురజాడనూ, గిడుగునూ అనుసరించే యువపండితు లెవరుంటారు? పద్యపు నడకను గద్యానికి తగిలించి శబ్దాలంకారాలతో దానిని సంగీతశాస్త్రానికి అనుబంధించినట్లుగా పందొమ్మిదవ శతాబ్ది ద్వితీయార్ధ ప్రారంభ సమయాన చిన్నయ సూరి తెలుగు వచన రచనకు చూపినమార్గం, ఆంధ్ర సాహిత్య పరిషత్తుద్వారా బాహాటంగానూ, నవ్య సాహిత్య పరిషత్తుద్వారా చాటుమాటు కలగలుపు వ్యవహారంగానూ, కొనసాగుతూనే వస్తున్నది. పానుగంటి వారి వచనశైలి శబ్దాల చమత్కారంతోటి ప్రాసల దరువులతోటి పఠితలను సంతోషపెట్టినమాట నిజమే. హాస్యానికి అది బాగా నప్పింది. ఈనాడు అది చాలదు. కాని తెలుగు పండితులు దీనిని ఒప్పరు. స్ఫూర్తిశ్రీ రచనలో దురవబోధమైన పదమేదీ లేదుగాని, ఆ పదాలు వాడుకలోనివికావు. కాబట్టి అవసరమైనంత అర్థస్ఫూర్తి నవి కలిగించలేవు.

దీని నటుంచి చూచినప్పుడు స్ఫూర్తిశ్రీ వ్యాసావళిలో సాహసికత్వంతో గూడిన ఉపజ్ఞ తక్కువగా, అనేకు లనేక వేళల చెప్పినదానికి చేరువుగావుండి పదుగురేగిన దారినిపడిపోయే పద్ధతి ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. దీనికి కారణం, స్ఫూర్తిశ్రీకి విమర్శ తెలియదనడంకాదు. తెలిసినదానిని తెగువతో తర్కించి మంచి చెడ్డ లేర్పడజెప్పే విమర్శక వైఖరికంటె, తమకు బాగా నచ్చిన దాని సొగసులను చూసి మెచ్చే (Appreciation) వైఖరిని ఆయన అవలంబించారన డమే సరి అనిపిస్తుంది. 'వత్సల వలపు', 'మూలపల్లి—కొన్ని పాత్రలు' అనే వ్యాసాలలో విమర్శకంటె కథనం పాలు హెచ్చు.

"పీఠికల పరామర్శ" అనే వ్యాసంలో స్ఫూర్తిశ్రీ చాల విషయాన్ని సేకరించిపెట్టారు. గుమాస్తాపని అని దీనిని తృణీకరించ వీలులేదు. ఎందుచేతనంటే, ఈ సామగ్రి ముందు ముందు రాగల విమర్శకు ఆధారభూతమౌతుంది. ఈ వ్యాసం పూర్తిగా జాబితావంటిదీ కాదు. విమర్శ—ముఖ్యంగా హాస్యరూపంలో—జత కలిసి జాబితాకాకుండా రక్షించింది. మంచి పీఠిక ఎలా ఉండాలో మంచి పీఠిక ఎలా ఉండగూడదో అని చెప్పడంద్వారా, చెప్పినట్లేగదా!

"తెలుగులో వంగ సాహిత్యము", "తెలుగులో ఉమర్ ఖయామ" అనే వ్యాసాలు కూడా ఆ కోవకు చెందినవే. విషయ సంభారం హెచ్చు. ఇతరులు పడవలసిన కష్టమంతా తామేపడి ఇంత సమాచారాన్ని సేకరించి ఒకచోట నిలిపినందుకు ఆ ఇతరులందరూ స్ఫూర్తిశ్రీకి ఋణగ్రస్తులే. ఈ రెండింటిలో మొదటి వ్యాసం ఎంత వ్యంగ్యానికైనా, అపహాస్యానికైనా వీలు కలిగిస్తున్నది. కాని ఆ వీలును స్ఫూర్తిశ్రీ వాడుకోలేదు. వంగ సాహిత్యంపేర ఇటీవలి కాలంలో ధనదాహం చేత పుస్తక ప్రచురణ వ్యాపారులు తెలుగులోనికి దిగుమతి చేయుస్తున్న కశ్మల పదార్థం, కళ్లముందు జరిపిస్తున్న భాషావధ రవీంద్రునికీ శరచ్చంద్రునికీ పదుగురెదుట జరిపిస్తున్న పరాభవం—వీటినికూడా చూపి ఉండవచ్చు.

"ప్రబంధము—పరిణామము" అన్న వ్యాసంలోని వాదం కొత్తదేమీకాదు. ప్రబంధశబ్దానికిమొదట కావ్యమనే అర్థం ఉండవచ్చుగాక, ఇప్పుడుకాదు. ఎప్పుడో దానికి ఒక ప్రత్యేకమైన కావ్య విశేషంగా తెలుగులో ఒక అర్థం రూఢి అయింది. దానిని మారుద్దామనుకోవడం ఏటి కెదురీత. పైగా అనవసరం.

"చిన్నయసూరి వ్యాకరణ ప్రస్థానము"లో సూరి తమ వివిధ వ్యాకరణ సంబంధి రచనలను ఏకాల

క్రమంలో చేసిఉంటారో స్ఫూర్తిశ్రీ ఊహించారు. ఇవి వట్టిగాలిమేట్లుకావు. ఉపపత్తులుసు కూడా చూపారు. అయితే వాటి నిర్ధారణ పండితుల ఆమోదం మీద ఆధారపడి ఉంటుంది. ఈ సందర్భంలో రావిపాటి గురుమూర్తిశాస్త్రి సూరికంటె ముందు, సూరి పద్ధతికి భిన్నంగా వ్యావహారికంలో తెలుగు వ్యాకరణాన్ని రచించిన విషయం, దక్షిణాంధ్ర వచన సంప్రదాయ ప్రభావంచేత సూరి గ్రాంథికభాషకు తెలుగు వచన రచనలో ఆద్యుడై అనుశాసించడం స్మరణీయం. స్ఫూర్తిశ్రీ రెండవ దానినికూడా స్పృశించివుంటే వ్యాసం సమగ్రమై ఉండేది.

ఈ సంకలనంలో చివరివ్యాసం శీర్షిక "సుందరకాండము—ఛందస్సౌందర్యము." నన్నయ 'ప్రసన్న కథా కవితార్థయుక్తి' ఆవిష్కరిస్తూ విశ్వనాథసత్యనారాయణ రచించిన విధంగా, విశ్వనాథవారు తను 'రామాయణ కల్పవృక్షము'లోని సుందరకాండంలో కావ్య శిల్పంలో భాగమే అయిన ఛందస్సు ఔచిత్యాన్ని ఏవిధంగా పోషించిందీ స్ఫూర్తిశ్రీ వివరించారు. పూర్వ కవులు ప్రయత్న పూర్వకంగా ఆ పని చేసిందీ లేనిదీ మనకు తెలియదు—ఊహించవలసిందేగాని వారు మహాకవులు కాబట్టి అప్రయత్నంగానే ఈసౌందర్యం వారి కావ్యాలకు చేకూరి ఉండవచ్చు. తెలిసి, తెలిసే పూనికచేసి, సౌందర్యాపేక్షతో, విశ్వనాథవారు ఈపని చేసివుంటే వారిని మెచ్చవలసిందే. కాని, సహజంగా నిర్గతమైన ధారలోని అందానికీ, కృతకంగా నిర్గమింపజేసేధారలోని అందానికీ అంతరం ఉండకతప్పదేమో! అసలుదానికీ నకిలీదానికీ ఉన్నంత అంతరం (Art and artifice) కాకపోవచ్చుగాని, ఎక్కువగా బుద్ధి వ్యాపార ఫలమైనందుచేత, ఈ రెండవ దానికి మొదటిదానిలోని సహజ సౌందర్యం చేకూరక పోవచ్చు. కవి వట్టి శిల్పికాడు. శిల్పిమాత్రమే గొప్ప కవికాడు. హృదయ పదార్థమే కవిని కవిగావిస్తుంది. శిల్పం ఆవశ్యకమే అయినా, అది ఒక్కటే కవిత్వానికి పర్యాయపదం కాజాలదు. కళ (Art) కు శిల్పం (Craft) ఉపాంగం మాత్రమే.

మంచి కాగితంమీద, తప్పులు ఆట్టే దొర్లకుండా, అచ్చుపడిన ఈ 148 పుటల పుస్తకం ఒక సహృదయుని సాహిత్య సౌహిత్య వీచిక. అనుభూతి సౌరభ్యం తోటి అభివ్యక్తి సారళ్యంతోటి పాఠకుని ఒక్క పూపున చదివింపగల పుస్తకం ఇది.

—'సుదర్శన్'

## అక్షరాల గవాక్షాలు

[కవితా సంపుటి. కవి : డా. సి. నారాయణరెడ్డి, ప్రకాశకులు : యం. శేషాచలం అండ్ కంపెనీ. ప్రాప్తిస్థానం : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు. వెల : సాదా, రూ. రూ 2.00 ; మేలు రూ. 3.00.]

అక్షరాల గవాక్షాలు ఆమూలాగ్రంగా చదివిం తరవాత రెండు అభిప్రాయాలు కలుగుతాయి. మొదటిది,సామాన్యంగాతెలుగులో కవిత్వంవ్రాసేవారిలో ఎక్కువమందికివుండే భాషా మనుకారం ఈ కవికిలేదు. భాషకోసం భావాన్ని ఖూనీచేయటం జరగలేదు.భావానికి భాషను చాకిరీ చేయించినట్టే!! ప్రతి రచనలో చాలావరకు అర్థస్పష్టత్వం వుంది. భావం భాష ఎక్కడో తప్ప, అన్ని చోట్లా అతికినట్లు కుదిరాయి. 'గుండె గుండె కొక దీపం' మినహాయిస్తే, ఏ రచనా సాగలాగినట్టులేదు. 'మన శ్మశానం' విడిచిపెడితే, కవితల్లో పదాడంబరం తక్కువే!

రెండవది రచనా నైపుణ్యం. తెలుగు కవులలో చాలా తక్కువమందికివుండే ఉక్తివైచిత్రి, ఈకవికి పుష్కలంగావుంది. అది కావ్యంనిండా గోచరమవుతుంది. స్వీకరించిన వస్తువు ఏదైనా, ఉక్తివైచిత్రివల్ల కావ్యత్వం సిద్ధించి ప్రతి రచనా చాలావరకు రసరమ్యంగా వుంది. డా. సి. నారాయణరెడ్డిని కవిలోకంలో నిలుప

గలిగిందీ, ఈ సంపుటిని కవితా శ్రేణిలో ఉంచగలిగిందీ, ఉక్తి వైచిత్రి. పదాల కలయికలో, భావాలు మలుపులు తిప్పటంలో, ఛందస్సు విరుపుల్లో ఈ ఉక్తివైచిత్రి ప్రత్యక్షమవుతుంది. ఈ కవి గ్రహించిన ఏ వస్తువు అయినా కవితా రామణీయకం సంతరించుకో గలుగుతున్నప్పుడు, తాత్కాలిక వస్తువుకంటే, శాశ్వత వస్తువునకు ప్రాధాన్యం ఇస్తే కావ్యత్వం స్థిరమవుతుంది.

"వడివేసి నొదిలేసిన ముంగురులు
పసిపాముల్లా బుసకొడుతున్నై"

పసిపాములు బుసకొట్టగలిగితే కల్పనలో చాతుర్యం వుంది.

"చీకటులు నా కంటి రెప్పల
సెజ్జలందున నేనువాల్చిన వేళలో"

కంటిరెప్పల సెజ్జలు మూలంగా ఉక్తి వైచిత్రి సాధితం. (ఇది ముత్యాలసరం పాడిగించిన తీరు.)

ప్రసిద్ధమైన సమాసాలు ప్రయోగిస్తే శ్రమ తక్కువ. ఆలోచన అవసరమూలేదు. కానీ, రెండు వ్యస్తపదాలను సమస్తంచేసి, ఆ పదాలకు భిన్నమైన ఒక క్రొత్త అర్థం, స్ఫూర్తి సాధించి, భావాన్ని అలవోకగా చెప్పటం కవి ప్రతిభకు తార్కాణ. ఈ సంపుటిలో అలాంటి సమాసాలు చాలా ఉన్నాయి. కొన్ని, "పూలవందలు,—పూలపెండ్లి,— ఆశలపందిళ్లు,— పైడిపందిళ్ళు, ముసలినిప్పు,—ముసలిమామిడి,—పచ్చి తెలుగు,—గరికమెడ,—పిట్టకలము,— వెన్నెలదిండ్లు, చీకటిలిపి,—చీకటిగ్రుడ్లు పెట్టు,—తుమ్మెద సుల్తానులు,—మదిరాక్షుల పెదవులగల మధుశాలలు,—" ఉన్నాయి. కానీ,' నల్లని మంచు' చల్లగా చప్పగావుంది.

ప్రతిమనిషికీ సుఖదుఃఖాలుంటాయి. వాటి ప్రభావానికి లొంగిపోని వ్యక్తులు అరుదుగా వుంటారు. ఏ వ్యక్తి హృదయం ఆ యా భావాలకు స్పందిస్తుందో, ఆ భావం ఎదుటి వ్యక్తి అనుభూతి చెందేటట్లు ఏవ్యక్తి వ్యక్తం చేస్తాడో, ఆ వ్యక్తి కవి. ఈ వ్యక్తి కవి. సుఖదుఃఖాలు, అమృతమూ, విషమూ లాగా కవితా సంకేతాలు.

'కన్నీరే కావలెనా, పన్నీరే కావలెనా' అని ఆత్మ పరీక్ష చేసుకొని, 'కన్నీరే కావలెనని' ఒకనాడన్న కవి, 'కన్నీళ్ళే నాపాలిటి గంగా జలమని త్రాగి', కాలాంతరంలో 'కన్నీరే కావలెనా పన్నీరే కావలెనా' అనే విచికిత్సలో పడి, 'గుండెయే ఒక అశ్రుభాండమై తొణకగా' 'బదులు పల్కలేక శిరము వాల్చు'కొన్నాడు.

'స్మృతులపై లాఠీల వర్షం కురిసి' 'తీపి గడియలందు చేదు జ్ఞాపకమ్ము లేక అందము' అని విశ్వసించి, 'కనురెప్పల క్రశువులు కావలిగా నిల్పుకొని', 'ఒక్కొక రక్తంపు చుక్కతో పూవు మనుగడ పెంచు తీగ సంగతి' చూచి మసకదృష్టితో, 'ద్వేషమును సలసల కాచివైచి బొట్లు బొట్లుగా స్నేహమ్మును ఎదలో వడిపి'కోదలచి, వీలుకాక, 'నన్ను త్రాగనిండు' విషము, నా కదియే జీవరసము' అని తేరుకొని, విషపానంచేసి, కష్టం భరించి, అమృతంవంటి ఆనందంపొంది, 'ఏమిటీ అపూర్వానుభవామృత విషమేళనమ్ము' అనుకొంటూ విస్తుపోయాడు.

కష్టాలు కోరుకొన్నప్పుడు సుఖాలు వచ్చాయి. ఆనందం వాంఛించినప్పుడు దుఃఖం వచ్చింది. సుఖదుఃఖాలలో అందం కనిపించింది. రెండింటి సమ్మేళనం వింతగా రూపుకట్టింది. అందుకే 'సంయోగములో విరహచ్ఛాయలున్న ఒకఅందము. ఆనందములో విషాదగానమున్న ఒక అందము' అని అంగీకరించటంతో కవి ఉత్తమ మానవత్వ శిఖరాలు చేరుకొన్నట్లే!

గత రెండు దశాబ్దాలుగా భారతదేశం,రాజకీయ రంగంలో చాలా పరిణామాలు పొందింది. ఇది ఉన్నతి. దీనికి కారణం గాంధిజీ అనే అభిప్రాయం కవి వ్యక్తం చేయకపోలేదు. 'అజ్ఞాతవాసం'లో పాండవులు అయిదు గురూ అయిదు వర్ణాలుగా, ద్రౌపది భారతదేశంగా భావించినట్లు ఊహింపవచ్చు. స్వాతంత్ర్యం వచ్చిం

తరవాత ప్రణాళికలు ఏర్పడ్డాయి. ప్రణాళికలు కవి దృష్టిలో 'వెలుగు మెట్లు.'

''నేలమీద యిరుకు గదుల
నిల్వలేక నా దేశం
నిలువెత్తుగ కట్టుకొన్న
వెలుతురు కడ్డీల మెట్లు''గా ప్రణాళికలను

భావించి, 'పుడమి గవనునుండి ఆకాశపు లోగిలిదాకా' మనిషి సాగాలని, 'ఈమెట్లపైన కాల్మోపి గమించగ రారా తమ్ముడ' అని తోటి సహోదరుడికి ఆహ్వానం.

భారతదేశం వ్యావసాయికదేశం. దేశాభివృద్ధి జరగవలసిందికూడా ఆ రంగంలోనే. ప్రణాళికల మూలంగా, దేశంలో..........

'' 'ఓమ' గూడ పండనట్టి
ఊషర భూములలోపల
పదార్వన్నె బంగారపు
పైరులు తలలూపునురా'' అని భవిష్యత్తును

ఆశించి,

''నిన మొన్ననేకదా 'గునుగు' పండని భూము
లందు బంగారు సస్యములు తలలూపినవి.'' అది

ఆశ ఫలింపగా వర్తమానంలో కవి తృప్తి.

రాజకీయ స్వాతంత్ర్యంవచ్చి పద్దెనిమిదేళ్లయింది. పొలాలలో బంగారంపండితే, ఆర్థికస్వాతంత్ర్యంవస్తుంది. ఆర్థిక స్వాతంత్ర్యంతోఅన్నదమ్ములుఐదుగురూ'అజ్ఞాత వాసం'లోని కీచకుల్ని ఎందరినైనా ఎదుర్కొంటారు. దేశగౌరవం కాపాడుకొంటారు. సమత తలఎత్తుతుంది. దేశం బుగుజ్జ్వలమవుతుంది. పాలకులూ, పాలితులూ సమానమ్! అప్పుడే

''గిరిజనుడే పురజనుడై
ధరాచక్రమును త్రిప్పే
తరుణారుణ కాలం వస్తున్నది'' అనే

అవకాశం వుంది. 'నా నృషిః కురుతే కావ్యమ్''. కవి ఋషి.—ఆర్షవాక్యం వ్యర్థంకాదు. తథాస్తు!

దేశానికి ప్రణాళికలు అందించినవారిలో అగ్రగణ్యుడు నెహ్రూజీ. ఆ భారత ప్రధాని మరణానంతరం కవి అశ్రువులు నాల్గు ఖండికలలో కనిపించాయి. 'నెహ్రూజీ చనిపోతే', 'విశ్వంభర కంటిపాప వెలుగే మాసిన'దనీ, 'విశ్వమంత ఇందిరమ్మై విలపించిం'దనీ 'తుక తుక మను రక్తాశ్రువు లిక మింగగలే'ననీ కవిలో బాధానుభూతి.

ఈ సంపుటిలోని 'గుండె గుండె కొక దీపం', శ్రీ బోయి భీమన్న వ్రాసిన 'ఒక్కొక్క దీపం''గుర్తుకు తెస్తుంది. ఈ కవి పేరుతోనే ఆకాశవాణిలో—

''గుండె గుండె కొక దీపం వెలిగింది
శిరము శిరము కొక శిఖరం పెరిగింది
గళము గళము కొక గర్జన మ్రోగింది
జాతి మేలుకొని ముందుకు నడిచింది''

పాట వినిపించింది. ఇప్పుడీ సంపుటిలో

''గుండె గుండె కొక దీపకరండం వెలిగిందినేడు.
శిరము శిరముకొక హిమాద్రిశిఖరం పెరిగిందినేడు.
గళము గళముకొక కేసరి గర్జన వినిపించె నేడు.
జాతి రక్తమున సాగరచేతన కనిపించే చూడు''

గేయంగా కనిపించింది.

పై పాటకు, ఈ గేయానికి భావంలో కాదు గానీ పదాలలో, ఛందస్సులో మార్పువుంది. భావం లాగినట్లుంది. శిఖరం అంటే హిమాద్రి శిఖరమనే స్ఫురించవచ్చు. గర్జన అంటే కేసరిగర్జనే అనిపిస్తుంది. పాటలో అల్పాక్షరాలతో అనల్పార్థంవుంది. గేయంలో అధికాక్షరాలతో అదే అర్థం వుంది. పాట ఉత్తమంగా వుంది. అయినా గేయమే సంపుటిలో చోటు చేసుకొంది.

''ఎవడు హిందు వెవడు తురక ఎవడురా కిరస్తానీ?
ఎవరిది తెలుగెవరిదరవ మెవరిది హిందుస్తానీ?''

తురక, కిరస్తానీ సామాన్యంగా నిందార్థకాలు. 'తురక' పదం ప్రబంధకాలంనుంచీ మతపరంగా ప్రయోగింపబడుతూ ఉండటంచేత, సాహిత్యంలో ఆ పద ప్రయోగం అంగీకార్యం కావచ్చు. కాని 'కిరస్తానీ' పద

సాహిత్యంలో నిందాత్మకంగానే ప్రయుక్తం. అయితే కవి హృదయం నింద కాదు. అది హిందుస్తానీ కోసం తయారయిన కిరస్తానీ. అనుప్రాస ప్రయత్నంలో అవక తవక. ఇటువంటిచోట్ల, అర్థప్రాధాన్యం కాంక్షించి, అనుప్రాస విడిచి పెట్టినా మంచిదే! కావలసింది భావ సారూప్యంకాని, పదసారూప్యంకాదు.

'విష వీచి' లో చైనా భారతదేశంపై జరిపిన దురాక్రమణ వస్తువు.

"తోడి దేశమున చొరబడి
దురంతాల కొడిగట్టే
బూజు బుద్ధి తగదుర, చెం
గీజుఖాను సోదరా!" వుంది. చెంగీజుఖాను

చైనా దేశీయుడూ,దురాక్రమణదారుడూకాడు. వీరుడు. ఆసియా వీరుడు. దుర్మదాంధుల కళ్ల పొగరుపిండి గుణపాఠం నేర్పిన ప్రజావీరుడు. చెంగీజుఖాను, ఆంగ్ల చరిత్రకారులచేతుల్లో దుర్మార్గుడుగా చిత్రింపబడి నట్లున్నా, వాళ్లమాటల్లోనే అతని ఔన్నత్యం కని పిస్తుంది. సాహిత్యంలో చెంగీజుఖాను ఉదాత్తవ్యక్తి. కీ. శే. తెన్నేటి సూరి నవల 'చెంగిజ్ ఖాన్' ఉదాహరణ. చైనాను చెంగీజ్ఖాన్ సోదరుడుగా భావించటం, చరిత్రను పూర్తిగా స్పష్టంగా అర్థం చేసుకోకపోవటమే!

'ఒకదండం'లో శ్రీ కామరాజుకు అనేక దండాలు పెట్టినా, ఆ దండాలు గుండెల్లోంచి రాలేదేమో, ఊల బెండుల్లాగా ఉన్నాయి.

'ఎందుకయ్యా బండ్ల కొద్దిగ ఎద కదల్చని కావ్య రాసులు?' 'నన్నొక గీతం గిలుకుమంటివా?' ఇలాంటి కావ్యౌన్నత్యాన్ని కించపరిచే పాదాలు ఈ సంపుటిలో చేరకుండావుంటే బాగుండేది.

ఈకవి రచనలమీద, ఉపమా ప్రయోగంలో కాళిదాసు, అర్థ వైచిత్రి సాధనలో టాగూర్, కల్పనా చాతుర్యంలో షెల్లీ, ప్రభావాలు ఉన్నాయి. కవికి చిన్నయసూరి ఇష్టమే, గిడుగు గురజాడలు ఇష్టమే. గ్రాంథికం ఇష్టమే; వ్యావహారికం ఇష్టమే! అందుకేనేమో ఒక భాష వ్రాస్తుంటే మరొకభాష వస్తుంది. రెండు భాషలూ కలిసిపోతాయి. ఆ భాషలో సౌందర్యముందని చెప్పే అవకాశంలేదు. సంకరంగావుంది.

"ఏమున్నది ఇంకేముంది
ఈ విశ్వం మూలుగుతుంది"
"కనుపించని కారుచిచ్చు
కణ కణమున రాజు కుంది"
"పిడికిట ఇమిడెడు హృదయం
జడధియంత విస్తరించె" ఇలాంటివి

ఎన్నైనా చూపించవచ్చు.

డాక్టర్లు శరీర రోగాలు కుదర్చవచ్చు. భాషలో డాక్టర్లు భాషలో రోగాలు నయం చేయాలి. "మనిషి, ఇంకా, కోసము, ఐనా, అంతా, దాకా, ఇంటా బయటా, తొడిగే" ఇలాంటివి ఎన్నో!ఈ పదాలు గ్రాంథికంలో నిర్దుష్టాలుకావు. కావని తెలిసికూడా సారళ్యంకోసం, ప్రయోగించినట్లు వూహించినా, "వాణ్ణి, వాళ్ల, అను మంటే, బతుక్కి" ఇవి రచనలో వాడదగిన వ్యావ హారిక పదాలేకాదు. గగనవాణి అంటే ఆకాశవాణి (Radio)అనే అర్థంరాదు."మొదటిపదిహేనో ఆగష్టు" అంటే వూహించిందానికి భిన్నార్థం వస్తుంది. 'చిరునవ్వుచు'—ఎలా సాధ్యమో!

"అక్షరాల గవాక్షాలు" అనే ఈ కావ్యసంపు టిలో అదే మకుటంతో ఒక కవితవుంది. శీర్షికఅర్థం అంతుపట్టదేమోనని చివరి అట్టమీద కవి పరి చయంలో 'అక్షరాల గవాక్షాల'కు అర్థం చెప్పటం జరిగింది.

'అకాదమీ అవార్డు అందుకొన్న ఆంధ్ర మహా కవి అభినవ కవితా సంపుటి' అనేది మొదటి అట్ట మొదట్లోవుంది. దానిఅర్థం కవి పరిచయంలో వ్రాయ లేదు. ఆలోచించండి ఆంధ్రులు !

—"మనోరాణి"

# వ న సీ మ ల లో

(రచన : ఫెలిక్స్ జల్టేన్. అనువాదం : మహీధర నళినీ మోహన రావు; అవంతీ ప్రచురణలు, ప్రజాశక్తి నగర్, విజయవాడ—2. పుటలు 232; వెల : సాదా ప్రతి రు. 3.00; లైబ్రరీ ప్రతి రు. 5,00.)

మహాకవుల రచనల్లో పక్షులు పాడతాయి; జంతువులు పలుకుతాయి; సృష్టి యావత్తూ చైతన్య వంతమై చేతనాచేతనముల భేదము విస్మరించి లయాతీతమైన ఒక వినూత్న ఛందస్సులో గానం స్తుంది. ఆ గానం జీవాన్ని నింపుకొని జీవితానికి ప్రతిబింబమై మానవహృదయాల నుత్తేజ పరుస్తుంది. పుస్తకాలలో చిలకలు మాత్రమే గాక మిగిలిన పక్షులన్నీమాట్లాడటమూ, మనుష్యులలాగే వాటి జీవిత విధానం చిత్రిత మవటమూ ఈ నాటి సరికొత్త పంథా యేమీ కాదు. పంచతంత్రమూ, హితోప దేశమూ మొదలైన గ్రంథాలలో పాత్రలు పశు పక్ష్యాదులైనా భావప్రకటనమాత్రం మానవహృదయం లోనుండి వెలువడినదే. మన ప్రాచీనగ్రంథాలలో హంస సందేశాలూ, చిలక రాయబారాలూ, కోకిలమ్మ గానాలూ కోకొల్లలు. ఈవిధముగా పశుపక్ష్యాదులను పాత్రలుగా చేసికొని ఆయా రచయితలేమి సాధించారని ప్రశ్నించుకొని ఆలోచిస్తే మనిషికి లాగే జంతువులకూ మనస్సుంటుంది. వాటి హృదయమూ రాగద్వేష సంభరితమే. వాటి జీవితం లోనూ వెలుగునీడ లుంటాయి. ఒక ఆధునిక యుగ కవి "పీతకుండే కష్టాలు పీతకీ ఉన్నాయి" అని చమత్కరించినట్లే మనిషికున్న కష్ట సుఖాలూ, ఆనందోద్వేగాలూ, పశుపక్ష్యాదులకీ ఉన్నాయి.

ఈవిధమైన రచనలు ప్రసిద్ధిపొందిన ప్రపంచ భాష లన్నింటిలోనూ ఉన్నా అవి సర్వ సాధారణంగా బాలబాలికలకే ఉద్దేశింపబడినట్లు తోస్తవి. పెద్దలు ముట్టరానివని కాదు గాని సామాన్యంగా పెద్దలు ఆ రచనల నంతగా లక్ష్యపెట్టరు. అయితే వృద్ధా ప్యంలో బాల్యం తిరిగి వస్తుం దంటారు. దానికి తార్కాణగా మనం వృద్ధులలో బాల్య చేష్టలే గాకుండ పిల్లలు చదువుకునే 'కాకమ్మ కథలు' చదువుతూ ఉండటం గమనిస్తాం.

'బేంబి' అనే పేరు గల ఆస్ట్రియా దేశపు నవల పశుపక్షులను పాత్రలుగా చేసికొని రచించిన నవల లలో వినూత్న సృష్టి. అందుకే యిది ప్రపంచ భాషలలో పెక్కింటిలోనికి అనువదింపబడింది. శ్రీ మహీధర నళినీ మోహనరావుగారు చక్కని తెనుగు నుడికారంతో యీ నవలను మనోజ్ఞంగా అనువ దించారు. ఈ నవల ఖ్యాతి దేశదేశాలకూ ప్రాకింది. స్విట్జర్లాండులో ఈ నవల ముఖ్య పాత్ర బేంబి పేరిట ఫుట్‌బాల్ ఆటగాళ్ళకు 'బేంబి ప్రైజ్' ఏర్పాటు చేశారట. ఇప్పుడీ నవల రష్యన్ భాష నుండి అనువదితమైంది.

సంస్కృతంలోని పంచతంత్ర గాథలను తెనుగు వచనంలో వచన వాఙ్మయబ్రహ్మ శ్రీ చిన్నయసూరి అనువదించారు. అసంపూర్తియైన వారి కృషిని దొరకని శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు వేరువేరుగా అనువ దించి పూర్తి గావించారు. కొన్ని దశాబ్దాలుగా పాఠ్య గ్రంథాల ద్వారా, ఇతర పత్రికల ద్వారా తెనుగు బాలబాలికలకు ఈ గాథలు సుపరిచితాలు. పైవారి అనువాదాలలోని భాష సుందరమైనా సులభ శైలి కాదనే చెప్పాలి. అటువంటి గాథే ఈ 'బేంబి కథ'. ఒక్క విశిష్టత మాత్రమీ 'వన సీమలలో' అనే పుస్తకాని కుంది. అదేమంటే పంచతంత్ర గాథలు వినోదాన్ని విజ్ఞానాన్ని వికాసాన్ని కలిగిస్తాయి. ఈ బేంబి కథ హృదయాన్ని కదలించి సజీవమైన ఆటవిక వాతావరణంలో పుస్తకం చదువుతున్నంతసేపూ మరో సుందరలోకంలో విహరిస్తున్న ట్లుంటుంది. చివరకు నవల చదివిన తరువాత చదువరుల మనస్సులలో సాధారణంగా కలిగే

గంభీరమైన తాత్త్విక చింతనా కలుగుతుంది. అంతే కాదు, ప్రతి మనిషి అంతర్ముఖుడై తాను జంతువుల నుండి ఏయే విషయాలను నేర్చుకోవచ్చునో, సాధు జంతువులను హింసాత్మక ప్రవృత్తితో చంపి, తాను యే మహాభాగ్యాన్ని బాపుకోలేకపోతాడో చక్కగా నిరూపిస్తుంది.

బాలబాలికల వయస్సెంత పెరిగినా, మిత్రలాభ మిత్రభేదాల నీతికథ లేవిధంగా వారి మనస్సుకు హత్తుకుపోతాయో, చిరస్మరణీయాలవుతాయో అట్టి విధంగా 'వనసీమలలో' నవల చదివినవారికి గూడ మరపురాని అనుభూతి కలుగుతుంది. కాలానుగుణంగా పాఠకులు భాషలో సులభశైలిని అభిలషిస్తున్నట్లే అనువాదకులు లలితమైన తెలుగు పదాలలో ఎక్కడా కృత్రిమత్వం కన్పించనీయకుండా రచించారు.

'బేంబి' అందమైన లేడిపిల్ల., నుగిది. బేంబీ అమ్మలో మాతృత్వం తొణికిసలాడుతుంది. తల్లికి బిడ్డయెడల ఉండే అనురాగాతిశయమంతా బేంబి అమ్మలో సహజంగా కన్పిస్తుంది. చిన్నారి బేంబి చిట్టిపొట్టి ప్రశ్నలూ, వింత సందేహాలూ, భయమంటే ఏమిటో తెలీని అమాయికత్వమూ ముచ్చట గొల్పుతాయి. సీతాకోకచిలుకను చూసిన 'బేంబి' అది పువ్వనుకుంటాడు. తన చిన్నారి నేస్తాలు 'గోబో', ఫలీనాలు కూడ 'అపాయమంటే ఏమిటో తనకు తెలియజెప్పలేక పోతారు. అడవిలో సాధారణంగా కన్పించే జంతువులన్నీ ఇందులోని పాత్రలు. వాటికీ మనుష్యులకు మల్లేనే పిన్ని, మామయ్య మొదలైన వావి వరుస లుంటాయి. అవి రాగద్వేషాలతో కూడిన కుటుంబ సభ్యుల మల్లే ఆ అడవిలో జీవిస్తూంటాయి.

'గోబో' మరీ అమాయకుడు—మరీ అమాయకుడు కావటం చేతనే మనిషిచేత చిక్కి కొన్నాళ్ళు పెంపుడు జంతువుగా పెరిగి మనిషి పెంపకంలోని మాధుర్యాన్ని గుణించి తనవాళ్ల దగ్గర గప్పాలు కొడతాడు. నమ్మి, ధైర్యంగా మనిషికి ఎదురుగ్గా పోయి తుపాకీ దెబ్బతిని అసువులు విడుస్తాడు. ఈ దృశ్యం ఎటువంటివారి మనస్సులనైనా కదలిస్తుంది. జంతువులన్నీ తమను వేటాడి చంపే మనిషిని గూర్చి ఎంత భయపడతాయో, ఎంత ద్వేషిస్తాయో కళ్లకు కట్టిస్తుందీ నవల.

పిల్లలు ఒంటరివాళ్లయినప్పుడు ఏణిపిన్ని తన మాతృత్వంలోని ఔన్నత్యం ప్రదర్శించి బేంబీని ఆదరిస్తుంది. ఫాలీనా అతగాడిని తన ముగ్ధత్వంతో అకర్షించి సమ్మోహితుడిని చేసి అతడి చెవిలో "నువ్వంటే నా కెంతో యిష్టం" అని చెప్పి సిగ్గుపడుతుంది. జింకల నాయకుని మాటల్లోనూ చేతల్లోనూ రాజసం గోచరిస్తుంది. అనుభవాలతో జ్ఞానాన్ని పరిపూర్ణం చేసికొనిన మానవుని వ్యక్తిత్వం ముదుసలి నాయకుని పాత్రలో వ్యక్తమవుతుంది. కుందేలు మామయ్యా, గర్విష్ఠి సీతాకోక చిలుకా, అపాయాన్ని సూచించి సాయపడే గుడ్లగూబ అన్ని పక్షులూ, జంతువులూ ఈ నవలలో చెవికింపైన సవ్విడి చేస్తాయి.

మానవ జీవితంలో వలెనే అనురాగాలూ, అనుభూతులూ జంతువులలోనూ, సర్వ సాధారణమని నిరూపించి, అందంగా చిత్రించిన ఈ మహోన్నతమైన నవలను అనువదించి ఈవిధమైన వాఙ్మయ సృష్టికి శ్రీ నళిని మోహనరావు మహోన్నతమైన సేవ చేశారు. వారి స్వచ్ఛందమైన, ముద్దులొలికించే తెనుగు నుడికారం యిటువంటి నవలలను వారెన్నో అందించగలరనే ఆశను రేకెత్తిస్తున్నది. పుస్తకంలో అక్కడక్కడా ముద్రించిన బొమ్మలు ముచ్చట గొలిపి భావాలను చక్కగా వెలువరిస్తున్నాయి.

## హరివిల్లు

[కథలసంపుటి. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథ మాల 182 పుటలు, వెల: రు. 3—25.]

తెలుగులో కథలు చాలావరకు 'ప్రేమ కథలు' లేదా 'ఆకలి కథలు'గా తేలిపోతున్నాయి. భాష ఉన్న

వారికి జీవిత దృశ్యాలనందుకునే నేర్పు చాలక, భావాలున్నవారికి వాటిని వెలువరించేటందు కనువైన కల్పనలూ,సంఘటనలూ, సంభాషణల నిర్వహణా, భాషలో సహజమైన తెనుఁగుదనమూ లోపించి తెనుఁగు కథలలో ఎక్కువ భాగం వెలుగు నీడలను సరిగా అమర్చుకోలేని ఛాయా చిత్రకారుని (Photographer) చిత్రాలుగా మిగిలిపోతున్నవి. అంటే కథలు ఛాయా చిత్రాలు కావాలనికాదుగాని అసలు కళాత్మకమైన ప్రతిభే పెక్కింటిలో మృగ్యమవుతున్నవి.

యాంత్రిక జీవనం మనిషి శక్తినీ సహనాన్నీ కృంగదీస్తున్నది. సహనం తగ్గిపోతున్న మనిషి రచనలోని గాంభీర్యానికి నానాటికీ దూరమౌతున్నాడు. అందుకే చాల కథలు తఋచు తుదిని చెప్పవలసిన విషయమే మొదటి వాక్యంలో సాక్షాత్కరించి చిత్తమొచ్చినట్లు కత్తిరించిన కాగితపు పూలౌతున్నాయి. కొన్నికొన్నిమాత్రం అరుదుగా నిత్యమల్లిపువ్వులవంటి కథలు దర్శనమిచ్చి పారవశ్యాన్ని కలిగిస్తున్నవి.

తెలుఁగు పత్రికలు అల్పాయుష్షం బిడ్డలు. 'భారతి'వంటి ఏ ఒకటి రెండో తప్ప కాలాని కెదురొడ్డి సాహిత్యరంగంలో నిలిచిన పత్రికలే లేవని చెప్పాలి. మరీ మంచి కథలు జనాదరంలేని పత్రికలలో పడి నశించిపోకుండ సంరక్షించుకొనవలసిన బాధ్యతవుంది. ప్రసిద్ధమైన పత్రికలలో పడినవైనప్పటికీ అవి మస్తిష్కపు పొరలమాటున మాటుపడి పోకూడదు. వాటి నొకచోట చేర్చి అన్ని రుచులూ అందించి షడ్రసోపేతమైన విందుచెయ్యాలి. అందుకే సాహితీ మర్మజ్ఞులు కథా సంకలనాలకు పూనుకుంటున్నారు. తెలుఁగుకథారచనలో చేయితిరిగిన మరచిపోలేని ముద్రవేసిన ఏడుగురు కథకుల కథలను గుచ్చెత్తి వాటిని అందంగా అమర్చిన 'హరివిల్లు' ఈ పుస్తకం.'హరివిల్లు'అందరికీ అందంగా వున్నా అందులోని కొన్ని కొన్ని రంగులు కొందరికి మరీ ఇష్టం.కొన్నిరంగులు కొందరికి సయించవు. అభిరుచుల వైవిధ్యాన్నిబట్టి మంచి రచనల యెన్నిక జరుగుతుంది. "ఇదీ మా తెనుఁగు కథ" అని ప్రపంచానికి చాటి ఖ్యాతి గడించిన భగీరథులు శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి "కరణం కనకయ్య వీలునామా" అనే కథ ఈ సంకలనానికి ప్రత్యేకమైన ఆకర్షణ.

'ఎదురుచూచినముహూర్తం'అనే కథలో వస్తువూ, వస్తువుకు సంబంధించిన సమస్యా, సమస్యకు పరిష్కారమూ పాత పద్ధతే. అనుభవజ్ఞుడైన రచయిత తన శైలీ గాంభీర్యంతో కథను నడపటం ప్రత్యేకత అనిపిస్తుంది.

'నివురు గప్పిన నిప్పు' అనే కథ స్త్రీ స్వాతంత్ర్యాన్ని కాంక్షించే రచయిత తన ఆదర్శమే ప్రయోజనంగా పెట్టుకుని కథను వ్రాశారనిపిస్తుంది. కథ చదవగానే సంఘటనలూ, వాటి నిర్వహణా, కృత్రిమంగా తోచిన ఆదర్శం వెల్లడించటంలో రచయిత ప్రగాఢమైన విశ్వాసం ముగ్దుణ్ణి చేస్తుంది.

'ముగింపు' కథ వ్రాసిన రచయిత ఏ ప్రయోజనాన్ని ఆశించారో దురూహ్యం. దంపతు లిరువురూ ఉద్యోగాలు చెయ్యటం మంచిదికాదని రచయిత అభిప్రాయమా? అదైతే దారుణం. పోనీ అదేమీకాదు. వాళ్ళు ఉద్యోగాలు చెయ్యటంవలన తప్పనిసరిగా ఏర్పడుతున్న చిక్కులను ఆ సమస్యనూ చెప్పదలచుకుంటే యథాతథంగా చెప్పటంలో కృతకృత్యులయ్యారు. భార్య ఉద్యోగం చెయ్యటం తమ సాంసారిక జీవితానికి అంటకమనీ, ఆనందాన్ని దూరం చేసుకుంటున్నామనీ భావించే భర్త, కొంతకు కొంత సంస్కారవంతుడుగాబట్టి ఆ విషయాన్ని సూటిగా చెప్పి భార్య మనస్సును నొప్పించడు. కాని ఆలోచనాపరుడూ,రచయితా గాబట్టి తన ఊహలను రచనలో జొప్పించి అదే సమస్యనిచ్చి 'ముగింపు' ఆలోచించి పెట్టమంటాడు. చదువుకున్న భర్తలూ, తమ ఆనందమే ఇరువురి ఆనందమూ ననుకునే సంస్కారవంతుడైన భర్త నెదిరించలేక, ఎదిరించి

సంసారాన్ని దుఃఖభూయిష్ఠం చేసుకోలేక ముగింపు తెలియజేస్తుంది—తాను ఉద్యోగానికి రాజీనామా యిచ్చి. ఈ కథలోని సమస్యలో జీవం ఉన్నదిగాని పరిష్కారం పెడత్రోవపట్టింది.

'ఆ గాజు బొమ్మ' అనే కథ శ్రీ వాకాటి పాండురంగారావ్‌గారి విశిష్టమైన రచనా విధానాన్ని తెలియజేస్తుంది. ఇంత చక్కని శైలిలో వచ్చిన కథలను తెలుగు సాహిత్యం మొత్తంలోనే వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చు. కథలో బలమైన కథా సంవిధానమూ ఒక్క బిగిన చదివించే పటిష్ఠమైన రచనా, అడుగడుగునా ఔత్సుక్యం తొణికించే సన్నివేశకల్పన ఈ రచయితకు మహోన్నతమైన భవిష్యత్తుకు దారి చూపిస్తున్నవి. వీటికితోడు గంభీరమైనఆలోచనలకు తావైన "అదంతా ఒక సంస్కృతి, ఒక ప్రత్యేక ప్రపంచం. అక్కడ గొంతెత్తి పలకడం నేరం. హాయిగా నవ్వడం అనాగరికం. నిజం చెప్పడం అపరాధం"వంటి వాక్యాలు మానసిక వికాసాన్ని కలుగజేస్తవి. అలాగే "కార్లలో తిరుగుతూ సంఘ సేవచేసే 'తెల్లటి లావుపాటి ఆడవాళ్లు" అనే వర్ణన మొదట నవ్వు తెప్పిస్తుంది. తరువాత మెదడును కలతపెట్టి దిగ్భ్రాంతిని గొలిపే నిజాన్ని వెల్లడిస్తుంది. "ఒక మనిషి అభ్యుదయ భావాలు కలవాడనవచ్చును. అతడే మంచి చిత్రకారుడూ అనవచ్చును. కాని అభ్యుదయ చిత్రకారుడు అనటం కేవలం దుష్టసమాసం"—ఇంత చక్కని చిత్రకళా విమర్శ మనకు సాహిత్యంలోనే అరుదుగా కన్పిస్తుంది. ఇటువంటి కథ ఉత్తమ ప్రపంచ కథానికల జాబితాలో ఉండవలసినది.

"ప్రేమించు ప్రేమకై
ప్రేమించు ముక్తికై" అని ప్రేమ భావనలోని ఔన్నత్యాన్ని ఎలుగెత్తి చాటా రొక భావకవి. సంభోగ విషయాల ప్రస్తావన లేకుండానే ప్రేమను తమ రచనలలో వర్ణించవచ్చుననే అభిప్రాయాన్ని 'అభినవ కవిత' కలుగజేస్తుంది. అంతటితో మనోల్లాసం కలిగించే ప్రేమభావాలు కథలలో విరివిగా సాగాయి.

కుమారి పి. లీలగారి 'దీపం పురుగులు' అనే కథ ఈ విధమైన ప్రేమ కథలలో ఎన్నదగినది. ఈ కథలో హేమా అనే అమ్మాయి అంటుందిగదా "బావా! నీ మనస్సులో నా దీపాన్ని వెలిగించి వెడుతున్నా. ఈ వెలుగును వెతుక్కుంటూ ఎక్కడఉన్నా తిరిగివస్తా!" హృదయాన్ని ద్రవింపజేసే భావం?

'అంతరం' అనే శ్రీ 'ధనిష్ఠ'గారి కథ ఓ కమ్మని జీవితదృశ్యం. ఇది కథల్లోతప్ప జీవితంలో జరగదేమోనని శంకించేవారికి శ్రీ సంజీవదేవ్ 'ప్రేక్షణ'లో "వాస్తవ జీవితాన్ని సాహిత్యం అనుకరించినా అనుకరించకపోయినా సాహిత్యాన్నిమాత్రం వాస్తవ జీవితం అనుకరిస్తుంద"ని చక్కని సమాధానం చెప్పారు. సమర్థవంతుడైన రచయిత సమాజాన్ని అప్పుడప్పుడూ శాసించగలుగుతాడు గూడ!

మహా రచయిత లొక్కొక్కసారి కీర్తిని జీర్ణించుకోలేక తేలిక రచనలను చెయ్యటంకద్దు. కుర్చీలు విరిగితే కూర్చోటం మానమని ఎక్కడో చతికిలబడటం జరుగుతుంది ఒక్కొక్కసారి. కాని శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారుమాత్రం కళాఖండమూ, రసోల్లాసమూకాని రచన చెయ్యడం జరుగలేదు. 'చిట్టితల్లి' అని వారు వ్రాసిన కథానిక నుతింపదగినది. 'కరణం కనకయ్య వీలునామా'లో వ్యంగ్యపూరితమైన హాస్యం ఉంది. వీలునామా రూపంలో వెలువరించిన పాత్రల స్వభావోన్మీలనం మరపురానిది.

తెలుగు కథానికా స్వరూపాన్ని పూర్ణంగా గాక పోయినా ఆంశికంగానైనా చూపించే ప్రయత్న మిందులో జరిగిందనటం అతిశయోక్తి కాదు. ఇటు వంటివే మరికొన్ని కథానికా సంపుటాలొస్తే తెనుగు కథకు సమగ్ర స్వరూపం చేకూరుతుందనటం న్యాయం. అందుకై కృషి చేసిన శ్రీ గోదా గ్రంథమాలవారు అభి నందనీయులు. ---రామమోహనరాయ్.

# సుమతి, వేమన శతకాలు

(అనువాదం : శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు ; ప్రచురించింది-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ; తిలక్‌రోడ్డు, హైదరాబాదు— వెల : రూపాయి.)

తెలుగు దేశంలోని అబాల గోపాలమూ, చదువుకొన్న పండితులు అయినా, చదువురానివారు అయినా సుమతి, వేమనల పద్యాలను, ఒక్క పద్యాన్ని గాని, కనీసం ఒక్క పద్యపాదాన్నయినా గాని చదువుకో కుండా ఉండరు. తమ తమ జీవితానుభవాలలోనికి వాటిని రంగరించుకోకుండా ఉండరు. జీవితాను భవాల సారం అయిన సుమతి శతకం—వేమన పద్యాలు—జీవితం అంతగా విశాలం అయినవి. జీవి తాన్ని మథించి, సత్యాలను సులభసుందరంగా చెప్పడం —వీటి విశిష్టత. ఈ సంపద తెనుగువారి ఆస్తి.

ఈ తెనుగు సంపద యింతకాలమూ, తెనుగు దేశం దాటి, తెనుగు హృదయాలను దాటి, భార తీయం కాలేదు.. పరిమితమైన శక్తిగల భాషా కుడ్యాలు అడ్డం వస్తూనే ఉన్నయ్. ఈ శతకాల మహత్తును—సంస్కృతభాష ద్వారా భారతీయం చేయాలనే పూనికతో శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుగారు— వీటిని సంస్కృతంలోకి అనువాదం చేశారు.

సాధారణంగా ఒక సంగతి కనబడుతూంటుంది. ఏ రచయిత అయినా, చిన్న వయస్సులో స్వతంత్రంగా వ్రాస్తే—ముద్దు. పెద్దవారు అయిన తదుపరి, మాట, మనసు, అంతరంగం పక్వం అయిన తదుపరి తర్జుమాలకు దిగితే ముద్దు. తర్జుమా పసి కుదిరి పాకాన పడుతుంది. వరదాచార్యులుగారు —పెద్ద వయస్సున చేసిన ఈ సంస్కృతానువాదం మూలగ్రంథం అంత పక్వంగానూ, మధురంగానూ ప్రసన్నంగానూ కుదిరింది. మన అదృష్టం.

అవిదితా హ్యాయకేన మనీషిణా
కృతిరియం కృతినాంధ్రగిరీరితా
తదనువాద మిమం శతకాత్మకం
సహృదయాః శృణుతాదరణోచితం—అనీ,

ఆంధ్రీ నిబద్ధ కృతితః కవి వేమనస్య
పద్యాని కానిచన లోక హితోపయుంజి
గీర్వాణవాచి పరివృత్తి మవాపితాని
దోషా యదీహ పరివర్తయితు ర్నకర్తుః.

అన్న శ్లోకాలు—'విద్య యొసగును వినయంబు' అన్న సూక్తికి ఉదాహరణలు. సాధారణంగా విద్య యిచ్చేది అహంకారాన్ని. ఏ అదృష్టవంతులకో గాని విద్య ద్వారా వినయం అబ్బదు.

సుమతి శతకం తెలుగులో ఎంత సుప్ర సన్నమో—సంస్కృతానువాదంలోనూ అంత సుప్ర సన్నం. భావం సరళరేఖగా నడవక, అటూ యిటూ తిరిగినా—రచనలో మార్పు కనబడదు.

అప్పిచ్చు వాడు వైద్యుడు
నెప్పుడునెడతెగకపాఱు నేఱును ద్విజుఁడున్
జొప్పడిన యూర నుండుము—
చొప్పడ కున్నట్టి యూరు చొరకుము
—సుమతీ.

ఈ పద్యంలో భావం సరళరేఖగా సాగక అటూ యిటూ నడిచింది. ఇలాంటి వాటిని సైతం,

ఋణదాతాఽగదజ్కారో
నదీ నిత్యజలా ద్విజః

యత్ర తస్మిన్ వస గ్రామే
నో చేత్తం సుమతే త్యజ—అన్న సంస్కృత భాషలో యింత చిన్న ఛందస్సు ఆవరణలో యిమడటం ఆ పద్య పుష్పంలో ఒక్క రేఖ కూడా నలగక పోడం—సంతోషం కలిగించక పోదు.

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు పామరుడు దగన్
హేమంబు కూడబెట్టిన
భూమీశుల పాలు జేరు భువిలో సుమతీ.

ఈ పద్యానికి,
పిపీల నిర్మితాయాన్తి వల్మీకాః ఫణినాం వశం
త థాజ్ఞైః సంచితం విత్తం సుమతే
నృపసాద్భవేత్.

అన్న అనువాదం విశేష సుందరం. చీమకు మామూలుగా—అనుకునే మాట పిపీలిక. ప్రసిద్ధం అయిన మాటను వదలి 'పిపీల' శబ్దాన్ని ప్రయోగించడం విశేషం.... ఈ మాట కూడా, ఉన్నదా అని చూచుకొనేవారికి—ఆప్టే నిఘంటువులోని

పిపీలః, పిపీలీ—An Ant (ఒక చీమ)
పిపీలకః—A large black ant(కొండచీమ)
పిపీలికః—An ant
పిపీలికం—A kind of gold, said to be collectd by ants (చీమలు లాక్కువచ్చే ఒకరకం బంగారం).
పిపీలికా—A female ant (ఆడచీమ)

అనే అర్థాలు విశేషాలు గోచరించి శబ్ద ప్రయోగం విలువ తెలుస్తుంది. శబ్ద శక్తి తెలుసు కోటం కవితో పాటు చదువరికీ ఎంతో అవసరం మరి.

సంస్కృతానువాదం అయినా, తెలుగువారికి తెనుగు రచన కొట్టిన పిండి అయినా, ఈ సంస్కృతానువాదం—సంస్కృతం రాని తెలుగువారికి కూడా తేట తెల్లం అయ్యే సుగుణం కలది.

ఉపకారికి నుపకారము
విపరీతము కాదు చేయ వివరింపంగా
అపకారికి నుపకారము
నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ.

యీ పద్యంలో జీవితానుభవాన్ని, కవి, హితోపదేశాన్ని యిమిడ్చాడు. 'నెపమెన్నక' 'నేర్పరి' అన్న మాటలు—ఆయువుపట్టువంటివి!

ఉపకర్తారముద్దిశ్య నోపకారేస్త్య పూర్వతా
ఉపకర్తాపకర్తుస్తు సుమతే సుజనోమతః
అన్న ఈ అనువాదంలో 'నెపమెన్నకుండా' ఉపకారం చెయ్యాలి' అన్న బలం పోయింది.

వేమన తెలుగుల యోగి. 'సత్యం శివం సుందరం' అన్నమాట బజారునపడి నలుగురి నోళ్లలోనూ పడినదే. సత్యం శివం సుందరం అనేది ఒక సరళరేఖగా భావించి, ఆ రేఖకు ఒక అంచు సత్యం అనీ— మరొక పెడ సుందరం అనీ భావించుకుందాం. సత్యంద్వారా శివమును చేరడం యోగి మార్గం. సౌందర్యంద్వారా శివమును చేరడం కవిమార్గం. నిగూఢమై ఉన్న—సత్యాన్ని తాను చెప్పి— ఆ సాధనామార్గంలో నడిచి నడిపించినవాడు వేమన. సౌందర్యమార్గంలో నడిపించినవాడు వాల్మీకి. ఇది స్థూలంగా చెప్పుకొనేమాట! ఆ సౌందర్య మార్గ గాములకు— సత్యం ఆధారం. ఈ సత్య మార్గగాములకు సౌందర్యం అవగుంఠనం. వేమన్న కవికాడు, కాళిదాసు యోగికాడు. వేమన్నయోగి, కాళిదాసు కవి. వేమన పద్యాలు ఆటవెలదులు. ఆయన తన యిచ్చ వచ్చినట్లు చెప్పిన పద్యాలు ఆటవెలదులే అనీ—తదితరాలు ప్రక్షిప్తాలేమోననే అనుమానం నాకు ఉంది. కాని, పెద్దలుమాత్రం, ఆటవెలదులనేకాక, కంద పద్యాలను గూడా పరిగణన చేశారు!

వేమన పద్యాలకు (C. P. Brown) ఏనాడో ఆంగ్లంలో వచన అనువాదంచేసి పుణ్యం కట్టుకున్నాడు. ఆ అనువాదం కూడా తెలుగు సరిహద్దులను దాటినట్లు తోచదు.

స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్రదీపమునను చీకటి చెడనట్లు
విశ్వదాభిరామ వినురవేమ

అన్న పద్యానికి C. P. Brown గారు—without Personal experience, the mere savor of the Secipture will not remove the fears of the aspirant; as darkness is never dsipelled by a mere painted flame అనే తర్జుమాచేసి ఊరుకోక—

The three terms Sadhaca, Sadhana, and Sadhyam in Indian philosophy signify the agent, the instrument, and the object of any act, as *mind* deliberation and execution, or the thinker, his hand, and the work produced. The relative senses of fhe three words (with their numerous derivetives) may be recoflected by the following hexameter Sadhaca, Sadhana, Sadhyam, Ego, calamusque, liberque, or we might read Sadhaca, Sadhana, Sadhyam Seriptor, Penna, libellus అని వివరించారు. ఇది సరియైన పద్ధతి.

వేల సంఖ్యమీాదఉన్న వేమన్న పద్యాలు—(బందరు ప్రతి) చూస్తే—అన్నీ వేమన పద్యాలుగా తోచదు. రచనా సౌందర్యం సమంగా అన్నింటా కనబడదు. ఎన్నివేలకు వేలు పద్యాలు— ప్రక్షిప్తాలో ఎంచుకొని ఏరుకోవలసి ఉంటుంది. తప్పదు. వరదాచార్యులుగారు, వేమన పద్యాలలో—నూటరెండు పద్యాలను ఎంచుకొని తర్జుమా చేశారు. మూలగ్రంథంలోని సారళ్యం అనువాదంలో ఉండి రెండూ ప్రసన్నాలు అయి చప్పున మనస్సుకు ఎక్కుతయ్!

చంపదగిన యట్టి శత్రువు తన చేతం
జిక్కెనేని కీడు సేయరాదు!
పొసగ మేలుచేసి పొమ్మనుటేచాలు
విశ్వదాభిరామ వినురవేమ.

అనే పద్యానికి—

శత్రుమాత్మవశం యాతం
హన్తవ్యమపి సంత్యజేత్ ।
ఉపకృత్యాతు తం హన్యాత్
శ్రూయతాం వేమ విశ్వద ॥

మూలంలో 'చాలు' అన్న ముక్క, అనువాదంలో 'హన్యాత్' గా మారటంలో విశేషం ఉంది. విషయం—చంపడం, కీడు చేయటం. 'చాలు' అన్న పాఠంలో—దెబ్బకు దెబ్బ వాచ్యం కాదు. 'చాలు' అన్న దానికి 'చావు' అన్న పాఠాంతరం ఉంది! అది యోగ్యతరం అయినది. C. P. Brown పై పద్యానికి 'చాలు' కు బదులు 'చావు' అనే పాఠాన్ని స్వీకరించాడు. ఆయన ఆంగ్ల వివరణ—

Though a foe worthy of death fall into thy hand, afflict him not, conciliate him by goodness and bid him depart. This is death to him.

చాలు అన్న పాఠం—అచ్చొత్తి, 'హన్యాత్' అన్న అనువాదాన్ని ప్రచురించిన ప్రకటనకర్తలు—శ్రద్ధ తీసుకోవలసింది.

ఈ సుమతి వేమన శతకాలు, తెనుగుజాతి సహర్షంగా చెప్పుకోతగ్గ 'సంపద.' 'యత్ర విశ్వం భవత్యేకనీడం' అన్నట్లుగా పరస్పరం సహకార సౌహార్ద సాంస్కృతిక సంపదలు అవగాహన చేసుకునే యీ కాలంలో—భారతీయ సంస్కృతికి మూలకందంఅయిన సంస్కృత భాషలో చక్కని అనువాదం నసిపడడం

శుభసూచకం. తెనుగు పద్యాలు, సంస్కృతానువాదం స్పష్టంగా కనబడేట్లుగా ఈ గ్రంథం ప్రకటించ బడింది. సంస్కృతానువాదాన్ని నాగరిలిపిలో అచ్చువేసి ఉన్నట్లయితే—ఎంతో ఉపయోగకరంగా ఉండేది! ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అనువాదం చేసినట్లు వివరణలతో ప్రకటించిఉంటే— ఎంతెంతో ఉపయోగం కలగడానికి వీలు ఉండేది!

జ. రు. శా.

## శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి

రచయిత : శ్రీ తుర్లపాటి కుటుంబరావు. పుటలు : 124 . వెల1—50. ప్రాప్తిస్థానం : జైహింద్ పబ్లికేషన్స్, గుంటూరు—2.

## 'భారతరత్న' బొమ్మల శాస్త్రిజీ

రచయిత : శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి పుటలు: 112. వెల రూ. 2—00. ప్రాప్తిస్థానం ఉదయశ్రీ పబ్లికేషన్స్, రవీంద్రటాగోర్‌రోడ్, వరంగల్.

## నవజీవనం

నాటకం. రచయిత: శ్రీ ఎం. రంగకృష్ణమా చార్యులు. పుటలు: 38. వెల 0—80. ప్రచురణ: మెదకుజిల్లా రచయితల సంఘం, అందోలు, మెదకు జిల్లా. ఆంధ్రప్రదేశ్.

## జ్యోతిర్మయి

ముప్ఫైముగ్గురు మహబూబు నగరమండలి కవుల కవితా సంకలనం. పుటలు: 86. వెల రెండు రూపాయలు. ప్రాప్తిస్థానం: జ్యోతిర్మయి సాహిత్య సాంస్కృతిక సమితి, వనపర్తి, మహబూబ్‌నగర్‌జిల్లా.

## గిరిరావు గేయాలు

రచయిత: శ్రీ యేజెళ్ల రత్నగిరిరావు. పుటలు: 64. వెల: నూరు నయాపైసలు. ప్రాప్తిస్థానం: డాక్టర్ యేజెళ్ల రామకృష్ణ, మారీసుపేట, తెనాలి.

## శ్రీ తాడిపత్రి రామలింగ సుప్రభాతము

రచయిత: శ్రీ జోస్యము జనార్ధనశాస్త్రి. పుటలు: 32. వెల 0—40. ప్రాప్తిస్థానం: శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి, రిటైర్డ్ తెలుగు పండితులు, తాడిపత్రి.

## యజుర్వేద - దేవతానుక్రమణిక ఋషిసంవలిత

కూర్పరి: శ్రీ అన్నెకేశవార్యశాస్త్రి. పుటలు: పాకెటుసైజు 72. వెల తెలియదు. ప్రాప్తిస్థానం: ఆర్య గ్రంథాలయము, ముదునూరుపోస్టు, కృష్ణాజిల్లా.

## యజుర్వేదఋషులు ఛందస్సులు,

కూర్పరి: శ్రీ అన్నకేశవార్యశాస్త్రి. పుటలు: పాకెట్‌సైజు 98. వెల 1—50. ప్రాప్తిస్థానం: శ్రీమద్దయానంద వేదానుసంధాన సదనము, 3-5-1003, నారాయణగూడా, హైదరాబాద్-29.

## వివేక తరంగిణి

రచయిత: శ్రీమాన్ కాండూరి కృష్ణమా చార్యులు. పుటలు: 100. వెల ఒక రూపాయి. ప్రాప్తిస్థానం శ్రీ కె. లక్ష్మీకాంతం, ఉపాధ్యాయుడు ఎస్. కె. పి. డి. హైస్కూలు, మద్రాసు—1.

## తత్త్వప్రశ్నలు

రచయిత: శ్రీ కొండూరు కృష్ణమాచార్యులు. పుటలు 184. వెల: 2—00. ప్రాప్తిస్థానం: శ్రీ కె. లక్ష్మీకాంతం, ఉపాధ్యాయుడు, ఎస్. కె. పి. డి. హైస్కూలు, మద్రాసు—1.

## లోకమాన్యుడు

రచయిత: శ్రీ విరించి. పుటలు : 80 వెల: 1—10. ప్రాప్తిస్థానం: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురం, ఉల్లిపాలెంపోస్టు, దివితాలూకా, కృష్ణాజిల్లా.

## మహాపురుషాది యోగములు

రచయిత: శ్రీ దివాకరుని వేంకటసుబ్బారావు. పుటలు: 525. వెల: 5—00 ప్రాప్తిస్థానం: శ్రీవేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల, 3 వ లైను, అరండల్ పేట, గుంటూరు—2.

## భగవద్విషయము

శఠకోపముని సూక్తముగు ద్రావిడామ్నాయముగు తరువాయి మొళిలో మొదటి పత్తులో మొదటి తరువాయిమొళికి తెలుగు వ్యాఖ్యానము. వ్యాఖ్యాత: శ్రీ కాండూరు కృష్ణమాచార్యులు. పుటలు: 154 వెల: ఒక రూపాయి. ప్రాప్తిస్థానం: శ్రీ కె. లక్ష్మీకాంతం, ఉపాధ్యాయుడు, ఎస్.కె.పి.డి. హైస్కూలు, మద్రాసు—1.

## సేవామృతము

శ్లోక, తదనువాద, తద్వ్యాఖ్య రూపమైన, విశిష్టాద్వైతగ్రంథము. రచయిత: శ్రీ కాండూరు కృష్ణమాచార్యులు. పుటలు: 200. వెల: 2—50 ప్రాప్తిస్థానం: శ్రీ కె. లక్ష్మీకాంతం, ఉపాధ్యాయుడు, ఎస్. కె. పి. డి. హైస్కూలు, మద్రాసు—1.

## వేంకటేశ్వర సుభాషితములు

చంపకోత్పలమత్తేభ పద్యములు. రచయిత: శ్రీ కాండూరు కృష్ణమాచార్యులు. పుటలు: డెమ్మీ 56. వెల: 0—75. ప్రాప్తిస్థానం: శ్రీ కె. లక్ష్మీకాంతం ఉపాధ్యాయుడు, ఎస్. కె. పి. డి. హైస్కూలు, మద్రాసు—1.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.